e-book 1



# నేనూ - ఆత్రేయ

## డా॥ తలకోటి పృథ్వీరాజ్

ఆత్రేయ సాహితీ పరిశోధకుడు

e-book

౭ మే ౨౦౨౦న ఆచార్య ఆత్రేయ ౯౯వ జయంతిని పురస్కరించుకుని

ఆత్రేయ సాహితీ పరిశోధకుడు, "ఆత్రేయ సాహితీ స్రవంతి" సంస్థ వ్యవస్థాపకుడు

**డా॥తలతోటి పృథ్వీరాజ్** రచించిన

# నేనూ - ఆత్రేయ

(ఆత్రేయ సాహితీ పరిశోధనలో పృథ్వీరాజ్ కృషిపై ప్రత్యేక సంపుటి)



**INDIAN HAIKU CLUB PUBLICATIONS**

ANAKAPALLI-531001, Visakhapatnam Dist. A.P., INDIA.
talathotiprithviraj@gmail.com Whatsapp: 9963299452
www.litt.in www.talathoti.com



# Nenu~Athreya

by Dr.Talathoti Prithvi Raj



## ‘నేనూ-ఆత్రేయ”

‘(ఆత్రేయ సాహితీ పరిశోధలో పృథ్విరాజ్ కృషిపై ప్రత్యేక సంపుటి)

*- డాక్టర్ తలతోటి పృథ్విరాజ్.*

*ప్రచురణ : 7 మే 2020 .*

*ప్రచురణ కర్త :*
*ఇండియన్ హైకూ క్లబ్ ప్రచురణలు,*
*అనకాపల్లి-531001. ఆంధ్రప్రదేశ్.*

*చిరునామా:*
*డా॥తలతోటి పృథ్విరాజ్*
*ఇండియన్ హైకూ క్లబ్,*
*ఫెయిత్ హోమ్, సాయినగర్,*
*కొత్తూరు పంచాయితీ ఆఫీస్ రోడ్డు ,అనకాపల్లి-531 001.*

*డా॥ తలతోటి పృథ్విరాజ్,*
*తెలుగు అధ్యాపకుడు,*
*ప్రభుత్వ డిగ్రీకళాశాల,*
*పెరుమాళ్ళపురం.*
*తూర్పుగోదావరి జిల్లా.*

*ముఖచిత్రం, చివరిపేజీ, డిజైనింగ్ మరియు డి.టి.పి. :*
*డా॥తలతోటి పృథ్విరాజ్.*
*చరవాణి: 8074004711.*
*వాట్సాప్: 9963299452.*



# అంకితం

నా ఈ పరిశోధనలు... వివిధ రకాలైన మీ సాహిత్య విశ్లేషణలు... వివిధ రకాల కార్యక్రమాల రూపకల్పన – నిర్వహణ అంతా మీ సాహిత్యం గొప్పతనమే ఆత్రేయగారు! అదే నన్ను ఇన్ని పనులు చేయించింది; చేయిస్తోంది!

అప్పుడప్పుడు అనిపిస్తుంటోంది... మీరు భౌతికంగా మరణించకముందు మిమ్మల్ని ఒక్కసారి చూసినా ఇంతకంటే పదిరెట్లు ఉత్సాహంతో పనిచేద్దునూ... అయినా సాహిత్య రూపంలో మీ సజీవమైన రూపురేఖల్ని చూడగలుగుతున్నాను. ఆత్మీయతతో పెద్దలు అన్నట్లు మీ ఏకలవ్య శిష్యునిగా, మీ మానస పుత్రునిగా మీరు నన్ను దీవిస్తారని, అంగీకరిస్తారని ఆశిస్తూ నా ఈ పరిశోధన ఫలాల గురుతులు మీకు గురుదక్షిణగా సమర్పించుకుంటూ...

–డా॥ తలతోటి పృథ్విరాజ్








"నేనూ-ఆత్రేయ" అనే ఈ(ఋ) సంపుటి' పై కోరిన వెంటనే "మనసుకవి ఆచార్య ఆత్రేయకోసమే పుట్టిన శిష్యాచార్యుడు" అనే ముందు మాటరాసిన పంపించిన ప్రముఖ సినీ రచయిత, ఆత్రేయ ప్రియశిష్యులు శ్రీ గురుచరణ్ గారికి,

సినీ రచయితగా, 'డార్లింగ్ స్వామి'గా గుర్తింపును పొంది 20 ఏళ్ళనాటి పరిచయాన్ని గుర్తుపెట్టుకుని నా ఫోన్ నెంబర్ ఎవరివద్దనో సంపాదించి ఏళ్ళనాటి పరిచయాన్ని కొన్నేళ్ళ క్రితం గుర్తుచేయడమే కాదు; ఇప్పుడిలా ఇ-బుక్ కై అడిగిన వెంటనే "అభినందన" పేరుతో అభినందిస్తూ ముందుమాటను రాసి పంపించిన సాహితీ మిత్రులు డార్లింగ్ స్వామి గారికి నా హృదయపూర్వక నమస్కారాలు.

ఇండియన్ హైకూ క్లబ్ సాహిత్య సాంస్కృతిక సంస్థ సభ్యులుగా సంస్థ సాహితీ కార్యక్రమాలలో మిత్రుల తోడ్పాటు మరువలేనిది. వారి వారి శక్తికి తగినంత తోడ్పాటును అందిస్తూ సంస్థల అధ్యక్షులుగా, ప్రధాన కార్యదర్శిగా, సభ్యులుగా వివిధ బాధ్యతలు నిర్వర్తించి కార్యక్రమాలను విజయవంతం చేయడంలో సహకరించిన మిత్రుల ఆత్మీయ వాక్యాలు ఈ పుస్తకంలో లేకుంటే లోటుగా ఉంటుందని ఈ పుస్తకంపై ఆత్మీయవాక్యాలు రాయమని కోరాను.

...కనుకనే కోరిన వెంటనే "ఆచార్య ఆత్రేయ సాహిత్యాలయాలకు అర్చకుడు డా॥ తలతోటి పృథ్వీరాజ్" అని రాసిపంపిన సాహితీ మిత్రులు డా॥ కె.జి.వేణుగారికి,

"ఆకాశమే హద్దుగా ఎదిగిన అభిమానం" పేరుతో రాసిపంపిన మిత్రులు శ్రీ జి.రంగబాబుగారికి,

"ఈ గ్రంథం శ్రీ ఆత్రేయగారి సాహితీ ఖజానా... వారి అభిమానులకోక నజరానా" అని ఆత్మీయ వాక్యాలు రాసిన శ్రీ వేపా పార్వతీశం గారికి,

"కృషి అమోఘం" అని రాసిన శ్రీ గట్టిబ్రహ్మాజీగారికి,

"మనోభిలాష" పేరుతో ఆత్మీయ వాక్యాలు రాసిన డా॥ యిమ్మిడిశెట్టి చక్రపాణి గారికి,

"ఆత్రేయ మానస పుత్రుడు పృథ్వీరాజ్" అని రాసిన శ్రీమతి పి.అమరజ్యోతిగారికి ... అందరికీ నా హృదయపూర్వక ధన్యవాదాలు..

చివరిగా ఆత్రేయగారితో ఉన్న పరిచయాన్ని తెలియజేస్తూ శ్రీ పాండురంగ స్వామి (మైత్రేయ)గారు, కె.విజయేశ్వర కుమార్ (హైద్రాబాద్) గారు పంపిన కొన్ని ఫోటోలను బట్టి, ఆత్రేయ గారి మరికొన్ని సినిమా సంభాషణలు రాసిన చిత్రాలపేర్లు తెలియజేసిన సినీ సాహితీ డాటా పరిశోధకులు డా॥ వెంకట ఎస్. ఊటుకూరి (సౌత్ ఆఫ్రికా) గారికి ధన్యవాదాలు. ఊటుకూరివారి కృషిని ఈ సందర్భంగా అభినందిస్తున్నాను. అనేకమంది పరిశోధకులకు బాటవేసినవారు వీరు. ఆత్రేయగారి శిష్యులలో ఒకరైన డా॥ కె. ప్రభాకర్ (హైద్రాబాద్)గారు. అందరికీ నా హృదయపూర్వక ధన్యవాదాలు.

ఆత్రేయగారి సినిమా సంభాషణలపై పరిశోధన ప్రారంభించింది మొదలు నేటివరకు వివిధ విషయాలలో సహకరించిన ప్రతి ఒక్కరికీ పేరుపేరునా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. నా పిహెచ్.డి. పరిశోధనకు పర్యవేక్షకులుగా వ్యవహరించిన నా గురువర్యులు "ఆచార్య పర్వతనేని సుబ్బారావు"గారికి నమస్కారాలు తెలియజేస్తూ...

– డా॥ తలతోటి పృథ్వీరాజ్





## విషయ సూచిక







## " మనసుకవి ఆచార్య ఆత్రేయకోసమే పుట్టిన శిష్యాచార్యుడు- "

మే 7, 2020న, ఆచార్య ఆత్రేయ 99వ జయంతిని పురస్కరించుకుని ఆత్రేయ సాహితీ పరిశోధకుడు, ఆత్రేయ సాహితీ సంస్థ వ్యవస్థాపకుడు అయిన డా॥ తలతోటి పృథ్వీరాజ్ రచంచిన "నేనూ-ఆత్రేయ" అనే ఆత్రేయ సాహితీ పరిశోధనలో శ్రీ పృథ్వీరాజ్ కృషిపై ప్రత్యేక సంపుటి ఆవిష్కరించబడటం నిజంగా సినీ సాహిత్య చరిత్రకే ముదావహం.



శ్రీ తలతోటి పృథ్వీరాజ్‌గారు యదార్థానికి ఆచార్య ఆత్రేయ మద్గురువరేణ్యులకోసమే పుట్టారు. ఇంతవరకు ఏ మహాకవి గురించీ ఏ శిష్యుడూ చేయని, అవిరళ కృషిని చేసి అటు మనసు కవికీ ఇటు తనకూ చిరస్థాయిగా నిలిచే యశస్సునూ, సాహితీ అమరత్వాన్ని సాధించారు. "గురుచరణ్! నీకు నచ్చిన వాడు, నీవు విమర్శించని వాడు, ఎవరైనా ఉన్నారా అని నన్ను తరచూ శ్రీ మోహన్‌బాబు గారు అడిగేవారు". "అలాంటి విమర్శకుణ్ని నేను అని సగర్వంగా చెప్పుకోగలను-". ఇదిగో ఇప్పుడు ఇలా ఇక్కడ ఎదురైన ఒక సాహితీమూర్తినీ, శ్రీ ఆచార్య ఆత్రేయకు ఏకలవ్య శిష్యరికాన్ని నెరపి అజరామమైన కీర్తి ప్రతిష్టలు సంతరించుకుంటున్న ధన్యజీవి శ్రీ తలతోటి పృథ్వీరాజ్‌గారి పరిశోధనకు అచ్చెరవొంది, పులకాంకితుడనై సవినయంగా ఇలా వ్రాస్తున్నాను.

ఆయన చేసిన పరిశోధన అనంతం. ఆత్రేయ సినిమా సంభాషణలపై విశ్వవిద్యాలయంలో పిహెచ్.డి.కై పరిశోధన, ఆత్రేయ నాటక సాహిత్యం-సంభాషణలపై పరిశోధనాత్మక గ్రంథం, ఆత్రేయ పాటలపై 'మన'సు'కవి' వ్యాస సంపుటి, ఆత్రేయగూర్చి ఇంటర్వ్యూలు, వ్యాసరచనలు, ఆత్రేయ సాహిత్యంపై ఆడియో-వీడియో -సీ.డీ.లు-డాక్యుమెంట్స్, ఆత్రేయగారిపేరుమీద "ఆత్రేయ సాహితీ స్రవంతి" సంస్థ స్థాపన-కార్యక్రమాల నిర్వహణ, ఆత్రేయ జయంతి వర్ధంతిని పురస్కరించుకొని సాహితీపరులకు సత్కారాలు, బిరుదు ప్రదానాలు-
ఇలా చెప్పుకుపోతే ...ఇది మరో గ్రంథం అయే ప్రమాదం ఉన్నందున అనితర సాధ్యమైన ఈ అశేష సాహితీ పరిశోధక సామ్రాట్‌కు శిరసువంచి నమస్కరిస్తూ ఇలాంటి సాహిత్య పరిశోధనా గ్రంథాలను ఆత్రేయపై రచించి ఆవిష్కరించాలని అభిలషిస్తూ, ఆకాంక్షిస్తూ, ఆశీర్వదిస్తూ

హైద్రాబాద్,
**3 మే 2020.**

**గురుచరణ్,**
ప్రముఖ సినీ రచయిత,
ఆత్రేయ సాహితీ స్రవంతి పురస్కార గ్రహీత,
ఆత్రేయ ప్రియ శిష్యులు.





# అభినందన



డాక్టర్. తలతోటి పృథ్వీరాజ్‌గారు, నేను ఆంధ్రాయూనివర్శిటీలో ఎం.ఎ(లిట్)చేస్తున్నప్పుడు... నాగార్జున హాస్టల్‌లో పరిచయం. ఆ సమయంలో ఆయన స్కాలర్‌గా ఆత్రేయ సినిమా సాహిత్యంపై పరిశోధన చేస్తూ, మన'సు'కవి ఆత్రేయ అనే పుస్తకం రచించి, ముద్రించిన కాపీ నాకివ్వడం జరిగింది.

ఆత్రేయ సాహిత్యం గురించి పెద్దగా తెలియని నాకు...పృథ్వీరాజ్ ఇచ్చిన పుస్తకం, ఆత్రేయ సాహిత్యంలో గొప్పతనం తెలుసుకునేలా చేసింది. ఇంకా ఆయన రచించిన సినిమా సంభాషణలు ఎలా ఉంటాయో అని కోరిక పుట్టి, ఆత్రేయగారు సంభాషణలు రాసిన చిత్రాలు దొరికినన్ని చూసాను.

ఒక రకంగా నేను సినిమా మాటల రచయితగా మారడానికి పృథ్వీరాజ్ పరోక్షంగా కారణం... ఆత్రేయగారి సాహిత్యాన్ని నాకు పరిచయం చేసినందుకు -ఆయనకి కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను. ఎందుకంటే... ఆత్రేయగారి గురించి తెలియని వారుండరు. కానీ ఆయన సాహిత్యం గురించి లోతుగా చాలా కొద్దిమందికే తెల్సు... ఆత్రేయ సాహిత్యపులోతు. ప్రతీ మనిషికి తెలియాలి అని నడుం బిగించి, డా॥ పృథ్వీరాజ్, ఆత్రేయ మనసులోంచి వచ్చిన ప్రతీ సాహిత్య బిందువుని...నాటికనుంచి నాటకందాక, పాటనుంచి మాటదాకా ఎన్నో పరిశోధనలు చేసి, ఎంతో కష్టపడి, ఎన్నో అవమానాలుకూడా ఎదర్కొని, ఎన్నో ఏళ్ళనుంచీ...ప్రయత్నించి సఫలమయ్యారు.

ఈ భూమి ఉన్నంత వరకూ ఆత్రేయ సాహిత్యాన్ని ప్రజల గుండెల్లో బ్రతికి ఉంచాలని పుస్తకాల రూపంలో, సి.డి.ల రూపంలో, ఇంటర్వ్యూలు, వెబ్‌సైట్‌ల రూపంలో అందించడమే కాకుండా...ఆత్రేయ జయంతికి, వర్ధంతికి ఏదో కార్యక్రమం చేస్తూ ఆత్రేయగారిని ప్రజల మనస్సులో నిరంతరం గుర్తుంచుకునేలా చేస్తున్న డా॥ తలతోటి పృథ్వీరాజ్‌కి, ఆత్రేయ సాహిత్యంపై ఉన్న ప్రేమకి, ఆ సాహిత్యాన్ని జనాల్లోకి తీసుకెళ్ళాలని ఆయన పడ్తున్న కష్టానికి మనం అభినందించాలి...

హైద్రాబాద్,
01-05-2020.

డార్లింగ్ స్వామి
సినీ రచయిత..





## ఆచార్య ఆత్రేయ సాహిత్యాలయాలకు అర్చకుడు

## డా॥ తలతోటి పృథ్వీరాజ్



సాహిత్యవేత్తలను ప్రేమించచడం, ఆరాధించడం, అభిమానించడం, అనుసరించటం, సర్వసాధారణమైనదే. నాటక రచయితగా, నటుడిగా, ప్రయోక్తగా తెలుగు నాటక రంగానికి సరికొత్తవెలుగుల్ని ప్రసాదించి, ఆతరువాత సినిమా మాటల, పాటల రచయితగా, కొన్ని సినిమాలకు దర్శకుడుగా, జగద్విఖ్యాతిగాంచిన ఆచార్య ఆత్రేయ జీవితం మరియు సమగ్ర సాహిత్య సమాచారాన్ని తన పరిశోధనల ద్వారా, వ్యాసాల ద్వారా, ప్రత్యేక సంచికల ద్వారా, అనేక ఆత్రేయ సాహిత్య మహాసభలను నిర్వహించటం ద్వారా, ఆత్రేయ పేరుమీద అవార్డులు, పురస్కారాలు, ప్రముఖులకు అందజేయడం ద్వారా, ఆత్రేయ సాహిత్యం వ్యక్తిత్వంపై అనేక సీ.డి.లు, వీడియోలు నిర్మించటం ద్వారా అరుదైన సాహితీ వేత్తగా ఆత్రేయను సజీవుడుగా నిలబెట్టిన డా. తలతోటి పృథ్వీరాజ్ గారి అలుపెరగని నాణ్యమైన కృషికి శాశ్వతంగా మనమంతా రుణపడివుంటాం. సామాన్య పాఠకులకు సాధ్యంకాని ఆత్రేయ పనిచేసిన సినిమా పేర్లను, మొత్తం సినిమా పాటల వివరాలను, ప్రేక్షకులను మంత్రముగ్ధుల్ని చేసిన ఆయన సినిమా మాటల విశేషాలను, అనేకమంది సినిమా ప్రముఖుల అభిప్రాయాలను, ఆత్రేయ సాహిత్యంపై జరిగిన పరిశోధనల పత్రాలను, ఇలా వందలాది ఆసక్తికర విశిష్ట విశేషాలను కోట్లాదిమంది తెలుగు వారికి ఒక పారిజాత పుష్పంలా అందించిన డా॥ తలతోటి పృథ్వీరాజ్ గారి కీర్తి ఆత్రేయగారి కీర్తితో కరచాలనం చేస్తూ కలకాలం నిలుస్తుందన్న సత్యానికి తెలుగునేల హృదయ పూర్వకంగా స్వాగతం పలుకుతోంది.

విశాఖపట్నం,
11/4/2020.

డా॥ కె.జి.వేణు,
నటులు, నాటకరంగ దర్శకులు, కవి
విశ్రాంత రసాయనశాస్త్ర అధ్యాపకులు





## ఆకాశమే హద్దుగా ఎదిగిన అభిమానం



ఒక మనిషిని అతనిలోని ప్రతిభ పరంగా ఇష్టపడితే... ఆ వ్యక్తిపట్ల అభిమానం ఆకాశమే హద్దుగా ఎదిగి దిగంతాలే ఎల్లలుగా రూపుదిద్దుకుంటే కనిపించే ఆ రూపం పేరే " డా॥తలతోటి పృథ్వీరాజ్ ". అంతటి అభిమానానికి పాత్రుడైన ఆ ప్రతిభామూర్తి ప్రఖ్యాత సినీగేయ రచయిత 'ఆచార్య ఆత్రేయ'.

తెలుగులో మాస్టర్స్ డిగ్రీపుచ్చుకున్న శ్రీ తలతోటి పృథ్వీరాజ్ తన పిహెచ్.డి.కోసం ఒక వినూత్న ప్రక్రియలో పరిశోధనచేసి నూతన ఒరవడికి శ్రీకారం చుట్టారు. ఎన్నో అద్భుతమైన నాటకాలు, కొన్ని వేల సినిమా పాటలు, వందల చిత్రాలకు చక్కటి సంభాషణలను అందించిన గొప్ప ప్రతిభాశాలి 'మనసుకవి' ఆత్రేయ సినిమా సంభాషణలు అనే విషయంపై పరిశోధన చేసి పిహెచ్.డి. పట్టాను పొందారు.

డా॥తలతోటి పృథ్వీరాజ్‌గారు ఏదైనా విషయంగురించి పరిశోధన మొదలుపెడితే వేరెవ్వరూకూడా ఇంతకన్నా విస్తృతంగా పరిశోధించలేరు అనే విధంగా దాని అంతు చూస్తారు. అంతటి కార్యదక్షుడాయన. విషయ సేకరణలోగాని, పుస్తకాల సేకరణలోగానీ ఆయన్ను మించిన వారు ఎవరూ ఉండరు అనేంత శ్రమిస్తారు. సాధిస్తారు. దానికోసం ఎంతటి వ్యయప్రయాసలకైనా వెనుకాడరు. ఇప్పటివరకూ ఆయన నిర్వహించిన సాహిత్య కార్యక్రమాలు గానీ, ఆయన రచించిన లఘు కవితా ప్రక్రియలకు సంబంధించిన రచనలుగానీ, ఆత్రేయ సాహిత్యంపై ఆయన వెలువరించిన పలు వ్యాసాలు గానీ చూస్తే మనకీవిషయం తేటతెల్లమవుతుంది.

వృత్తిరీత్యా అధ్యాపకులు అయినా ప్రవృత్తిరీత్యా ఆయన కవి, విమర్శకుడు. సాహిత్యం ఆయనకు ప్రాణసమానం...ముఖ్యంగా హైకూవంటి ప్రక్రియలో ఆయన ప్రపంచ ప్రసిద్ధి చెందిన కవి. ఎన్నో దేశాలలో ఆయన హైకూలు బహుళ ప్రాచుర్యం పొందాయి. నిత్యం సాహిత్యాన్ని అధ్యయనం చేస్తూ, ఎందరో ప్రముఖ సాహితీ వేత్తలతో పరిచయాలు...కవులు, రచయితలు, విమర్శకులు, సినిగేయ, సంభాషణా రచయితలతో తనకున్న అనుబంధాన్ని కొనసాగిస్తూ 'మనిషి'తనానికి, మంచి తనానికి అద్దం పట్టే గొప్పవ్యక్తిత్వం ఆయనది...

అధ్యాపకునిగా, సాహితీవేత్తగా, బహుళ గ్రంథకర్తగా, ఎన్నో జాతీయస్థాయి సాహిత్య కార్యక్రమ రథసారథిగా, మరెన్నో సాహితీవేత్తల రచనల దృశ్య, శ్రవణ మాధ్యమాల రూపశిల్పిగా తన సాహిత్య ప్రస్థానాన్ని కొనసాగిస్తున్నారు. ఒకే వ్యక్తిలో ఇన్ని రకల ప్రతిభలుండటం మామూలు వ్యక్తులకు సాధ్యం కాదు... ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించుకుంటూ ముందుకు సాగిపోయే నిత్య సాహితీ కృషీవలుడు, బహుముఖ ప్రజ్ఞావంతుడు డా॥ పృథ్వీరాజ్.

అనకాపల్లి,
27/4/2020.

జి.రంగబాబు
ప్రముఖ కవి, కథకులు,
ఇండియన్ హైకూ క్లబ్ ప్రధాన కార్యదర్శి.





## ఈ గ్రంథం శ్రీ ఆత్రేయగారి సాహితీ ఖజానా...
## వారి అభిమానులకొక నజరానా



నా చిరకాల సన్మిత్రులు, సహృదయులు, డా॥తలతోటి పృథ్వీరాజ్ గారు వెలువరిస్తున్న ఈ పుస్తకం వారి మేథో మథనం. శ్రీ ఆత్రేయగారి సాహితీ, సినీ సాహితీ జీవన ప్రస్థాన. అశేష, విశేష, విషయాల భవ్య విశ్లేషణాత్మకమౌ గ్రంథ చందనం. ఎప్పటికీ యిగిరిపోకుండా సుమధుర సాహితీ పరిమళాలను సదా వెదజల్లుతూనే ఉంటుంది. ఎన్నో వ్యయప్రయాసలకోర్చి, యెందరినో సినీ ప్రముఖులను కలసి, యెన్నెన్నో పాటలు సేకరించి, సిడిలు చేసి, ఆత్రేయ సంభాషణల వైశిష్ట్యాన్ని అనేకానేక కోణాల్లో పరిశోధన చేసి ఆత్రేయగారి మహాశక్తులను అక్షర రూపంలో తరతరాలకూ అందించిన తీరు బహుధా ప్రశంసనీయం. అతులితమైన సమర్ధత, పట్టుదలలు శ్రీ పృథ్వీరాజ్ గారి ప్రత్యేకతలు.

ఈ గ్రంథం విషయసూచిక చూడగానే మహదాశ్చర్యం కలుగుతుంది. ఇంత పరిశోధన యెలా చేసేరో అనిపిస్తుంది. శ్రీ ఆత్రేయగారి 99వ జయంతి రోజున విడుదల కానున్న ఈ గ్రంథరాజం యేనాటికీ సాహితీ సుగంధాలు విరజిమ్మే పారిజాతం. శ్రీ తలతోటి పృథ్వీరాజ్ గారికి అనేకానేక శుభాభినందనలు. శుభాకాంక్షలు.

హైద్రాబాద్,
8-4-2020.

వేపా పార్వతీశం
ఆత్రేయ సాహితీ స్రవంతి పూర్వ ప్రధాన కార్యదర్శి,
కవి, విశ్రాంత ప్రధానోపాధ్యాయులు.

## కృషి అమోఘం



మీ కృషి అమోఘం. ఎవరూ చేయని...చేయలేని కృషి. పద్మావతి ఆత్రేయగారి మాటల్లోనే చూశాము. ఎన్నో సంవత్సరాల కృషి, స్వయంగా మీ తపన చూసినోణ్ని, మీ కృషిలో భాగంగా మీ ఇంటిని కూడా కొన్ని సార్లు నిర్లక్ష్యం చేసినట్లే! మీ శ్రీమతి (మా సోదరి) సపోర్ట్ లేకుంటే ఇన్ని వర్క్స్ సాధ్యం కాదు. అందరూ మా సోదరికి ధన్యవాదాలు చెప్పాల్సిందే. ఆత్రేయను సంపూర్ణంగా మీరు ఆవిష్కరించినట్లే. ప్రముఖమైన అవార్డ్స్ అందుకోవాలని కోరుకుంటూ కార్యక్రమంలో పనిభారం ఎక్కువై కొన్నిసార్లు తిట్టుకున్న

అనకాపల్లి,
8-4-2020.

గట్టి బ్రహ్మాజీ,
సినీ నటుడు, కవి,
ఆత్రేయ సాహితీ స్రవంతి అధ్యక్షులు.





# మనోభిలాష



అనకాపల్లి సాహిత్యానికి ఓ కేంద్ర బిందువన్నదాంట్లో ఏ మాత్రం సందేహంలేదు. నాకు తెలిసిన, అవగాహన ఉన్న 50 సంవత్సరాల సాహితీ ప్రయాణంలో ఎందరో రచయితలు, కవులు తమ తమ రచనా ప్రక్రియలలో శారదమ్మను సుసంపన్నం చేశారు. రెండు దశాబ్దాల క్రితం ఓ యువ సాహితీవేత్త వేసిన బాట ఎందరికో ఆదర్శనీయమే కాక అవకాశాలతో కూడా ప్రోత్సహించింది. నాటి యువతరంగమే ప్రసిద్ధ కవి, ఆత్రేయ నాటక సంభాషణలపై పరిశోధనా వ్యాసం సమర్పించి డాక్టరేట్‌పొంది అందరిమన్ననలందుకున్న డాక్టర్ తలతోటి పృథ్వీరాజ్. ఆత్రేయ అభిమానులకోసం ఆత్రేయ సాహితీ స్రవంతి ఏర్పాటుచేసి నావంటివాడికి ఆ సంస్థలో మంచి పదవినిచ్చి ప్రతి ఏటా ఆత్రేయ జయంతి, వర్ధంతిన సాహితీ కార్యక్రమాలు నిర్వహింపజేసి ప్రోత్సహించటం మరచిపోలేనిది. తద్వారా ఆత్రేయగారిని, వారి రచనలగూర్చి అనేక విషయాలు తెలుసుకొనే అవకాశం కూడా కలిగింది.

ఆత్రేయ పేరిట ప్రముఖులను సత్కరించటం, ప్రయోజనకరమైన పవర్ పాయింట్ ప్రెజెంటేషన్ చేయటం వారికి ఆత్రేయపట్ల ఉన్న అంకిత భావాన్ని వెల్లడిచేస్తుంది. అభివృద్ధిచెందిన సాంకేతిక పరిజ్ఞానం పృథ్వీని మరింతముందుకు సాగేలా చేసింది. ఇప్పటికీ వెలుగులోకి రాని ఆత్రేయగారి సాహితీ సంపదను వెలికితీసి అభిమానులకు పంచాలనే తపనకూడా హర్షించదగినది. ఆత్రేయగారికి సంబంధించి డా॥ పృథ్వీరాజ్ భవిష్యత్‌లో తలపెట్టే సాహితీ కార్యక్రమాలు, కృషి విజయవంతం కావాలని మనసారా అభిలషించే మనసున్న మిత్రుడు.

అనకాపల్లి,
2-5-2020.

**డా॥ యిమ్మిడిశెట్టి చక్రపాణి**
ఆత్రేయ సాహితీ స్రవంతి పూర్వ ప్రధాన కార్యదర్శి,
కవి, విశ్రాంత అధ్యాపకుడు.





## ఆత్రేయ మానస పుత్రుడు పృథ్వీరాజ్



" నేనూ - ఆత్రేయ " అంటూ డా॥ తలతోటి పృథ్వీరాజ్ ఆచార్య ఆత్రేయ 99వ జయంతిని పురస్కరించుకుని గ్రంథాన్ని ఆవిష్కరించబోతున్నారు.

ఆచార్య ఆత్రేయపట్ల అత్యంత ప్రేమతో, ఆత్రేయ సాహిత్యంపై ఆసక్తితో ఎంతో శ్రమతో, ఎవరూ వెలికితీయని అంశాలను, జీవిత విశేషాలను, ఫోటోలను, ఉత్తరాలను పరిశోధించి ఆత్రేయగారి చిత్రాలలోని సంభాషణలపై పరిశోధన చేసి .ఇహెచ్.డి. పట్టా అందుకున్నారు. డాక్టరేట్ సాధించారు.

2000 సం॥లో ఉద్యోగరీత్యా డా॥ తలతోటి పృథ్వీరాజ్ గారు అనకాపల్లి వచ్చినప్పటి నుంచీ నాకు పరిచయం వుంది. ఇండియన్ హైకూ క్లబ్ స్థాపించి హైకూలపై, నానీలపై , మినీ కవిత్వంపై అవగాహనా సదస్సులు నిర్వహించారు. నానీ సంపుటాలకు అవార్డులను ప్రతీ ఏటా బహూకరించారు. ప్రముఖ కవులను, రచయితలను సాహితీ వేత్తలను అనకాపల్లికి ఆహ్వానించి వారి ప్రసంగాలను వినే భాగ్యం మాకు కల్పించారు.

ఆచార్య ఆత్రేయ సాహితీ స్రవంతి సంస్థను స్థాపించి జయంతులు, వర్ధంతుల సమయంలో వారికి నివాళులు అర్పించి ఆ మహానుభావులను తలచుకునే అవకాశం కల్పించారు. చిన్నవయసులో అనేక కార్యక్రమాలను చేపట్టడమేకాక విజయవంతం చేసేవారు.

కె.శివారెడ్డి, డా॥గోపిగారు, రావూరి భరద్వాజగారు, ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారు,అద్దేపల్లి రామమోహన్ రావు, ద్వానా. శాస్త్రి, జ్వాలాముఖి, ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు, కోవెల సుప్రసన్నాచార్య, పెద్దిబొట్ల సుబ్బరామయ్య, వివికె. రంగారావు, ఎండ్లూరి సుధాకర్, కడియాల రామ్మోహన్ రాయ్, చలసాని ప్రసాద్, సినీ రచయితలు జాలాది, గురుచరణ్‌లు... ఇంకా అనేక ప్రఖ్యాత సాహితీవేత్తలను సభావేదికలపై సత్కరించి సంతోషంగా పంపేవారు. అనకాపల్లికే కనుల పండుగగా వుండేది.

ఆచార్య ఆత్రేయ పాటలు, సంభాషణాలను తన స్వర మాధుర్యంతో వ్యాఖ్యానిస్తూ సి.డి.లను చక్కగా రూపొందించి ఆవిష్కరించేవారు.

డా॥ పృథ్వీరాజ్ గారికున్న సాంకేతిక పరిజ్ఞానంతో పవర్‌పాయింట్ ప్రజెంటేషన్ ద్వారా కార్యక్రమాలు చాలా ఆసక్తికరంగా వుండి పెద్దవాళ్ళనూ, సాహితీ వేత్తలనూ, విద్యార్థులనూ అబ్బురపరిచేవి. అందరి ఆశీర్వాదాలు అందుకునేవారు. కమిటీ మెంబర్స్‌నీ ఉత్సాహపూరితంగా నడిపించేలా ప్రోత్సహించేవారు. ఇంచుమించుగా అన్ని కార్యక్రమాలలోనూ నేను ప్రత్యక్షంగా ప్రేక్షకురాలిగా ఆనందించినవి. మరపురాని మధర జ్ఞాపకాలు.

జాతీయ స్థాయిలో 'అరటి కుటీరం' అనే 'హైకూ' కవితా సంకలనం తీసుకొచ్చారు. పృథ్వీరాజ్ గారి సొంత





కవితా సంపుటాలు, వ్యాస సంపుటాలు(హైకూ, నానీ) ప్రతీ సంచికా దాచుకోతగ్గవి.

డా॥ తలతోటి పృథ్వీరాజ్‌గారు చాలా పట్టుదల, నిబద్ధత, క్రమశిక్షణ కార్యదక్షత, స్నేహభావం వున్న నాయకుడు. ఉన్నత వ్యక్తిత్వంగల కథానాయకుడు.

అధ్యాపకులైనందువలనో ఏమో పృథ్వీరాజ్‌గారు ఏవిషయాన్నైనా. చక్కగా తనదైన కమాండింగ్ స్వరంతో ఆబాల గోపాలాన్నీ ఆసక్తితో మంత్రముగ్ధులై వినేలా చెప్పేవారు. వారు ఏర్పాటు చేసిన ఏ మీటింగ్‌కీ అనివార్యమైతే తప్ప హాజరుకాకుండా ఉండక పోవటానికి కారణం అదే. ఎన్నో విషయాల్లో అవగాహన, విషయ పరిజ్ఞానం కలిగేవి. సాహితీ మూర్తులను తొలిసారిగా చూసే, వినే భాగ్యం కలిగింది.

ఆచార్య ఆత్రేయగారి పాటలను, సంభాషణలను పరిశోధించారు అంటే ఎంతటి హృదయవైశాల్యం వుండాలి. ఆత్రేయగారి పాటల అర్థాలను, అంతరార్థాన్నీ ఆ లోతుల్లోని బాధాయమ అగాధాలను, వేదనా భరిత మనసుననూ, ఆతని అంతరంగ ఆవేదనల స్పందనలూ మన మనస్సుకు కుదిపినప్పుడో మెలితిప్పినప్పుడో తప్ప ఇలా ప్రతిస్పందనరాదు.

ఆచార్య ఆత్రేయగారి మనసూ, ఆలోచనలూ, ఆవేదనలూ పృథ్వీరాజ్ ‘అంతరంగాన్నీ తట్టి లేపాయి. ఇద్దరి హృదయ స్పందనలూ ఒకటైనాయి. కనుకనే ఆచార్య ఆత్రేయగారి సాహిత్యంపై పృథ్వీరాజ్‌కి ఈ ప్రేమ. ఇంత అభిమానం చూస్తే అసలైన వారసుడు ‘మానస పుత్రుడు’ అనిపించకమానదు. వారిద్దరి అంతరంగాన్ని మనమూ పంచుకుని ఆనందిద్దాం. అనితర సాధ్యుడైన డా॥ పృథ్వీరాజ్‌కి హృదయపూర్వకాభినందనలు.

అనకాపల్లి,

3-5-2020.

**శ్రీమతి పి. అమరజ్యోతి**

కవయిత్రి,

ఇండియన్ హైకూక్లబ్ సభ్యులు.

> “ నాగు కరిస్తే నరులు బ్రతకడం
> వందకు పదిమందైనా సహజం
> నరుడు కరిస్తే నల్లత్రాచుకే
> నాలుగు క్షణాల్లో మరణం ఖాయం ”





# ఈ(ఇ) పుస్తకం ఎందుకు రాయాల్సొచ్చిందంటే...

ఈ సందర్భంగా గబ్బర్ సింగ్ సినిమా పాటలో "ఎవడి డప్పు వాడు కొట్టండహే " అని హీరో పలికిన మాటలు గుర్తుకొస్తున్నాయి. నిజమే నా డప్పు నేనే కొట్టుకునే పరిస్థితి. ఇందులోని విషయాలు వందశాతం నిజమే!. అయినా చెప్పకోక తప్పదు ఇది నేను అని! ... కారణం ఏమిటంటే మునుముందు చాలా చాలా పనులు చేయాలంటే ప్రశంసలు, అభినందనలు అనే కనీస ఉత్ప్రేరకాలన్నా కవులకు, రచయితలకు, సాహితీ పరిశోధకులకు-విమర్శలకు అవసరం.

మన తప్పుల్ని ఎత్తిచూపడానికి, అడిగినా-అడక్కపోయినా ఇతరులకు చెప్పడానికి ఆసక్తి ప్రదర్శించేంతగా మన గొప్పదనాన్ని ఇతరులకు చెప్పడానికి ఈ లోకం ఇష్టపడదు. నీకు ఎంత ప్రతిభున్నా సరే... నేను ప్రతిభావంతుడ్ని అని చెప్పకోవడమేకాదు; నిరూపించుకోవాలి! నీ సత్తా ఏదో ప్రదర్శించుకోవాలి! లేకుంటే అముదపువృక్షాలు మహావృక్షాల్లా కీర్తింపబడుతున్న లోకం!. సన్మాన -సత్కారాలు అందుకుంటున్న లోకం!!.

నాకున్న మంచి బలహీనతలు ఖాళీగా సమయాన్ని వెచ్చించలేక పోవడం. ఏదైన మొదలుపెడితే దాని లోతులు చూడడం. ఆత్రేయను కేంద్రబిందువుగా చేసుకుని చేసిన పనులను ఒకసారి సింహావలోకనం చేసుకుంటే ఇన్నొచ్చాయి. ఆశ్చర్యమూ కలిగింది...ఇన్ని చేశానా అని! ఇన్నాళ్ళూ చేసుకుంటూ పోతున్నాను.

ఈ పుస్తకం వల్ల రెండు విషయాలు చెప్పదలుచుకున్నాను. ఆత్రేయగారి సాహిత్యంపై ఇతరులు చేసిన సాహిత్య పరిశోధనలు, రాసిన పుస్తకాలు పేర్కొనడమే గాక; నేను ఇప్పటివరకు ఆత్రేయ సాహిత్యంపై చేసిన పరిశోధనలు, కార్యక్రమాలతో ఆగిపోకుండా ఇంకా పరిశోధన ఉత్సుకతను కొనసాగిస్తూ ఇంకా సేకరించక మిగిలి ఉన్న ఆత్రేయగారి సినిమా పాటలను అన్వేషించి వాటిని విశ్లేషించి పరిశోధనాత్మక గ్రంథంగా ఆత్రేయ శతజయంతి రోజుకు తీసుకువద్దామని నిర్ణయించుకున్నాను. ఆత్రేయగారిసాహిత్యంపై ఇంతజరిగిందా... ఇంత జరుగుతుందా అని ఆత్రేయ సాహిత్యాభిమానులకు తెలియజెప్పడమే ముఖ్య ఉద్దేశం.

గురుచరణ్‌గారు నన్ను "ఆత్రేయకోసమే పుట్టిన శిష్యాచార్యుడ"ని, ఆత్రేయగారి ఏకలవ్య శిష్యుడనని వారి ముందుమాటలో నన్ను ప్రోత్సహించేందుకు, నాపై వారికున్న ప్రేమను బట్టి అన్నారు. అలాగే అమరజ్యోతిగారు వారి ఆత్మీయవాక్యాలలో "ఆత్రేయ మానస పుత్రుడు పృథ్వీరాజ్" అని పేర్కొన్నారు. ఇవన్నీ మీ ప్రోత్సాహక పలుకులుగానే భావిస్తాను. నాపై మీ అభిమానాన్ని ప్రదర్శించిన సాహితీ మిత్రులందరికీ నా ధన్యవాదాలు.

ఆత్రేయ విషయంలో నేను తలపెట్టిన వాటిలో మిగిలినవి కొన్ని ఉన్నాయి. ఒకటి వారి విగ్రహస్థాపన. మద్రాసులో కణ్ణదాసన్‌కు దక్కిన గౌరవం ఆంధ్రా కణ్ణదాసన్‌గా పిలువబడే ఆత్రేయకూ దక్కాలనేది నా ఆలోచన. కొంత ప్రయత్నాలు చేశాము నేనూ-బ్రహ్మాజీగారు. పెద్దలు తోడ్పడితే బాగుంటుంది. రెండవది నాటక సమాజాలవారి సహకారంతో ఆత్రేయ నాటికలు- నాటకాలను ప్రదర్శించి దృశ్యంగా చిత్రీకరింపజేసి అందరూ చూసేందుకు వీలుగా పెట్టాలనేదే నా ఆలోచన.

- డా॥ తలతోటి పృథ్వీరాజ్





# ఆత్రేయ సినీ సంభాషణల పరిశోధనలోకి...

ఆత్రేయ సినీ సంభాషణల పరిశోధనలోకి నా ప్రవేశం ప్రత్యేకమైనది. 1994లో హైద్రాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో పూర్తిచేసి యూ.జి.సి.వారి జూనియర్ రిసెర్చ్ ఫెలోషిప్ అర్హత సాధించాక నేను పిహెచ్.డి. ఎక్కడ చేద్దామా అని ఆలోచన చేశాను. సెంట్రల్ యూనివర్శిటీ తెలుగు శాఖలోనే కాదు; అనేక విశ్వవిద్యాలయాలలో 70 శాతం పిహెచ్.డి.లు ప్రాచీన సాహిత్యంపై అందునా వేల పిహెచ్.డి.లు చేసిన అదే భారతం, భాగవతంపై జరిగాయి. అదే ప్రబంధాలపై జరిగాయి. కొన్ని విశ్వవిద్యాలయాలలోనే కొందరు పర్యవేక్షకులు మాత్రమే పరిశోధనలు జరగాల్సిన అంశాలు ఏవున్నాయనే అవగాహనతో పరిశోధానాంశంపై ఆలోచన చేసేవారు ఉన్నారు.

నేను ఆశించినట్లు సినీ సాహిత్యంపై పరిశోధన చేసే పరిస్థితులు 1994నాటికి హైద్రాబాద్ సెంట్రల్ యూనివర్శిటీలో లేవు. అందుకే నేను నా పిహెచ్.డి. చేయడానికి ఆంధ్ర విశ్వ విద్యాలయాన్ని ఎంచుకున్నాను. ఈ సందర్భంగా భిక్షాలన్నకు కృతజ్ఞతలు. నా పరిశోధన పర్యవేక్షకులు, భాషా శాస్త్ర పండితులైన డా॥ పర్వతనేని సుబ్బారావుగారి వద్దకు తీసుకువెళ్ళి పరిచయం చేశారు. సినీ సాహిత్యంపై నేను చేయదలచుకున్న పరిశోధన ఆసక్తిని తెలియజేశాను. వారు అంగీకరించారు.

నిజానికి నేను మొదట ఎంచుకున్న అంశం "ఆత్రేయ సాహిత్యం-ఒక పరిశీలన" . అప్పటికే "మనస్విని పబ్లిక్ ఛారిటబుల్ ట్రస్ట్, మదరాసు" వారు 7 సంపుటాలలో ఆత్రేయ సాహిత్యాన్ని తీసుకువచ్చారు. "నాపాట నీనోట పలకాలి" పేరుతో ఆత్రేయ సినిమా పాటలను 3 సంపుటాలుగా, ఆత్రేయ నాటకాలను 2 సంపుటాలుగా, ఆత్రేయ నాటికలను ఒక సంపుటిగా, ఆత్రేయగారి కవితలు, గేయాలు, ఆత్మకథ పద్యాలు ఇలా అనేకమైనవన్నీ కలిపి "కదంబం"పేరుతో ఒక సంపుటిగా ప్రచురించారు. ఇలా ఈ 7 సంపుటాలను 1990లోనే "మనస్విని" వారు ప్రచురించారు.

విశాఖపట్నం విశాలాంధ్ర బుక్‌షాప్‌కు వెళ్ళి రెండుసెట్‌లు కొనుగోలు చేసి ఒక సెట్ నాకు, మరో సెట్ పర్యవేక్షకులైన గురువుగారికి ఇచ్చాను.అప్పటికే వివిధ విశ్వవిద్యాలయంలో ఆత్రేయ సాహిత్యానికి సంబంధించిన అనేక అంశాలపై ఎం.ఫిల్., పిహెచ్.డి.లు జరిగాయి. నాటికలు, నాటకాలు, సినిమా పాటలు ఇలా ప్రధానమైన అంశాలపై పరిశోధనలు జరిగాయని గుర్తించాను. ఆ 7 సంపుటాలను, అప్పటివరకు జరిగిన సిద్ధాంత గ్రంథాలను ముందువేసుకునికూర్చుంటే ఫీల్డ్‌వర్క్‌గా ఎక్కడికీ తిరిగే పనిలేకుండానే పిహెచ్.డి. పూర్తి అయి నాకు పిహెచ్.డి. పట్టా వస్తుంది. నాకు అటువంటిది అక్కరలేదనే నిర్ణయానికి వచ్చాను. ప్రతిభగలవాడిని. అందుకే ఆరోజుల్లో అతిక్లిష్టమైన జె.ఆర్.ఎఫ్. ఫెలోషిప్ సాధించగలిగాను. నా పిహెచ్.డి. ప్రత్యేకమైనది అయి ఉండాలి. ఒక అంశంపై పరిశోధన





జరిగిన తొలి పిహెచ్.డి.గా చెప్పుకోవాలని ఆత్రేయ సినిమా సంభాషణలపై పరిశోధన చేయాలని నిర్ణయించుకున్నాను. వివిధ సినిమా పాటల రచయితలపై వివిధ విశ్వ విద్యాలయాలలో పరిశోధనలు జరిగాయిగాని, సినిమా సంభాషణలపై పరిశోధన చేసి పట్టాపుచ్చుకున్న తొలి పిహెచ్. డి. నాదే! అదే నా ప్రత్యేకత!.

ఒక సంస్థ చేయలేని పనిని, ఒక వ్యవస్థ చేయాల్సిన పనిని ఒక వ్యక్తిగా చేయాలని సంకల్పించాను. అది మొదలు ఒకే వ్యక్తిగా ఎన్నో సాహిత్య విషయాలను ఒక్కడిగా చేశాను. ఒకరోజు మా గురువుగారి దగ్గరకు వెళ్ళాను "సార్ నేను ఆత్రేయ సినిమా సంభాషణలు పై పిహెచ్.డి.. చేస్తాను సార్ " అని చెప్పాను. "చూడమ్మా...చాలా కష్టమైపోతుంది. చాలా చోట్లకు తిరగాలి. సేకరించాలి. డబ్బులుకూడా బాగా ఖర్చయిపోతాయి" అని హెచ్చరించినా "ఫర్వాలేదు సార్. నేను చేస్తాను" అని ప్రారంభించాను. ఆత్రేయగారి సాహిత్యాన్ని 7 సంపుటాలుగా తీసుకొచ్చిన "మనస్విని"వారే ఆత్రేయ సంభాషణల జోలి పోలేదు. కనీసం ఆయన సంభాషణలు రాసిన చిత్రాల జాబితాను ఏ ఒక్కచోటా పేర్కోలేదు.

ఆత్రేయ సినిమా సంభాషణలు రచించిన చిత్రాల పేర్లు పరిశోధించి తెలుసుకున్నందుకే నిజానికి ఎం.ఫిల్.డిగ్రీ అయినా ఇవ్వవచ్చు. ఎందుకంటే ఆత్రేయ సంభాషణలు రాసిన చిత్రాలపేర్లు ఏ ఒక్కరు 10 లేదా 15కు మించి చెప్పలేక పోతున్నారు వారు సంభాషణా రచయితలైనా, చిత్ర నిర్మాతలైనా, దర్శకులైనా.

హైద్రాబాద్ సిటీ సెంట్రల్ లైబ్రరీకి వెళ్ళి ఆత్రేయ సినీరంగ ప్రవేశం చేసిన 1951 నుండి చనిపోయిన 1989వరకు మధ్యకాలం దినపత్రికలను, వార పత్రికలను తిరగవెయ్యడం మొదలుపెట్టాను. ఆత్రేయ సంభాషణలు రాసిన చిత్రాల పేర్లను ఒక్కొక్కటిగా నమోదుచేసుకోవడం మొదలు పెట్టాను. మొత్తానికి ఇలా ఆత్రేయ సంభాషణలు రాసిన చిత్రాలు సుమారు 150 చిత్రాల పేర్లను గుర్తించాను. సుమారు 200వరకు ఉండవచ్చని భావించాను. ఇది మొదటి దశ.

ఇక రెండో దశ, రెండో పని ఆత్రేయ సంభాషణలు రాసిన స్క్రిప్ట్‌లు సంపాదించడం. స్క్రిప్ట్ దొరికే అవకాశంలేదు. అయినా ప్రయత్నించాను. రామానాయుడు, మురారి మొదలగు నిర్మాతలవద్దకు వెళ్ళి విషయం చెప్పినా లేవన్నారు. మురారి అప్పటి మద్రాసు సెన్సార్ ఆఫీసువారి వద్ద సంపాదించి ఇవ్వడానికి కూడా ప్రయత్నించారు. 10 సంవత్సరాలకోమారు వారు ఆ స్క్రిప్ట్సును గుట్టలైపోతాయని కాల్చివేస్తుంటారట. ఆత్రేయ 1989 లో మరణించారు. నేను 96లో మద్రాసు వెళ్ళాను. ఆ అవకాశంకూడా పోయింది.

ఇక మూడో మార్గం ఆత్రేయ సంభాషణలు రాసిన చిత్రాల వీడియో కాసెట్లు సంపాదించి వీ.సి.డి.ప్లేయర్‌లో వేసుకుని చూసి పరిశోధన చెయ్యాలి. వేరే మార్గంలేదు. ఒక వీసిడి ప్లేయర్, టి.వి.కొన్నాను. సినిమా క్యాసెట్లు అద్దెకు ఇచ్చే షాప్‌లకు వెళ్ళి సినిమాలను చూడడం ప్రారంభించాను. ఇలా ప్రారంభిచాను.

ఎంతకష్టపడి పరిశోధన చేశానో ఆ అనుభవాలు





పంచుకోడానికి పదిపేజీలైనా కేటాయించాల్సి ఉంటుంది.

పృథ్విరాజ్ తన పరిశోధనాంశాన్ని ఐదు అధ్యాయాలుగా విభజించుకుని పరిశోధనా పత్రాన్ని రూపొందించారు. "ఆత్రేయ జీవితం-రచనలు" మొదటి అధ్యాయంకాగా, "సినిమా సంభాషణలు-ప్రాముఖ్యత" అనేది రెండవ అధ్యాయంగా చేసుకున్నారు. ఇక మూడవ అధ్యాయం అతి ప్రధానమైనది. దీనికి "ఆత్రేయ సినిమా సంభాషణలు-వైవిధ్యం" అని పేరుపెట్టి సిద్ధాంత గ్రంథంలో వివరించారు. "ఆత్రేయ సంభాషణలు-భాష" అనే అంశం నాల్గవ అధ్యాయంకాగా చివరి అధ్యాయంగా "సంభాషణా రచయితగా ఆత్రేయ" అనే ఐదవ అధ్యాయ అంశంగా అనేక విషయాలను సిద్ధాంతీకరించారు. అనుబంధంలో ఆత్రేయగారు సంభాషణలు చేసిన చిత్రాల జాబితాను, శ్రీమతి పద్మావతి ఆత్రేయగారి ముఖాముఖిని ఇవ్వడం జరిగింది. ప్రతి అధ్యాయంలో అనేక ఉపశీర్షికలతో పరిశోధనా పత్రాన్ని విపులంగా వివరించడం జరిగింది.

పృథ్విరాజ్ తన పరిశోధనా గ్రంథాన్ని 7 ఆగస్టు 1999న ఆంధ్ర విశ్వ కళాపరిషత్ వారికి సమర్పించగా 25 ఫిబ్రవరి 2000న పృథ్విరాజ్ కు డాక్టరేట్ అర్హతను సాధించినట్లు ఆంధ్ర విశ్వ విద్యాలయం వారు తమ నోటిఫికేషన్ ద్వారా ప్రకటించారు. 1 ఏప్రిల్ 2000న నాటి గవర్నర్ రంగరాజన్‌గారి చేతుల మీదుగా పిహెచ్.డి.పట్టాను స్వీకరించాను.

పిహెచ్.డి. సిద్ధాంత గ్రంథం విశ్వవిద్యాలయం వారికి సమర్పించడానికి కాలపరిధి 5 సంవత్సరాలే అయినా ఒకటిన్నర సంవత్సరాలు అదే లోకంగా, యజ్ఞంలా పరిశోధన చేసి 7 ఆగస్టు 1999న ఆంధ్ర విశ్వ విద్యాలయం వారికి సమర్పించిన నా పరిశోదనా గ్రంథమే "ఆత్రేయ సినిమా సంభాషణలు-ఒక పరిశీలన"



ఆత్రేయ సినిమా సంభాషణలు -
ఒక పరిశీలన

పిహెచ్.డి. పట్టం కోసం
ఆంధ్ర విశ్వకళాపరిషత్తుకు సమర్పించిన
సిద్ధాంత వ్యాసం
23, జులై 1999
తెలుగు శాఖ, ఆంధ్రవిశ్వవిద్యాలయం

అనే ఈ సిద్ధాంత గ్రంథం.

నా పరిశోధన శ్రమకు గుర్తింపుగా లభించిన పిహెచ్.డి. పట్టా ఇది. 25 ఫిబ్రవరి 2000న నేను డాక్టరేట్ అర్హతను సాధించినట్లు ఆంధ్ర విశ్వ విద్యాలయం వారు తమ నోటిఫికేషన్ ద్వారా ప్రకటించారు. 1 ఏప్రిల్ 2000న నాటి గవర్నర్ రంగరాజన్‌గారి చేతుల మీదుగా పిహెచ్.డి. పట్టాను స్వీకరించాను. శ్రీ తలతోటి స్థానంలో





డాక్టర్ తలతోటిగా గౌరవం కల్పించిన పట్టా.

నిజానికి 68వ కాన్వొకేషన్‌లో పిహెచ్.డి. పట్టా అందుకోవాల్సిన పరిస్థితి కాదు నాది. నాకు పిహెచ్.డి.



ANDHRA UNIVERSITY

FACULTY OF ARTS

This is to certify that

Talathoti Prithvi Raj

has been duly admitted to the

Degree of Doctor of Philosophy

in this University, he having been declared to be qualified to receive the same in 2000

Given under the Seal of the University

VISAKHAPATNAM
1st April, 2000

Vice-Chancellor

అవార్డు అయిన నాటికి కాన్వొకేషన్ లో పట్టాలు ప్రదానం చేసే లిస్ట్ తయారైపోయాయి. నాకు కూడా ఈ విషయంలో అవగాహన లేదు. ఆనాటి రిజిస్ట్రార్ శ్రీ జె.ఎం.నాయుడుగారే స్వయంగా ఈ విషయాన్ని అడిగి జరగనున్న కాన్వొకేషన్‌లో నా పేరును చేర్పించి




పిహెచ్.డి.పట్టా తీసుకునేలా చేశారు. వారికి ఈ సందర్భంగా ధన్యవాదాలు. పరిశోధకునిగా ఉన్న నన్నూ-నా ప్రతిభను గుర్తించి వారిలో ఒకరు నాటి వైస్-ఛాన్సలర్ ప్రొఫెసర్ రొక్కం రాధాకృష్ణగారైతే, మరొకరు ప్రొఫెసర్ జె.ఎం. నాయుడుగారు. అందుచేతనే వారికి నా "వెన్నెల, చినుకులు" హైకూ సంపుటాలను అంకితం చేసి గౌరవించుకున్నాను. ఆ విధంగా మాజీ రిజర్వు బ్యాంకు గవర్నర్, ఆనాటి ఆంధ్రప్రదేశ్ గవర్నర్ అయిన శ్రీ రంగరాజన్‌గారి చేతులమీదుగా పిహెచ్.డి.పట్టాను అందుకోవడం గొప్ప అనుభూతి.





ఏ.యు.ఆర్ట్స్‌కళాశాల ప్రిన్సిపాల్ ఆచార్య జి.సుబ్రహ్మణ్యం, డా॥ బాలమోహన్ దాస్ గార్లు
ఆచార్య జె.ఎం.నాయుడు గారికి అంకితం చేసిన చినుకులు, వెన్నెల పుస్తకాలను ఆవిష్కరించిన దృశ్యాలు





# "మహాకవి ఆత్రేయ" డాక్యుమెంట్ స్క్రిప్ట్

అసలు సిసలైన పరిశోధనకంటే ముందే ఆత్రేయపై సమగ్రమైన పరిశోధన అనుభవమే ఈ దాక్యుమెంట్ స్క్రిప్ట్ రచనకు దోహదం చేసింది. ఆత్రేయ జీవిత విశేషాలు, ఆత్రేయ వైవిధ్యమైన పాటలు, ఆత్రేయ సినిమా సంభాషణలు, ఆత్రేయ సాహిత్యం గూర్చి సినీ విమర్శకుల అభిప్రాయాలు వీటన్నింటిని దృష్టిలో పెట్టుకుని నేను స్క్రిప్ట్ రాసుకుని ఉన్నాను.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో జర్నలిజం చేసే మిత్రుడు మధు 1996ల్లో విశాఖపట్నంలోని కేబుల్ విజన్‌లో పనిచేస్తూ ఉండేవాడు. ఇటువంటి దాక్యుమెంట్ కేబుల్ టీవిలో ప్రసారం అయితే బాగుంటుంది అని చెబితే కేబుల్ విజన్ జి.ఎం. సిహెచ్.రంగనాయకులు , ఛైర్మన్ ఎం. వెంకట్రావుగారి అనుమతి తీసుకోవడం జరిగింది.

వారిముగ్గురి ప్రోత్సాహంతో దాక్యుమెంట్ చిత్రీకరణకు ప్లాన్ చేసుకోవడం జరిగింది. ఔత్సాహిక యాంకర్‌ను పెట్టుకుని మధ్య మధ్య ఆత్రేయ సాహిత్యంపై జర్నలిజం శాఖాధిపతి డా॥ బాబీవర్ధన్, తెలుగు శాఖాధిపతి-నా పిహెచ్.డి. పర్యవేక్షకులు డా॥ పర్వతనేని సుబ్బారావుగార్ల కొన్ని మాటలు, సినీ సంగీత దర్శకుడు-ఆరోజుల్లో ఆలిండియా రేడియో-విశాఖపట్నంలో పనిచేసే చంద్రశేఖర్ గారితో కొన్ని బైట్స్ తీసుకోవడం జరిగింది. అలాగే ఒక వ్యక్తి వాయిస్ ఓవర్, ఎడిటింగ్‌తో రూపొందించడం జరిగింది. అనేకమార్లు కేబుల్ విజన్‌ల్లో ప్రసారం చేశారు. అదేవిధంగా నేనుకూడా అనకాపల్లిలో ఎల్.సీ.డీ.పై అనేకమార్లు ప్రదర్శించాను. వీడియో క్యాసెట్‌నుండి సీ.డీ.గా కన్వర్ట్ చేయించి 5 మే 2010న "మనసు కవి" అనే యూట్యూబ్ ఛానల్లో "మహాకవి ఆత్రేయ" ఫైల్ నేమ్‌తో 7 పార్టులుగా అప్‌లోడ్ చెయ్యడం జరిగింది.

"ఆత్రేయ సినిమా సంభాషణలు-ఒక పరిశీలన" అనే నా పిహెచ్.డి. సిద్ధాంత గ్రంథాన్ని సమర్పించక ముందే ఇటువంటి దాక్యుమెంట్‌ను రూపొందించే అవకాశాన్ని కల్పించిన మిత్రుడు మధుకు, కేబుల్ విజన్ సిబ్బందికి ఈ సందర్భంగా ప్రత్యేక కృతజ్ఞతలు!







"మహాకవి ఆత్రేయ" అనే డాక్యుమెంట్‌కు యాంకరింగ్‌గా వ్యవహరించి స్క్రిప్ట్‌కు అనుగుణంగా పనిచేసింది పైఫోటోలోని అమ్మాయే. ఏవిధంగా ఎక్కడ ఎలా ఉచ్ఛరించాలో డైరెక్ట్‌చేస్తూ ఈ డాక్యుమెంట్‌కు ఉపయోగించు కోవడమైనది.



"ఆత్రేయ సినిమా సంభాషణలు-ఒక పరిశీలన" అనే నా పిహెచ్.డి.కి పర్యవేక్షకునిగా వ్యవహరించిన గురువర్యులు డా॥పర్వతనేని సుబ్బారావుగారు. "మహాకవి ఆత్రేయ" డాక్యుమెంట్‌కై మా గురువర్యుల కొన్ని బైట్స్ తీసుకోవడమైననది.



నాకే కాదు, నాలాంటి చాలామందికి అన్న బాబీవర్ధన్ అన్న. నన్ను మొదటినుండి అనేక విషయాలలో ప్రోత్సహించిన వ్యక్తి. వీరి బైట్ కూడా ఈ వీడియో డాక్యుమెంట్‌కు బైట్ తీసుకోవడం జరిగింది. ఆత్రేయగారి పాటలు, మాటలపై మాట్లాడడం జరిగింది.

"మనతల్లి అన్నపూర్ణ మన అన్న దానకర్ణ
మన భూమి వేదభూమిరా తమ్ముడూ
మనకీర్తి మంచుకొండరా
డిగ్రీలు పుచ్చుకొని చిప్పచేత పుచ్చుకొని
ఢిల్లీకి చేరినాము దేహి దేహి అంటున్నాము.
దేశాన్ని పాలించే భావి పౌరులం బ్రదర్
చదువెయ్య సీటులేదు చదువొస్తే పనీలేదు
అన్నమో రామచంద్ర అంటే దిక్కేలేదు "

"కడుపు మాడిపోతుంటే
కనికరించరు - కాస్త
కవళమెయ్యరు
కడుపంతా బైటపెట్టి బొడ్డుకింద
చీరకట్టి
నడుమూపినానంటే
పడిచచ్చిపోతారు నాయాళ్ళు"





# ఆత్రేయ సాహిత్యంపై పృథ్వి గ్రంథ రచనలు

*"చెదిరి పోయేవి, మాసి పోయేవి, మరచి పోయేవి జ్ఞాపకాలెందుకవుతాయి?. ఇలా ఎన్నటికీ మరిచిపోలేని ఎన్నో విషయాలు ఆత్రేయ రచనలకు సంబంధించి నేను ఈ సందర్భంగా రాయడమంటే ఈ నా నడివయస్సు నుండి యౌవన దశలోకి పాతికేళ్ళ వెనక్కి ప్రయాణించాల్సి ఉంది. మళ్ళా ఆరోజులు తిరిగొస్తే ఎంత బాగుండు అనిపిస్తుంటుంది. వాస్తవిక విషయాలను చెప్పే గొప్పసందర్భం వచ్చింది."* –డా॥ తలతోటి పృథ్విరాజ్

బహుళ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని నేను నా పరిశోధనను చేస్తూ వచ్చాను. నా పరిశోధన ఆత్రేయ సినిమా సంభాషణలపైనే అయిన ఆత్రేయ వ్యక్తిగత జీవితంగూర్చి, ఆత్రేయ సంభాషణేతర సాహిత్యమైన సినిమా పాటలు, నాటికలు, నాటకాల గూర్చి నా సిద్ధాంత గ్రంథంలో తప్పక ప్రస్తావించాలి. అందుకనే ఆత్రేయ సంభాషణేతర అంశాలనుకూడా పరిశోధనాంశంగానే చదవడం, ముఖ్యమైన అంశాలను నోట్ చేసుకోవడం చేశాను. పరిశోధనాంశమైన సినిమా సంభాషణలపై నా సిద్ధాంత గ్రంథాన్ని విశ్వవిద్యాలయం వారికి సమర్పించక ముందే అదే రచయితకు సంబంధించి రెండు పుస్తకాలను వెలువరించడం మామూలు విషయం కాదు.

కనుకనే మంచి విద్యావేత్తగా గుర్తింపు పొందిన, ప్రోత్సహించే నాటి వైస్-ఛాన్సలర్ ప్రొఫెసర్ రొక్కం రాధాకృష్ణగారు అనేక సభలలో స్కాలరైన నా రచనా వ్యాసంగాన్ని గూర్చి పలుమార్లు పలు వేదికలపై ప్రస్థావించినట్లు మా గురువుగారే అనేకమార్లు తెలియజేశారు.

ఆత్రేయ పాటలలోని ఆసక్తికరమైన విషయాలను సాహిత్యవ్యాసాంశాలుగా ఎంచుకుని వ్యాసాలు రాశాను దీనికి "మన 'సు'కవి" అని పేరు పెట్టాను.

ఆత్రేయకు సంబంధించినంత వరకు మరో పుస్తకం ఆత్రేయ నాటక సాహిత్యంలోని సంభాషణలు. దీనిని కూడా విశ్వ విద్యాలయానికి సమర్పించే సిద్ధాంత గ్రంథం తరహాలోనే అధ్యాయాలుగా విభజించడం, ఫుట్‌నోట్స్, ఉపయుక్త గ్రంథాలు పేర్కోవడం మొదలగున్నవి చేసి పుస్తకంగా వెలువరించాను.

అన్నప్రాసన నాడే ఆవకాయ అన్నం ఏమిటి అనేదానికి భిన్నంగా సిద్ధాంత గ్రంథ రచనకంటే ముందే "మహాకవి ఆత్రేయ" అనే వీడియో డాక్యుమెంట్ స్క్రిప్ట్ రచన, "మన 'సు' కవి" పేరుతో వ్యాస సంపుటి, ఆతర్వాత "ఆత్రేయ నాటక సాహిత్యం – సంభాషణలు" పేరుతో పరిశోధానా పద్ధతుల్లోనే పుస్తక రచన, 7మే 1998న ఆంధ్రప్రభలో ప్రచురింపబడిన "మనస్తత్వవేత్త మన ఆత్రేయ" అనే నా వ్యాసం...ఇవన్నీ అభ్యాసంగా, పిహెచ్.డి.సిద్ధాంత గ్రంథం అలవోకగా రాయడానికి ఉపయోగపడ్డాయి.

స్కాలర్‌గా ఉన్నప్పుడే మనిషి, మనిషిలో... అనే కవితా సంపుటులు రచించి ప్రచురించాను.





## మన 'సు' కవి
### వ్యాస సంపుటి




ఆత్రేయ పాటలపై నేను రాసిన మొదటి వ్యాస సంపుటి.

"1) మనసు కవి ఆత్రేయ

2) ఆత్రేయ విమర్శనాత్మక గీతాలు

3) ఆత్రేయ పాటల్లో శృంగారం

4) ఆత్రేయ వేదాంతం

5) ఆత్రేయ దైవం

6) ఆత్రేయ పాటల్లో అమ్మ

7) ఆత్రేయ ప్రబోధాత్మక గీతాలు

8) అసామాన్యుడు అత్రేయ " అనే ఎనిమిది ఆసక్తికర అంశాలపై నేను డిసెంబర్ 1998లో రచించి ప్రచురించిన వ్యాస సంపుటి ఇది. షూటింగ్ పూర్తయి విడుదల ఆలశ్యమైన సినిమాలలాగే ఈ వ్యాస సంపుటి ఆవిష్కరణకూడా ఆలస్యమైంది. ఈ సంపుటిని ఆత్రేయ



శిష్యుడైన శ్రీ జె.కె.భారవిగారికి అంకితం ఇచ్చాను. ఈ సంపుటికి వారు 10వేలు ఆర్థిక సహాయాన్ని అందించారు.



దీనికి ఆత్రేయగారి భార్య శ్రీమతి పద్మావతి ఆత్రేయగారు





తన ఆశీస్సులనే ముందుమాటగా పలికారు.

మొదటినుండి ఒకటే ఆలోచన. సాహిత్యం చదువుకున్నాం. దాని ద్వారే ఉద్యోగం వచ్చింది. సాహిత్య అభ్యున్నతికి నావంతు ఉపయోగ పడాలనేదే నా ఆలోచన. ఆ విధంగా స్థాపించినదే "ఇండియన్ హైకూ క్లబ్". ఇండియన్ హైకూ క్లబ్ స్థాపించిన సంవత్సరం తర్వాత మరొక ఆలోచన వచ్చింది. కేవలం మన సంప్రదాయ-ఆధునిక సాహిత్య విషయాలే గాక, సినీ సాహిత్యంలోనూ ఉద్దండులైన కవులు, అద్భుతమైన భావుకత ఉన్న సాహిత్యం ఉంది. దీనిపైకూడా సభలు, సమావేశాలు నిర్వహించుకోగలిగే ప్రత్యేక వేదిక ఉంటే బాగుంటుంది



అనిపించింది. ఆయా కవుల జయంతి, వర్ధంతులను పురస్కరించుకుని వారి సాహిత్యాంశాలపై అధ్యయనం చేసి స్మరించుకోవడం బాగుంటుంది అనిపించింది. నేను ప్రత్యేకించి ఆత్రేయ సాహిత్యంపై కృషి చేశాను గనుక "ఆత్రేయ సాహితీ స్రవంతి"పేరుతో ఇండియన్ హైకూ క్లబ్ అనుబంధ సంస్థను ప్రారంభిస్తే బాగుంటుందనిపించి ఆత్రేయ 83వ జయంతిని పురస్కరించుకుని సంస్థను స్థాపించి కార్యక్రమాలను ప్రారంభించడం జరిగింది. ఆ కార్యక్రమంలోనే "మన'సు'కవి" అనే ఈ సంపుటి ఇలా 6 ఏళ్ళ తర్వాత ఆవిష్కరణ జరిగింది. బహుశా ఇలా ఆవిష్కరణ జరగాల్సి రాసిఉందేమో! ఇన్నేళ్ళపాటు ఆ సంపుటి ఆవిష్కరణకు నోచుకోలేదనిపిస్తుంటుంది.

## మన 'సు' కవి పుస్తకానికి ఆత్రేయ భార్యగారి ముందుమాట



**శ్రీమతి పద్మావతి ఆత్రేయ**

టి.పృథ్వీరాజ్ వ్రాసిన ఈ పుస్తకం చాలా బాగుంది. ఆత్రేయ గారి పాటలలోని భావాన్ని గుర్తించగలిగారు. ఆత్రేయగారు 'మనసు' గురించి ఇన్ని విషయాలు చెప్పారని నేను ఈ రచయిత పుస్తకం ద్వారా తెలుసుకున్నాను. ఇందులోని విమర్శనాత్మక గీతాలను పరిశీలిస్తే – వీరు ఆత్రేయ పాటలమీద వున్న మంచి అవగాహనతో విశ్లేషించిన విధంగా కనిపిస్తుంది. సమాజంలోని అన్యాయాలు, అక్రమాల గురించి ప్రజలలో మార్పు కొరకు ఆత్రేయగారు పడిన ఆవేదనో ఏమిటో నాకు తెలుసు. వారు తన పాటల ద్వారా, మాటల ద్వారా సమాజంలో మార్పు తీసుకురావాలని ఆశించిన వ్యక్తి. రచయిత ఈ విషయాన్ని వ్యాసాలలో స్పష్టంగా చెప్పారు. మన 'సు' కవి గా ఆత్రేయను చక్కగా విశ్లేషించి పుస్తకరూపంలో తీసుకొని వచ్చినందుకు రచయితకు నా ధన్యవాదాలు.

–శ్రీమతి పద్మావతి ఆత్రేయ

తాడేపల్లి గూడెం,
18-12-1998





## "మన 'సు' కవి" వ్యాస సంపుటి గూర్చి పృథ్వీరాజ్ సంక్షిప్త పరిచయం

"భాషను అదుపు చేయడంలోను,భావాన్ని అదుపు చెయ్యడంలోను తిమ్మెర వంటి తేలిక మాటలతో తేనెలు,తీయని తావులు వెదజల్లడంలోనూ ఈ ఆచార్యుడు(ఆత్రేయ) తిక్కనకు వారసుడు"
- శ్రీ వేటూరి సుందరరామమూర్తి



ఆచార్య ఆత్రేయగారి పాటలమీద ఉన్న మక్కువకొద్ది వారి పాటల్లోని ప్రత్యేక అంశాలను కొన్ని వ్యాసాలుగా విశ్లేషిస్తూ దాంతలతోటి పృథ్వీరాజ్ మన'సు'కవి అనే పరిశోధనాత్మక వ్యాస సంపుటిని రచించారు. నిజంగా ఆత్రేయ పాటలకు విశ్లేషణ అవసరమా అంటే లేదు! మరి అలాంటప్పుడు ఈ పుస్తకాన్నెందుకు రాయడం అనే ప్రశ్న తలెత్తవచ్చు. నిర్మాతలు,దర్శకులు ఇచ్చిన సన్నివేశానికి అనుగుణంగా కవి ఆచార్య ఆత్రేయ పాటలు రాయడమేకాదు, ఆత్రేయకూడ సమాజంలో ఒక వ్యక్తిగా వివిధ విషయాలపట్ల ఎలాంటి భావాలు కలిగి ఉన్నాడన్నది ఆలోచించాలి. ముఖ్యంగా ఆత్రేయగారి గూర్చి చెప్పాలంటే రచయితగా కాకుండా మామూలు మనిషిగా పాటల రచనలో తన భావాలను వీలైన చోట ఎలా పలికించారో తెలియచెప్పాలనే ఉద్దేశ్యంతో ఈ వ్యాస సంపుటి రచయిత దాంతలతోటి పృథ్వీరాజ్ ప్రచురించి ఉంటారనిపిస్తుంది.

ఆత్రేయగారి పాటల్లోని అత్యద్భుతమైన అంశాల్ని ఎన్నుకుని **1.మన'సు'కవి ఆత్రేయ 2.ఆత్రేయ విమర్శనాత్మక గీతాలు 3.ఆత్రేయ పాటల్లో శృంగారం 4.ఆత్రేయ వేదాంతం 5.ఆత్రేయ దైవం 6.ఆత్రేయపాటల్లో అమ్మ 7.ఆత్రేయ ప్రబోధాత్మక గీతాలు 8.అసామాన్యుడు ఆత్రేయ** అని ఎనిమిది వ్యాసాలను రాయడం జరిగింది. "నాలుగు దశాబ్దాల పాటు తెలుగు సినిమా ప్రేక్షకులను తన పాటలతో,మాటలతో పరవశింపచేసిన మహాకవి ఆచార్య ఆత్రేయ. తెలుగు సినిమా పరిశ్రమకు పుణ్యంకొద్ది లభించిన 'కవితా సుధానిధి'ఆత్రేయ. తన ఉలిలాంటి కలంతో శిలలాంటి సినిమా రంగంపై ఎన్నో చిత్రాలను వివిధ భంగిమలలో అతి చక్కగా చెక్కిన అక్షర శిల్పి ఆత్రేయ. వారి పాటల్లో,మాటల్లో శృంగారాన్ని రంజింపచేసిన శృంగార కవి. కరుణంలో వేదాంతాన్ని,జీవిత సారాన్ని తెలిపిన గొప్ప వేదాంతకవి. సామాన్యమైన విషయాన్ని అసామాన్యంగా, అసామాన్యమైన విషయాన్ని సామాన్యంగా చెప్పి మెప్పించగల పొట్టిమాటల గట్టికవి. కొండలాంటి భావాన్ని అద్దంలా ఒదిగించి చూపగల అభినవ వేమన ఆత్రేయ"**(అసామాన్యుడు ఆత్రేయ-పుట 50)**అని ఈ వ్యాస సంపుటి రచయిత పేర్కొంటారు.

"తల్లి ఉన్నవాళ్ళకంటే లేనివాళ్ళకే తల్లంటే ఎవరో పూర్తిగా తెలుస్తుంది. ఎందుకంటే కళ్ళముందు కనిపించేవాటికి అంతగా గుర్తింపు,విలువను ఇవ్వము మానవులమైన మనము సహజముగా! కాని తల్లిని కోల్పోయిన దురదృష్టవంతులే తల్లంటే ఎవరని గుండెలోతుల్లోనుంచి పెల్లుబికివచ్చే భావాలతో చెప్పగలరు. అందుకే ఆత్రేయ **"అమ్మంటే అమ్మ-ఈ/అనంత సృష్టికామె అసలు బ్రహ్మ/రక్తాన్ని అర్పించి ప్రాణాన్ని పూరించి/చేస్తుంది నీ బొమ్మ"**అని అంటారు. అంతేకాదు; నీకోసం" **మరణాన్ని ఎదిరించి-మరోసారి జన్మించి/ఇస్తుంది నీకు జన్మ** "అని అంటారు. ఇంత అమూల్యమైన తల్లి ప్రేమను " **ధనంపోసి కొనలేము/రుణం తీర్చుకోలేము**"అని అంటారు. ఇంకా తల్లి ప్రేమ ఎలాంటిదంటే " **తనకు కన్ను నీవైతే / నీకు రెప్ప తానౌతుంది**"అని (రామ్ రాబర్ట్ రహీమ్ చిత్రంలో)చెప్పారు.(ఆత్రేయపాటల్లో అమ్మ-పుట 42) అని దాంతలతోటి పృథ్వీరాజ్ అమ్మకు సంబంధించిన చక్కని వ్యాసాన్ని ఇందులో వివరణాత్మకంగా విశ్లేషించారు.

ఆత్రేయ విమర్శనాత్మక గీతాలు అనే రెండవ వ్యాసంలో "ఆచార్య ఆత్రేయ కవిగా కాక ఒక మనిషిగా,మంచి మనిషిగా రకరకాల మనుషులను వారి స్వార్థపూరితమైన మనస్తత్వాలను,దేశద్రోహులను,బ్లాక్‌మార్కెట్ చేసే పెద్ద మనుషులను,కళ్ళునెత్తికెక్కి మనుషులను మనుషులుగా చూడనివారిని,మనుషులుచేత గొప్పవ్యక్తులుగా,చారిత్రక పురుషులుగా కీర్తింపబడేవారిని,ఈ లోకం పోకడలను ఒకో చోట సున్నితంగానూ-అవసరమైన చోట తీవ్రంగానూ,నిశితంగా తన పాటల్లో విమర్శించారు"అని వ్యాస రచయిత ఆత్రేయ పాటల్లోని విమర్శనాత్మక విషయాలను పేర్కొన్నారు." **నాగుకరిస్తే నరులు బ్రతకడం/వందకు పదిమందైనా సహజం/నరుడు కరిస్తే నల్లత్రాచుకే/నాల్గుక్షణాల్లో మరణం ఖాయం**" అనే ఆత్రేయగారి పాటలోని





చరణాలను చక్కగా విశ్లేషించారు పృథ్విరాజ్." పెద్దమనిషి చేస్తే అది రంగేళి శృంగారం/ పేదవాడుచేస్తే అది రంగేళి వ్యభిచారం" అనే లోక నీతిని విమర్శించే సత్యానికి సంకెళ్ళు అనే చిత్రంలోని పాటను చక్కగా రచయిత వివరించారు.

ఇక ఈ సంపుటిలోని మూడవ వ్యాసం "ఆత్రేయ పాటల్లో శృంగారం". ఈ వ్యాసంలోని ఆత్రేయగారి ఎన్నో శృంగార గీతాలను రచయిత విశ్లేషించారు."ఆత్రేయగారి దృష్టిలో శృంగారమంటే-'వయసూ సొగసూ మనసూ/కలిసిననాడే రొమాన్స్'అని గుమాస్తా చిత్రంలో డాన్సేబిడాన్స్ అనే పాటలో ఆత్రేయ అనిన దానిని వివరించారు రచయిత. అంతేకాదు 'చదివేటందుకు పుస్తకమెందుకు/బ్రతికేటందుకు చదువే ఎందుకు/ మగువ మనసు సగం చదివితే/మగవాడప్పుడు డాక్టరాఫ్ రొమాన్స్'అని స్నేహబంధం చిత్రంలో షి వుంటేనే కారులో షికారు అనే పాటలో ఆత్రేయ రాసిన భావాన్ని చక్కగా విశ్లేషించారు పృథ్విరాజ్.

ఏ జనమైతే ఆత్రేయపాటల్ని మెచ్చుకుని మనసు'కవి అన్నారో అదే జనాలు కొన్ని సందర్భాలలో కొన్ని పాటలలోని సాహిత్యాన్ని గమనించి ఆత్రేయను బూత్రేయ అనికూడా నిరశించారని విశ్లేషిస్తారు రచయిత. ఇలా బాధపడిన అభిమానులకు ఆత్రేయ"నా సినిమా సాహిత్యాన్ని గురించి మరికొన్ని నిజాలు చెప్పాలి. నేను రాసినవన్నీ మంచివికావు.కొన్ని చెత్తపాటలూ రాశాను. కొన్ని బూతులుగా ధ్వనించేవి రాశాను. సినిమాకవి బ్రతుకు అనేకానేక అభిరుచులుగల విటులను సంతృప్తి పరచవలసిన పడుపువృత్తి"అని ఆత్రేయ ఆవేదనను వ్యక్తపరిచినట్లు వ్యాస రచయిత పేర్కొంటాడు."అలవాటులేదని మడిగట్టుకోకు/అందాన్ని కాదని చెడగొట్టుకోకు/తొలిసారి వదిలేస్తే పొరబాటు అదే/పదిసార్లు రుచిచూస్తే అలవాటు"అని ఒకోసారి ఆత్రేయ మితిమీరి రాసిన శృంగార గీతాన్ని ఈ వ్యాసంలో పృథ్విరాజ్ పేర్కొన్నారు.

"తెలిసేటట్లు చెప్పేది సిద్ధాంతం-అది/తెలియక పోతేనే వేదాంతం"అని అంతులేని కథ చిత్రంలో దేవుడే ఇచ్చాడు....అనే పాటలో కవి చెప్పినట్లు వ్యాస రచయిత దాతలతోటి పృథ్విరాజ్ "ఆత్రేయ వేదాంతం"అనే వ్యాసంలో అంటాడని వ్యాసరచయిత దాతలతోటి పృథ్విరాజ్ పేర్కొన్నారు."ఛారయ్య పోయిన వాళ్ళు/ఏవరయ్యా ఉండేవాళ్ళు" అని గాజుల కిష్టయ్య చిత్రంలోని వేదాంత గీతాన్ని రచయిత ఉదహరించి వ్యాఖ్యానిస్తారు. ఆత్రేయకు దైవంగూర్చి పోతనగారిలా కలదోలేదో అనే భావన ఉన్నట్లు బుజువు పరిచే అనేక సందర్భాలను కవి పేర్కొన్నారు ఈ సంపుటిలో."దేవుడనేవాడున్నాడా అని మనిషికి కలిగెను సందేహం/మనుషులనేవారున్నారా అని దేవునికొచ్చెను అనుమానం"అన్ని దైవం గూర్చి మనుషులకున్న అనుమానానికి సంబంధించిన మరపురాని చిత్రంలోని పాటను రచయిత పేర్కొంటాడు."నవమాసాలు మోసేది ప్రేమ,పేగు తెంచుకుని పుట్టిన బిడ్డకు రక్తాన్ని పాలుగా రంగరించి పోసేది ప్రేమ. తన బిడ్డ తన ఆయుషుకూడా పోసుకుని తన కళ్ళముందు నిండుగా నూరేళ్ళు బ్రతకాలని అనుక్షణం పరితపించే మూగవేదన ప్రేమ"అని శైలా చిత్రంలోని ఒక సంభాషణలో అమ్మ ప్రేమను ఆత్రేయ వర్ణించిన భావాన్ని వ్యాస రచయిత పృథ్విరాజ్ "ఆత్రేయ పాటల్లో అమ్మ"అనే వ్యాసంలో రచయిత చక్కగా వ్యాఖ్యానిస్తారు.

పై వైవిధ్యమైన భావాలేకాదే. ఆత్రేయగారి పాటలుగూర్చి తెలుగు సినీ ప్రముఖులు,విద్యావేత్తలు వెలిబుచ్చిన అభిప్రాయాలు వ్యాస రచయిత ఇందులో పొందుపరిచారు. " ఆత్రేయ అంటే తెలుగు సాహితీ రంగంలో సాంఘిక నాటక యుగకర్త, ఆత్రేయ అంటే తెలుగు సినీ జగత్తులో మాటల పసిడి కోట."అని డా॥సి.నారాయణరెడ్డిగారు అన్నారని పేర్కొన్నారు. డి॥శ్రీ॥ఎన్.టి.రామారావుగారు ఆత్రేయగారి పాటలపైన వెలిబుచ్చిన అభిప్రాయం ఏమిటంటే..." ఆత్రేయ పాటల్లో లోతైన భావాలు,జీవిత సత్యాలు,ఎంతో మేధస్సు ఇమిడి వున్నాయి. ప్రజల ఆలోచనలు ఊహాగానాలు ఆయన పాటల్లో పుల్లి పడుతుంటాయి. మనిషి జీవిత అనుభవాలు,చీకటి వెలుతురు,విజయాలు,అపజయాలు గురించి ఆయన హృదయాలకు హత్తుకునే విధంగా పాటలురాశారు"అని అన్నారని వ్యాస రచయిత పేర్కొన్నారు.ఇలా దాతలతోటి పృథ్విరాజ్ ప్రతి వ్యాసంలోనూ ఆత్రేయ చెప్పిన అత్యద్భుతమైన భావాలెన్నింటినో విశ్లేషిస్తు మనసు'కవి వ్యాస సంపుటిని రాయడం జరిగింది.

" తినని దేవుడికి తిండిపెట్టి
తినమంటావు ఒరే ఒరే
తిండి లేక ఎండేవారిని
తిట్టి తరుముతావు "

" పని దొరకని పేదవాణ్ణి
సోమరిపోతంటారు
పని చెయ్యని గొప్పవాణ్ణి
పల్లకిలో మోస్తారు "





## ఆత్రేయ నాటక సాహిత్యం-సంభాషణలు

### పరిశోధనాత్మక గ్రంథం

సినిమా సంభాషణలుపై వచ్చిన తొలి సిద్ధాంత గ్రంథం ఎవరిది అనే ప్రశ్నకు తలతోటి పృథ్వీరాజ్‌గారి "ఆత్రేయ సినిమా సంభాషణలు-ఒక పరిశీలన" అనే గ్రంథం జవాబుగా రావాలనేదేగాక; నాటక సంభాషణలపై వచ్చిన తొలి గ్రంథం ఏది అనే ప్రశ్నకు కూడా తలతోటి పృథ్వీరాజ్ యొక్క "ఆత్రేయ నాటక సాహిత్యం-సంభాషణలు" అనేది జవాబుగా రావాలనే ఉద్దేశ్యంతో విశ్వవిద్యాలయంలోని పరిశోధనా స్థాయికి తగ్గకుండా ఈ పుస్తకాన్ని కూడా రచించాను.

1) ఆత్రేయ నాటక జీవితం, 2) ఆత్రేయ నాటక సాహిత్యం 3) ఆత్రేయ నాటక సంభాషణలు 4) ఆత్రేయ సంభాషణా శైలి అని నాల్గు అధ్యాయాలుగా విభజించి ఈ పరిశోధనాత్మక గ్రంథాన్ని నేను పరిశోధించి రాయడం జరిగింది.

ఈ పరిశోధనాత్మక గ్రంథానికి మహామహులైన సాహితీ విమర్శకులు ముందుమాటరాసి నన్ను ఎంతో ప్రోత్సహించారు. జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డాక్టర్ సి.నారాయణ రెడ్డి "అభినందన"పేరుతో , నాటి "పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం" వైస్-ఛాన్సలర్ ప్రొఫెసర్ ఎన్.గోపి "సృజనాత్మక నాటక రచయిత ఆత్రేయ" అని, ప్రముఖ కవి-సాహితీ విమర్శకులు డా॥ అద్దేపల్లి రామమోహన్ రావు "మనసుకవి పై మనసు కలిగించే విశ్లేషణ" అని , నా సినిమా సంభాషణల పరిశోధనకు పర్యవేక్షకునిగా వ్యవహరించిన గురువర్యులు డా॥ పర్వతనేని సుబ్బారావు గారు "అభినందన" పేరుతోను, "కవంటే ...ఆయనే!" అని ప్రముఖ సినీ రచయిత-నటుడు శ్రీ తనికెళ్ల భరణి ముందు మాటలు రాశారు.

ఈ గ్రంథం యొక్క ప్రత్యేకత ఏమిటి అంటే బొమ్మలు. ఆయా సన్నివేశాలకు సంబంధించి పుస్తకానికి




అదనపు ఆకర్షణను, పుస్తకంలోని నా విశ్లేషణకు మరింత అర్థాన్ని సమకూరుస్తూ శ్రీ గంటా మధు అతి చక్కని బొమ్మలు గీసి ఇచ్చాడు. అటువంటి బొమ్మలు గీయడానికి నేనుకూడా ఒకో బొమ్మ ఎలా గీయాలో, ఆ ఫ్రేమ్ లోపల ఏమేమి కనబడాలో, ఆ ముఖాల్లో ఉండాల్సిన ఎమోషన్స్ ఎలా ఉండాలో స్క్రిప్ట్‌రాసి ఇచ్చాను.

ఈ పుస్తకం ఆనాటి ఆంధ్ర విశ్వ విద్యాలయం వైస్-ఛాన్సలర్ ఆచార్య రొక్కం రాధాకృష్ణగారికి అంకితం చేశాను. జర్నలిజం విభాగాధిపతి బాబీవర్ధన్ గారి సహకారంతో వారి డిపార్ట్‌మెంట్‌లోనే ఈ పుస్తకావిష్కరణ





కార్యక్రమం జరిగింది. ఈ సందర్భంగా జరిగిన ఒక విషయాన్ని తప్పకుండా ప్రస్తావించాలి.

**అసూయను ఎదుర్కోవడం నాకు కొత్తేమి కాదు:**

పుస్తకావిష్కరణ కార్యక్రమానికి సభాధ్యక్షులుగా నాటి తెలుగు శాఖాధ్యక్షురాలుగా వ్యవహరించే ప్రొఫెసర్ డా॥ బి. అరుణ కుమారి గారిని పెట్టడం జరిగింది. నా గురువర్యులు డా॥ పర్వతనేని సుబ్బారావు గారికి మరియు అరుణ కుమారి మేడం గారికి భేదాభిప్రాయాలున్నాయని తెలిసినా నేను నా కార్యక్రమానికి ఆమెను గౌరవించే ఉద్దేశ్యంతో సభాధ్యక్షత బాధ్యతను ఆమెకు అప్పజెప్పాను. మా గురువుగారు ఈ విధంగా చేసినందుకు ఏమీ నొచ్చుకోలేదు. నేనుకూడా శాఖాధిపతిని గౌరవించాలనే ఆలోచనతో చేశాను. సభాధ్యక్షురాలుగా కృతి స్వీకర్త వి.సి.గారి ప్రక్క కూర్చుని "చూడండి...పృథ్వి పిహెచ్.డి. కాకుండానే పిహెచ్.డి. అని రాసుకున్నాడు" అని వి.సి.తో చెబితే వారు చాలా లైట్‌గా తీసుకోవడమే కాదు; "అయినా...మీ తెలుగులో అవార్డు కాకపోవడమేమీ ఉండదు కదా! " అని అనేసరికి ఇంకాస్త కోపమొచ్చింది ఆవిడకు. ఆమె అంతటితో ఊరుకోలేదు. కార్యక్రమం అయిపోయాక మా గురువుగారివద్దే స్కాలర్, నాకు సన్నిహితుడైన అద్దంకి శ్రీనివాస్ వద్ద తన గోడు వెళ్ళబోసుకుందని చెప్పుకొచ్చాడు. "వీ.సీ.గారికి చెప్పినా స్పందించలేదు. ఆయనకే లేనిది నాకెందుకు?" అని బాధని వ్యక్త చేసిందట.

అంతటితో ఆగలేదు!. రిజిస్ట్రార్ ఆఫీసు సంబంధిత సెక్షన్ ఆఫీసుకు ఫోన్ చేసి ఫలాన అతను ఇలా పిహెచ్.డి.రాసుకున్నాడు అని వారికి ఫిర్యాదు చేసింది. నేను ఆ సెక్షన్ కు వెళ్ళినప్పుడు అడిగారు వారు. దానికి వివరణ ఇచ్చాను. బ్రాకెట్లు మరిచి పోయాను సార్.


ఆత్రేయ
నాటక సాహిత్యం - సంభాషణలు

ఇంతదానికే అంత చెయ్యాలా? నిజంగా నా ఉద్దేశమే అదే అయితే పేరుముందు డాక్టర్ అని రాసుకోవాలి కదా! మరి రాసుకోలేదు కదా!. సరే ఆవిడ అన్నట్టే ఉద్దేశపూర్వకంగా వేశానే అనేకున్నాననుకుందాము. ఏం చేస్తారండి. సింపుల్ డి.టి.పి.వాడు తప్పుకొట్టాడు, చూసుకోలేదంటాను. ఎవడిపై ఏం చర్య తీసుకుంటారండి అని బదులు చెప్పాను. గౌరవిద్దామని గౌరవించే స్థానంలో కూర్చోబెడితే స్కాలర్‌ను ప్రోత్సహించడం పోయి ఆవిధంగా విషం చిమ్మే ప్రయత్నం చేసింది ఆ మేడమ్.

**మరువలేని మిత్రుని ప్రశంస:**

పుస్తకావిష్కరణ రోజు ఆత్రేయ చిత్రపటాన్ని పూలమాలతో అలంకరింపజేసి పుస్తకావిష్కరణ చేయిద్దామని ఆలోచనతో ఆంధ్రవిశ్వవిద్యాలయం



ఫైనార్ట్స్ స్టూడెంట్స్ కోదండం వారి మిత్రబృందంతో ఆత్రేయ చిత్రాన్ని గీయించడం జరిగింది. ఆర్టిస్ట్ గంగాధర్ గీసిన ఆత్రేయ బొమ్మను ఆధారం చేసుకుని





వారు సజీవం ఉట్టిపడేలా అత్యద్భుతంగా చిత్రాన్నిగీసి ఇచ్చారు. దానిని వెనుకా ముందు అద్దంతో మంచి ఫ్రేమ్ కట్టించడానికి పూర్ణామార్కెట్ వద్దకు తీసుకెళ్ళి ఇచ్చాను. పూర్తయ్యాక దానిని తీసుకురావడానికి మిత్రుడు అద్దంకి శ్రీనివాస్‌ను తీసుకు వెళ్ళి ఆత్రేయ చిత్రపటాన్ని నా బైక్ వెనక కూర్చొని పట్టుకొచ్చేటప్పుడు "పృథ్వీ! ఆత్రేయ బ్రతికి ఉంటే ఎంత సంతోషించేవాడో. నీ స్థాయి మరోలా ఉండేది'' అని అన్నాడు.




## పరిశోధనల తీరు తెలియని వాడ్ని కాదు:

ముందుచూపుతో పరిశోధనాంశాన్ని ఎంచుకుని ఏదో ఒక విధంగా లబ్ధిపొందిన అనేకమంది స్కాలర్స్ నాకు తెలుసు. సజీవులుగా ఉన్న ఇదే సినీ రంగానికి సంబంధించిన రచయితల సాహిత్యంపై పరిశోధన జరిగితే పరిచయాలు, పరిశోధనలో సహకారం, ఆ తర్వాత ఆ సిద్ధాంత వ్యాసం పుస్తకంగా ముద్రణకు నోచుకోవడంలోను వారి సహాయ సహకారాలు ఉంటాయి. కాని అప్పటికే ఏడు సంవత్సరాలు క్రితం పరమపదించిన ఆత్రేయగారిసాహిత్యంపై పరిశోధన చేయడంలో ఎటువంటి స్వార్థాలు లేవు. అభిమానమే. అందుకే ఇంకా పరిశోధన చేస్తూనే ఉన్నాను. కేవలం ఆత్రేయగారిపైనే కాదు; మోదుకూరి జాన్సన్, మైలవరపు గోపి మొదలగువారి సాహిత్యంపై పరిశోధనను చేస్తున్నాను. వీరి తరపున సహాయ సహకారాలు అందించేవారుకూడా లేరు. వారి సాహిత్యం వెలుగులోకి రావాలనేదే నా ఉద్దేశం. చెప్పుకునే అనుభూతులు ఎన్నో.

## ఆవిష్కరణ కార్యక్రమ మధుర స్మృతులు






ఆహ్వానం

శ్రీ తలతోటి పృథ్విరాజ్ రచించిన
ఆత్రేయ నాటక సాహిత్యం-సంభాషణలు
గ్రంథావిష్కరణ సభకు మీరు విచ్చేయ ప్రార్థన

అధ్యక్షులు :
శ్రీమతి డా॥ బి. అరుణ కుమారి

ముఖ్య అతిథి, గ్రంథ స్వీకారం :
ఆచార్య రొక్కం రాధాకృష్ణ
ఉపాధ్యక్షులు, ఆంధ్ర విశ్వవిద్యాలయం

గౌరవ అతిథి :
ఆచార్య కె.ఎం. నాయుడు
రిజిస్ట్రార్, ఆంధ్ర విశ్వవిద్యాలయం

గ్రంథ సమీక్షకులు :
డా॥ పర్వతనేని సుబ్బారావు
అసోసియేట్ ప్రొఫెసర్, తెలుగు శాఖ, ఏ.యు.
డా॥ కరేపరపు వెంకట్రామయ్య
తెలుగు లెక్చరర్, ఎ.వి.ఎన్. కాలేజ్

ఆత్మీయులు :
ఆచార్య పల్లికొండ ఆపదరావు
డా॥ ఎమ్. ఆదినారాయణరావు

వేదిక : [illegible] సెమినార్ హాల్, ఏ.యు.
తేది : 10-2-2000
సమయం : సా॥ గం॥ 6.00 లకు

ఇట్లు
నిర్వాహణ కమిటీ







కృతి స్వీకర్త ఆచార్య రొక్కం రాధాకృష్ణగారి స్పందన



గ్రంథ ఆవిష్కర్త ఆచార్య జె.ఎం. నాయుడుగారు.



నా గురువర్యులు ఆచార్య పర్వతనేని సుబ్బారావు



తెలుగు శాఖాధిపతి శ్రీమతి బి. అరుణ కుమారి





ఈ పై ఫోటోలలో శ్రోతలుగా హాజరైనవారు ఇప్పుడు అదే విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా, ఆయా కళాశాలలో అధ్యాపకులుగా పనిచేస్తున్నారు. నేను స్కాలర్స్ హాస్టల్లో ఉంటున్నప్పుడు , స్కాలర్‌గా ఉన్నప్పుడు నా పుస్తకావిష్కరణ కార్యక్రమాలకు విచ్చేసి నన్ను ప్రోత్సహించిన మిత్రులెందరో. వారందరికీ నా కృతజ్ఞతలు.





## "ఆత్రేయ నాటక సాహిత్యం-సంభాషణలు"గూర్చి పృథ్వీరాజ్ సంక్షిప్త పరిచయం



..."సంభాషణల్లోని మౌలిక వ్యక్తిత్వాన్ని వివరించి చూపడంలోకూడా డా॥పృథ్వీరాజ్ గణనీయ నిపుణతను ప్రదర్శించాడు. నాటక వర్గీకరణంలోకూడా డా॥పృథ్వీరాజ్ ఔచిత్యానికి పట్టం కట్టాడు. ఆత్రేయ రచనలపై వెలువడిన పుస్తకాల్లో ప్రథమ పంక్తిలో నిలువదగిన పరిశోధనాత్మక రచన యిది. అందుకు పృథ్వీరాజ్‌కు నా అభినందనలు" - డా॥సి.నారాయణరెడ్డి

ఆత్రేయగారి సినిమా సంభాషణల మీద డా॥తలతోటి పృథ్వీరాజ్ 1996నుండి చేస్తున్న పరిశోధనానుభవంతో రచించిన పరిశోధనాత్మక గ్రంథమే " ఆత్రేయ నాటక సాహిత్యం - సంభాషణలు ". ఆత్రేయగారి నాటక సాహిత్యం మీద,వారి సంభాషణలపైన ఆసక్తిగల పాఠకులకోసం రచింపబడిన గ్రంథం ఆత్రేయనాటకసాహిత్యం - సంభాషణలు. సాహిత్య రచనపట్ల రచయిత డా॥తలతోటి పృథ్వీరాజ్‌ను ప్రోత్సహించిన అర్థికశాస్త్ర నిపుణులు,సహృదయులు,విద్యా సంపన్నులు, ఆంధ్రవిశ్వవిద్యాలయం పూర్వ ఉపాధ్యక్షులు ప్రొఫెసర్ కొక్కొండరాధాకృష్ణగారికి ఈ సంపుటిని అంకితమిచ్చారు. ఈ సంపుటిని ఆత్రేయ నాటక జీవితం,ఆత్రేయ నాటక సాహిత్యం,ఆత్రేయ నాటక సంభాషణలు,ఆత్రేయ సంభాషణా శైలి అని నాలుగు రకాలుగా విభజించారు వ్యా రచయిత. ఆత్రేయగారి గౌతమబుద్ధ,అశోకసమ్రాట్,పరివర్తన,వాస్తవం,ఈనాడు,ఎన్.జి.వో.,విశ్వశాంతి,కప్పలు, భయం,మనసూ-వయసు(తిరుపతి) అనే 10 నాటకాలను,ఎవరుదొంగ,అశ్వథామము,ఆత్మార్పణ,ఎవరుదొంగ,ఒక్క రూపాయి, ఓటు నీకే,అంతర్యుద్ధం,ఆత్మార్పణ,కళకోసం,కాపలావాని దీపం,ఛస్తే ఏం?,చావకూడదు,తెరచిన కళ్ళు,ప్రగతి,మాయ, వరప్రసాదం అనే 15 నాటికలను తీసుకుని అందులోని సంభాషణలను విశ్లేషించారు.

**ఆత్రేయ నాటక జీవితం** అనే మొదటి అధ్యాయంలో పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది అని ఆత్రేయగారి పుట్టుకగూర్చి, మాసిపోనిగాయం అని ఆత్రేయ మరువలేని తల్లి మరణ విషయాన్ని,ఆత్రేయ చదువు సంధ్యలు,ప్రేమవివాహిగా ఆత్రేయ ప్రేమతత్వాన్ని,ఇంకా ఆత్రేయకు సంబంధించి వారి వివాహం,దేశభక్తి-నిజాయితీల గూర్చి, వారు సేవలందించిన నాటక సమాజాలు,వివిధ సమాజాలు గూర్చి,ఆంధ్రనాటక కళాపరిషత్‌గూర్చి వివరించడమేకాకుండా ఆత్రేయ సినీరంగ ప్రవేశం,ఆత్రేయ వ్యక్తిత్వాలను...ఇలా అనేక విషయాలను వ్యాసరచయిత డా॥తలతోటి పృథ్వీరాజ్ ఈ పుస్తకంలో చర్చించారు.

**ఆత్రేయ నాటక సాహిత్యం** అనే రెండవ అధ్యాయంలో ఆత్రేయగారు రచించిన పది నాటకాలు, పదిహేను నాటికలకు సంబంధించిన కథను సంక్షిప్తంగా పరిచయం చేశారు. ఎందుకంటే వివిధ నాటకాలలోని సంభాషణల గొప్పతనాన్ని అర్థం చేసుకోవాలంటే కథ తెలియాలి గనుక!.ఆత్రేయగారి నాటికలను ప్రాచ్యానుసరణలు,పాశ్చాత్యానుసరణలు, సమస్యాత్మక నాటికలు,రాజకీయ నాటికలు,కౌటుంబిక నాటికలు,ప్రబోధాత్మక నాటికలు,ప్రతీకాత్మక నాటికలుగా విభజించి పరిశీలించారు పృథ్వీరాజ్. ఆత్రేయగారి నాటకాలను చారిత్రికనాటకాలు,సాంఘిక నాటకాలు,కౌటుంబిక నాటకాలు,ప్రబోధాత్మక నాటకాలు విభజించి పరిశీలించారు ఈ గ్రంథంలో.

**ఆత్రేయ నాటక సంభాషణలు** అనే మూడవ అధ్యాయంలో వస్తువైవిధ్యాన్ని బట్టి 1.ప్రేమ సంభాషణలు 2. సెంటిమెంట్ సంభాషణలు 3.హాస్య సంభాషణలు 4. వ్యంగ్య సంభాషణలు 5. భావ గర్భిత సంభాషణలు 6. ప్రబోధాత్మక సంభాషణలు 7.నిర్వచనాత్మక సంభాషణలు 8.ఆత్రేయ సంభాషణలలో వేదాంతం 9. తార్కిక సంభాషణలు 10. వర్ణనాత్మక, కవితాత్మక,ప్రతీకాత్మక సంభాషణలు 11. స్వ సంభాషణలు 12. ఆత్రేయ సంభాషణలలో స్త్రీ 13. ఆత్రేయ సంభాషణలలో కవులు 14. ఆత్రేయ సంభాషణలలో యుద్ధం 15. ఆత్రేయ సంభాషణలలో మత సామరస్యం 16. ఆత్రేయ సంభాషణలలో జీవిత సత్యాలు ....ఇలా విభజించి విశ్లేషించారు.

"ఒక మంచికథ దొరికితే,దానిని మణిపూసగా మలిచే సామర్థ్యమున్న రచయిత ఆత్రేయ. ఆయన వ్రాసే ప్రతి సంభాషణా అర్థవంతంగా ఉంటుంది. దీర్ఘ సంభాషణలుకాక చిన్నచిన్న సంభాషణలతో అనంతమైన భావాలను ద్యోతకం చేస్తారు. ఆయన సంభాషణల్లో అనవసరంగా ఒక్క సంభాషణకూడా దొర్లదు.ఆలోచించి ఆలోచించి సంభాషణను ప్రారంభిస్తారు. ఊహను అనుకున్న విధంగా సంభాషణ వచ్చేవరకూ ఎంత టైమైనా తీసుకుంటారు. అందుకోసం సతమతమై నలిగిపోతారు.






గించుకుంటారు. తాను అనుకున్న విధంగా సంభాషణ వచ్చిన తరువాత ఆనందంలో మునిగిపోతారు.కేవలం సంభాషణ కొరకని ఒక్క సంభాషణకూడా వ్రాయరు. వ్రాయబడే ప్రతి సంభాషణా తనే ఆ పాత్రగా ఆలోచిస్తారు. ఒకటికి నాలుగుసార్లు అనుకుని ఆ సారాన్ని అనుభవించి వ్రాస్తారు. నటుడుగా ఆలోచించి సంభాషణను రాస్తారు. అందువల్లే ఆయన సంభాషణలు అంత సజీవంగా, సహజంగా ఉంటాయి. అందుకు కారణం ఆయన మంచి నటుడు కావడమే"అని అంటారు ప్రఖ్యాత నటుడు శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి.

"ఎన్.జి.వో.నాటకంలోని గోపి పాత్రకు సంబంధించిన ప్రతిమాటను వ్యంగ్యంగా పలికించారు ఆత్రేయ.భయంకరమైన మురికి కాలువల మధ్య జీవించే గోపి వాళ్ళ యింటికి చేతిరుమాలుతో డాక్టర్ ముక్కు మూసుకుని వచ్చి"అబ్బా!హెల్ హారిబుల్! ఇంకా మీరీయింట్లో కాపురం ఎలా ఉంటున్నారో తెలియడంలేదు"అని అనగా "మాకు తెలిస్తేగా మీకు తెలియడానికి"అని గోపి పాత్రచేత పలికిస్తారు ఆత్రేయ.అదేవిధంగా సంభాషణ సాగుతూ"యింటి ముందు మురుగుకాలువ మూయించమని ఎన్నిసార్లు చెప్పాను? మరీ ముక్కులు పగిలిపోతున్నాయి.నో,నో,ఏం లాభం లేదు"అని పలికే డాక్టర్ మాటలకు "ఎందుకు లేదండీ డాక్టరుగారూ?మురుగుకాలువ మూయిస్తే మాకు రోగాలెట్లా వస్తాయి?రోగాలు రాకుంటే డాక్టర్లేం కావాలి?"అని వ్యంగ్యంగా గోపి పాత్రద్వారా పలికిస్తారు ఆత్రేయ".ఈ రీతిగా ఈ వ్యాససంపుటిలో ఒక వ్యంగ్య సంభాషణను పృథ్వీరాజ్ వ్యాఖ్యానిస్తాడు.

"ఆత్రేయ హిందూ వివాహ చట్టంలోని కొన్ని లోపాలను వ్యంగ్యంగా విమర్శించారు. పతంజలి"హిందూ వివాహ చట్టం"పుస్తకం గూర్చి కూతురితో"ఇదిగో సల్లగా ఇంత లావున ఉంటుంది. ఆ బరువు నువ్వు మోయకపోతే ఆ దెబ్బను తెమ్మని"అని చెప్పి తమ కేసు వాదించమని అతని దగ్గరకు వచ్చిన వారితో"మన వివాహం ఉంది చూడారూ-దానంత పవిత్రమైనది ఇక ప్రపంచంలో ఏదీ లేదు.అంటే, అలాంటిదే అని అర్థం.పుణ్యక్షేత్రాలకెప్పుడన్నా వెళ్ళారా? అక్కడ పవిత్ర జలాలు,పవిత్ర స్థలాలు ఎంత ఘండాలంగా వుంటాయో తెలుసుగా.అంతే అనుకోండి"అని కూతురు తెచ్చి ఇచ్చిన పుస్తకం అందుకొని "బరువు చూశావా? హిందూ వివాహం బరువు? గాడిద బరువు"అని (అంత్యార్థం)అంటాడు. ఈ సంభాషణలో ఆత్రేయ గారి భావన ఏమిటంటే హిందూ వివాహ చట్టం భార్యాభర్తల అనుబంధం విషయంలో ఎంత గట్టిదో అంత పనికి మాలినదీ,బరువైందని. భర్త దుర్మార్గుడు, క్రూరుడైనా అలాగే భార్య భర్తను లెక్కచేయనిదైనా చచ్చినట్టు వాళ్ళుచచ్చేదాక చస్తూ కాపురం చేయాల్సిందే"అని ఆత్రేయ హిందూ వివాహ చట్టంగూర్చి విమర్శనాత్మకంగా చెప్పిన విషయాలను పృథ్వీ రాజ్ పైరీతిగా వ్యాఖ్యానిస్తాడు.ఇలా ఎన్నో సంభాషణలను చక్కగా ఈ అధ్యాయంలో రచయిత వ్యాఖ్యానించారు.

**ఆత్రేయ సంభాషణా శైలి** అనే నాల్గవ అధ్యాయంలో ఆత్రేయగారి వాక్యనిర్మాణం,'కాదు' పద ప్రయోగం,క్యాచ్ లైన్స్,పదచమత్కారం,శ్లేషప్రధానంగా సంభాషణలు,వినూత్న వాక్య ప్రయోగం,సంక్షిప్తత,పాత్రల స్వాభావిక చిత్రణ,నాటికలు-నాటకాలలో పాటల రచనా ప్రయోగం,సంభాషణలలో న్యాయరాలంటీ,పాత్రల పరిచయం,రంగస్థల రూపకల్పనా రచన,రంగం(నాటకంలో)ముగింపు ఆత్రేయగారి నాటకాలలో ఎలా ఉందనే విషయాలను వివరించాడు.ఆత్రేయ కేవలం నాటక సంభాషణలనే కాదు, చివరికి రంగస్థల రూపకల్పన చెయ్యాల్సిన పద్ధతినికూడా చాలా కవితాత్మకంగా వివరించిన ఒక ఉదాహరణ పరిశీలిద్దాం. "వాస్తవం"నాటకంలోని రెండవ రంగంను ప్రదర్శించబోయే ముందు రంగస్థలం ఎలా ఉండాలో ఇలా రాశారు. "కష్టజీవుల చిరుగు గుడిసెలుండే ప్రదేశం ఊరి వెలుపల. దగ్గరనే స్మశానం. ఇలా చెప్తూ "ఒక కోటప్రకృతి ఏర్పరచిన రచ్చలాంటి రాతి తిన్నె వుంది. దాని దగ్గర మునలి చెట్టు అంతా పోయి ఎముకలు మాత్రం వున్న దరిద్రుడిలా నిలబడి వుంది"అని వర్ణనాత్మకంగా చెప్తారు ఆత్రేయ"అని పృథ్వీరాజ్ వర్ణించాడు

'అల్లూరింటి శిల్పి' శ్రీమతి ... ఆత్రేయగారి ... శ్రీ కె.కె.భారతి ... ఆత్రేయగారి సాహిత్యం మీద పరిశోధన ... పరిశోధనాత్మక గ్రంథానికి ... ప్రముఖ ... ప్రముఖ ... శ్రీ ... ప్రముఖ ... గంటా ... చిత్రించారు.

“ కాటికెళ్ళితే అందరూ
ఒకటే అనుకోబోకు
అక్కడ కూడా తేడాలున్నాయి
కాలేవరకు ”

“బ్రతికుండగా
నిన్ను ఏడిపించినోళ్ళు,
నువ్వు చస్తే
ఏడుత్తారు దొంగనాయాళ్లు ”





# ఆత్రేయ సాహిత్యంపై ఇంటర్వ్యూలు

ఆత్రేయ సాహిత్యంపై రెండు విధాలైన ఇంటర్వ్యూలు సాగాయి. ఒకటి పరిశోధకునిగా నేను ఆత్రేయ వ్యక్తిత్వం-సాహిత్యం గూర్చి సినీ ప్రముఖులైనవారు అంటే ఆత్రేయను రచయితగా పెట్టుకుని సినిమాలు నిర్మించిన దర్శక, నిర్మాతలు కావచ్చు, లేదా ఆత్రేయ సమకాలీన సినీ రచయితలు కావచ్చు, అదేవిధంగా ఆత్రేయతో అత్యంత సన్నిహిత సంబంధం గల ఆత్రేయగారి భార్య, ఆత్రేయ శిష్యగణం మొ॥వారి ఇంటర్వ్యూలు ఒక రకం.

ఇక ఆత్రేయగారిపై నేను చేసిన కృషిని గమనించి ఇంటర్వ్యూలు చేసిన సాహిత్యాభిలాషులు, జర్నలిజం మిత్రులు. ఇటువంటి ఇంటర్వ్యూలు రెండు రకాలు జరిగాయి. ఒకటి అమెరికా ఆన్‌లైన్ రేడియో 'తరంగా' వారు చేసింది, మరొకటి సాహితీ మిత్రుడు డా॥యిమ్మిడిశెట్టి చక్రపాణి ఒక పత్రికకొరకు చేసిన ఇంటర్వ్యూ.

ఇంటర్వ్యూలలో అనేక విషయాలు సంక్షిప్తంగా మాధ్యమాన్ని బట్టి పాఠకులకు, శ్రోతలకు తెలుస్తాయి. అవే విషయాలు తెలుసుకోవాలంటే అనేక గ్రంథాలను, వందలకొలది పుస్తకాల పేజీలను ఒక పాఠకుడిగా పఠించాల్సి ఉంటుంది. ఆ బాధ పాఠకుడికి లేకుండా తన పాఠక అనుభవాన్నేగాక, పరిశోధక అనుభవాన్నీ సైతం స్వయంగా అదే పరిశోధకుడు పాఠకుడికి చెప్పడం అరటిపండుఒలిచి పెట్టడమే కదా!

ఈ విభాగంలో ఈతరహా ఇంటర్వ్యూల ద్వారా అనేకవిషయాలు మీరు తెలుసుకుంటారని ఆశిస్తున్నాను.





## సినీ ప్రముఖులతో
# పృథ్వీరాజ్ చేసిన ఇంటర్వ్యూలు

పరిశోధనలో మరొక ఘట్టం ఇంటర్వ్యూలు. ఆత్రేయ వ్యక్తిగత జీవితం గూర్చి, ఆత్రేయ రచనలపై వారి అభిప్రాయం గూర్చి ఇలా పరిశోధనకు ఉపకరించే అనేక అంశాలను రాబట్టుకుని పరిశోధన చేయడానికి నేను రెండు పద్ధతులలో ఇంటర్వ్యూలు చేశాను. 1) ప్రత్యక్ష ఇంటర్వ్యూ 2) పరోక్ష ఇంటర్వ్యూ (ప్రశ్నావళి ద్వారా).

1) ప్రత్యక్ష ఇంటర్వ్యూలు:

ఈ ఇంటర్వ్యూలు చేసే క్రమంలో నేను మూడు చేదు అనుభవాలు చవిచూశాను. మొదట కొంగర జగ్గయ్య, 2. తోటపల్లి మధు, 3. అక్కినేని నాగేశ్వరరావు.

ఇంటర్వ్యూ చేయుడానికి మద్రాసువెళ్ళి చాలామందికి ఫోన్ చేశాను. కొంగర జగ్గయ్యగారు రమ్మని చెబితే టి.నగర్ అనుకుంటూ. చాలా కష్టపడివెళ్ళాను. భయంకరమైన వర్షం. తడుచుకుంటూ వెళ్ళాను. తీరా జగ్గయ్యగారి ఇంటిలోకివెళ్ళి వారిముందు కూర్చున్నాక నేను పరిశోధకుడ్ని అని తెలియజేస్తూ సర్టిఫైచేసిన కాపీని చూపించి ఆత్రేయగారి గూర్చి అడగడం ప్రారంభించే సరికి ఆత్రేయ అంటే నాకు తెలియదు అనేశారు. కొన్నివిషయాలైనా పంచుకోవడానికి ఆయన ఇష్టపడలేదు. నిజంగా తెలియనివాడైతే బాధపడాల్సిన పని ఉండేది కాదు. ఆత్రేయ 'గ్లాస్ మేట్' అని తెలుసు. ఇద్దరూ కలిసి మధుపానం చేసేవారట! అందునా "ఆత్రేయ సాహితీ" పేరుతో 7 సంపుటాలకు సంపాదకత్వం వహించిన వ్యక్తి. కోడెనాగు చిత్రంలో ఇరువురూ ప్రధానపాత్రలు పోషించారు. ఎన్నో విషయాలు అడుగుదామని భావించాను.

ఆత్రేయ సంభాషణల చిత్రాలను చూసినప్పుడు, వారి నటనను చూసినప్పుడు ఎంతో ఉన్నతమైన భావన ఏర్పరచుకున్న వారిపై, ఇంటర్వ్యూ సమయంలో వారి స్పందన చూసి ఒక్కసారిగా నాదృష్టిలో వారి వ్యక్తిత్వం దిగజారిపోయింది.

ఇంకొన్నాళ్ళతర్వాత తెలిసిన విషయం ఏమిటంటే ...మనస్విని ట్రస్ట్‌లో ఆర్థిక అవకతవకలలో ఒక ఆడిటర్, గ్లాస్‌మేట్ పాత్ర ఉందని, ఈ విషయాన్ని ఎవరికీ తెలియజేయవద్దని సినిమా పాటలపై పరిశోధన చేసిన సన్నిహితులైన ఒకరు నాకు చెప్పారు. అప్పుడనిపించింది. నటులైనా వారూ మనుషులేగా అని!

ఇక తోటపల్లి మధు. ఇంటర్వ్యూకై ఒక హొటల్ రమ్మని స్పందిస్తే కష్టపడి వెళ్ళాను. తీరా వెళ్ళాక ఈయన స్పందనకూడా అంతే! నాకేం తెలియదు అని చెప్పిపంపించారు. కొన్నాళ్ళతర్వాత మళ్ళా నేను ప్రశ్నావళి పంపించాను. బహుశా ఈ గ్యాప్‌లో మరిచిపోయారేమో నేను వారిని కలిసిన విషయం. నా ప్రశ్నావళికి





అద్భుతంగా స్పందించారు. ఇటువంటి వ్యక్తులు, వ్యక్తిత్వాలుకూడా ఉంటాయా అని ఆశ్చర్యం వేసింది.

ఇక మరొకరు అక్కినేని. కరెక్ట్‌గా ఇంటర్నెషనల్ ఫిలింఫెస్టివల్ సమయంలో హైద్రాబాద్‌లోని అన్నపూర్ణా స్టూడియోలో వారిని కలవడం జరిగింది. విషయం తెలియజేశాను. ఆయన చెప్పడానికి సమయం ఇవ్వలేదు. ఫలానరోజు రమ్మనీ చెప్పలేదు. ఆదుర్తి, అక్కినేని, ఆత్రేయలను "ఆ"త్రయం అంటూ ఉంటారు. వీరి సినిమాలన్నీ సూపర్ హిట్‌లే. ఆత్రేయగారిగూర్చి ఎన్నోవిషయాలు చెప్పగల సబ్జెక్టు ఉన్న కొంగర జగ్గయ్యగారు గాని, అక్కినేని నాగేశ్వరరావుగారు గాని స్పందించకపోవడం పరిశోధకునిగా ఆనాడు నేను నొచ్చుకున్నాను.

మద్రాసులో కలిసివారిలో మురారిగారి స్పందన అద్భుతం. ఆత్రేయ స్క్రిప్ట్స్ సంపాదించి ఇవ్వడానికి ఎంతో ప్రయత్నం చేశారు. వారి ఆఫీసులో ఉండగానే అక్కడికి కోడిరామకృష్ణ,ఓంకార్ వచ్చారు. ఆత్రేయ పరిశోధకునిగా నన్ను వారికి పరిచయం చేశారు మురారి గారు.

మద్రానులో కలిసిన మరో మంచి మనిషి ఇంటూరి వెంకటేశ్వరరావు. ఆంధ్రరాష్ట్రంనుండి వచ్చానని అంత ముదుసలి వయస్సులోకూడా ఆయన వండుకున్న ఉప్మా నాకూ పెట్టి ఆత్మీయతను పంచి కొన్నివిషయాలు చెప్పి పంపించారు.

ఇక బెంగుళూరులో ఆత్రేయగారి శిష్యుడు జె.కె.భారవిగారు నాపట్ల బాగా స్పందించారు, సహకరించారు. అనేక విషయాలు తెలియజేశారు.

ఇక హైద్రాబాద్‌లో నేను కలిసిన ఇంటర్వ్యూ చేసినవారి గూర్చి చెప్పాలంటే శ్రీయుతులు ఆకెళ్ళ వెంకట సూర్యనారాయణ, దివాకర్ బాబు, డి.వి.నరసరాజు, డా॥ డి.రామానాయుడు, తనికెళ్ళ భరణి వంటి ప్రముఖులను కలిశాను. ఇంటర్వ్యూ చేశాను. చక్కగా స్పందించారు. విశ్వవిద్యాలయం నుండివచ్చిన స్కాలర్స్ అని విలువిచ్చారు.

హైద్రాబాద్‌లో గుమ్మడి వెంకటేశ్వరరావు గారిని కలిసినా వారి అనారోగ్యరీత్యా ఇంటర్వ్యూ చేయలేకపోయాను. వారు ప్రశ్నావళిద్వారా విషయాలు తెలియజేశారు. హాస్యరచన చేసే అప్పలాచార్యకూడా ప్రశ్నావళికి స్పందించి ఆత్రేయ విషయాలు ఎన్నో తెలియజేశారు.

తెనాలిలో బొల్లిముంత శివరామకృష్ణగారిని ఇంటర్వ్యూ చేశాను. ఆత్రేయగారి భార్య శ్రీమతి పద్మావతి ఆత్రేయగారిని తాడేపల్లిగూడెంలో కలవడం జరిగింది. ఎంతో ఆత్మీయంగా ఇంటర్వ్యూ సాగింది. ఆతర్వాతకూడా వారు వారి బంధువుల వివాహానికి నన్ను తాడేపల్లికి ఆహ్వానించడం, నేను హాజరయి నూతన వధువరులను ఆశీర్వదించడం జరిగింది.

వైజాగ్‌లో గొల్లపూడి మారుతీరావుగారు, కాశీ విశ్వనాథ్‌గార్లను కలిసి ఇంటర్వ్యూలు చేయడం జరిగింది.

కొన్నేళ్ళక్రితం వీరి ఇంటర్వ్యూలు అన్నీ కలిపి " ఆత్రేయ సాహిత్యం-వ్యక్తిత్వం " పేరుతో ఆడియో సీ.డీ.గా నేను రూపొందించాను.







సినీ రచయిత ఆకెళ్ళగారితో...



ఆత్రేయ భార్య శ్రీమతి పద్మావతి ఆత్రేయగారితో...



సినీ రచయిత కాశీ విశ్వనాథ్‌గారితో...



సినీ రచయిత, ఆత్రేయ శిష్యుడు జె.కె.భారవిగారితో...



సినీ రచయిత బొల్లిముంత శివరామ కృష్ణగారితో...



సినీ రచయిత డి.వి.నరసరాజుగారితో...







సినీ నిర్మాత డి.రామానాయుడుగారితో...



సినీ రచయిత దివాకర్ బాబుగారితో...



సినీ రచయిత గొల్లపూడి మారుతీరావుగారితో...







# ఆత్రేయ సాహిత్యం గూర్చి ఇతరులు పృథ్వితో జరిపిన ఇంటర్వ్యూలు

ఇంటర్నెట్‌లో నేను ఆత్రేయ సాహిత్యంపై చేసిన కృషిగూర్చి తెలుసుకుని అమెరికన్ ఆన్ లైన్ జాకీ ఆర్.జె. సావి ఒకరోజు నాకు అమెరికానుండి ఫోన్ చేశారు. పరిచయం చేసుకున్నారు. ప్రపంచవ్యాప్తంగా ఆన్‌లైన్ రేడియో వినే శ్రోతలు కూడా ఎక్కువే ఉన్నారు. ఆన్‌లైన్ తెలుగు రేడియోలు విదేశాలనుండి అనేకం నిర్వహించబడుతున్నాయి. కనుక అటువంటి ఆత్రేయ అభిమానుల కొరకు నేను ఆత్రేయగారికి సంబంధించిన అనేక ఆసక్తికరమైన విషయాలను చెప్పడం జరిగింది. అంతేకాదు; ఆత్రేయ శిష్యులు, ఆత్రేయ సాహితీ స్రవంతి ప్రదానం చేసిన ఆత్రేయ పురస్కార గ్రహీతైన గురుచరణ్ గారి ఫోన్ నెంబర్ కూడా సావిగారికి ఇచ్చి ఇంటర్వ్యూ చేయమని సూచించాను.






ఇంటర్వ్యూ మొత్తం ఫోన్‌ద్వారా సాగింది. ఒక గంటా ఎనిమిది నిమిషాలపాటు ఈ ఇంటర్వ్యూ సాగుతుంది. ఇంటర్వ్యూ చివరిలో గురుచరణ్‌గారి ఇంటర్వ్యూను కూడా కలిపి వారు ప్రసారం చేశారు. ఈ ఇంటర్వ్యూపై మంచి స్పందన వచ్చింది. అంతేకాదు; ఆత్రేయ సాహితీ స్రవంతి తలపెట్టిన ఆత్రేయ విగ్రహ ఏర్పాటుకు స్పందించి తనవంతు అర్థిక సహాయాన్ని కూడా ఆమె అందించింది. నేనూ, బ్రహ్మాజీగారు కూడా ఆ పనిపై కొన్నాళ్ళు తిరగడం జరిగింది. ఎందుకో ఏమోగాని ఆ పని అనుకున్నట్లు జరగడంలేదు.

అదేవిధంగా ఆత్రేయగారి సాహిత్యంపై నేను చేసి కృషిని దగ్గరగా గమనించిన వ్యక్తి, ఆత్రేయ సాహితీ స్రవంతి కార్యదర్శిగా వ్యవహరించిన డా॥ యిమ్మిడిశెట్టి చక్రపాణిగారు "విశాఖ సంస్కృతి"వారికొరకు చేసిన ఇంటర్వ్యూ. ఈ రెండు ఇంటర్వ్యూలు పాఠకులకు అనేక విషయాలను తెలియజేసే విధంగా సాగాయని తెలియజేస్తున్నా. ఇంటర్వ్యూద్వారా ఆత్రేయ గారి అనేక విషయాలు ఆత్రేయ అభిమానులతో పంచుకునే అవకాశం కల్పించినందుకు ఈ సందర్భంగా వారికి నా ధన్యవాదాలు.





## అమెరికన్ ఆన్‌లైన్ రేడియో జాక్
# ఆర్.జె.సావి జరిపిన ఇంటర్వ్యూ

**ప్రశ్న:** మీ స్వస్థలం, విద్యాభ్యాసం గురించి చెప్తారా?

**జవాబు:** మా స్వస్థలం గుంటూరు జిల్లా తూబాడు. నేను నెల్లూరుజిల్లా కావలిలో జన్మించాను. నా ప్రాథమిక విద్య, కళాశాల విద్య ప్రకాశం జిల్లా అద్దంకిలో సాగింది. విజయవాడలోని లొయోలా కాలేజీలో డిగ్రీ తెలుగు లిటరేచర్‌ను, హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. తెలుగు లిటరేచర్‌ను పూర్తిచేసాను. యూ.జి.సి. రిసెర్చ్ ఫెలోషిప్ పొందాక "ఆత్రేయ సినిమా సంభాషణలు-ఒక పరిశీలన' అనే అంశంపై ఆంధ్ర విశ్వవిద్యాలయంలో 1995లో పిహెచ్.డి చేయడానికి చేరాను. 2000 సంవత్సరంలో పరిశోధనా గ్రంథాన్ని సమర్పించి పిహెచ్.డి. పట్టాను పొందాను. అదే సంవత్సరం విశాఖపట్నంజిల్లా, అనకాపల్లిలోని ఏ.ఎం.ఏ.ఎల్. కళాశాలలో తెలుగు అధ్యాపకునిగా ఉద్యోగ జీవితాన్ని ప్రారంభించాను. ప్రస్తుతం తెలుగుశాఖ అధ్యక్షులుగా వ్యవహరిస్తున్నాను. అనేక జాతీయస్థాయి సదస్సుల్లో పాల్గొని పత్ర సమర్పణ చేశాను. సుమారు 20 వరకు కవితా సంపుటాలను రచించాను. రెండువందల వరకు ఆడియో, వీడియో సాహితీ సీడీలను రూపొందించాను.




**ప్రశ్న:** మీరు ఆత్రేయగారి గురించి మొదట ఎప్పుడు తెలుసుకున్నారు.

**జవాబు:** నిజం చెప్పాలంటే ఆత్రేయ ఎవరో నాకు ఎం.ఏ. చదివే వరకు తెలియదు. పి.జి. పూర్తయ్యాక నేను సినిమా సాహిత్యంపై పరిశోధన చెయ్యాలనుకునే క్రమంలో ఆత్రేయ గూర్చి తెలుసుకున్నాక ఆత్రేయ సాహిత్యంతో నాకున్న అనుబంధం ఒక్కొక్కటి గుర్తుకు రావడం జరిగింది. ఊహ తెలియడం ప్రారంభమయిన వయసునుంచి నేను చూసిన మూగమనసులు, మురళీకృష్ణ, కోడెనాగు చిత్రాలు మొదలుకొని ప్రేమకర్థం తెలిసిన వయసులో చూసిన 'ప్రేమ, నీరాజనం' చిత్రాల వరకు ఒక్కొక్కటి నాకు గుర్తుకొచ్చాయి. అందులోని పాటలు,మాటలు మదిలో మెదిలాయి. ఆత్రేయ సాహిత్యం నాకు పరిచయం లేనిది కాదని అర్థమయింది.

**ప్రశ్న:** ఆత్రేయగారితో పరిచయం ఎలా జరిగింది.

**జవాబు:** ఈ విషయంలో నేను చాలా దురదృష్టవంతుడ్ని. ఆత్రేయగారితో నాకు పరిచయం లేదు. ఆయన





చనిపోయింది 1989లో. నేను పరిశోధన ప్రారంభించింది 1995లో. స్వయంగా చూడలేకపోయినా ఆతని సాహిత్యాన్ని అధ్యయనం చెయ్యడంద్వారా మన'సు'కవి అత్రేయను నా మనసుతో చూడగలిగాను. సినిమా ప్రేక్షకునిగా నేను కోడెనాగు, భామాకలాపం చిత్రాలలో ఆత్రేయను నటుడిగా చూడగలిగాను. సాహిత్యం ద్వార స్వచ్ఛమైన ఆతని మనసుని చూశాను. వ్యక్తిగా కొన్ని బలహీనతలుగల వ్యక్తి ఆత్రేయఅని గ్రహించాను.

**ప్రశ్న:** ఆత్రేయగారిపై పిహెచ్.డి. చెయ్యాలన్న ఆలోచన ఎలా కలిగింది? మరియు పిహెచ్.డి విషయాలను మా శ్రోతలతో పంచుకుంటారా?

**జవాబు:** ఎం.ఏ. హైద్రాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో పూర్తిచేసి యూ.జి.సి. ఫెలోషిప్‌కు అర్హత సాధించాక ఏ అంశంపై నేను పరిశోధన చెయ్యాలి అనే అలోచన చెయ్యడం ప్రారంభించాక సినీసాహిత్యంపై పరిశోధన చెద్దామని అనిపించింది. స్కాలర్ అభిరుచి మేరకు పిహెచ్.డి. అంశాన్ని ఎన్నుకునే అవకాశం నాకు తెలిసినంతలో హైద్రాబాద్ యూనివర్సిటీలో లేదు. మూనపద్ధతిలో భారత, భాగవతాలమీదో, ప్రబంధాలమీదో, ఆధునిక కవిత్వంమీదో పరిశోధనలు ఉంటాయిగాని ఇటువంటి సినిమా సాహిత్యంమీద పరిశోధనను ప్రోత్సహించే వాతావరణం 95 నాటికి అక్కడలేదు. అది గ్రహించి ఆంధ్రవిశ్వవిద్యాలయానికి వచ్చి డా॥ పర్వతనేని సుబ్బారావుగారి పర్యవేక్షణలో "ఆత్రేయ సినిమా సంభాషణలు- ఒక పరిశీలన " అనే అంశాన్ని ఐదు అధ్యాయాలుగా విభజించుకుని నా పరిశోధనను ప్రారంభించాను. అప్పటికే 'మనస్వినీ' ట్రస్ట్ పేరుతో కొంగర జగ్గయ్యగారి సంపాదకత్వంలో ఆత్రేయ సాహిత్యాన్ని ఏడు సంపుటాలలో తీసుకువచ్చారు. వీరు కూడ సేకరించి ప్రచురించలేని ఆత్రేయ సాహిత్యంలోని ప్రధానమైనవి సంభాషణలు. ఒక సంస్థ చెయ్యాల్సిన పనిని ఒక వ్యక్తిగా నేను సవాలుగా తీసుకుని సినిమా సంభాషణలపై; అందునా ఆత్రేయ సినిమా సంభాషణలపై పరిశోధన చెయ్యడానికి పూనుకున్నాను.

మొదటి అధ్యాయంలో ఆత్రేయ బాల్యం, విద్యాభ్యాసం, వివాహం, మొ॥జీవిత విషయాలనేగాక వారి నాటక రచనలు, సినిమా పాటలగూర్చి, పద్యకవిత్వ, గేయాలు మొ॥ రచనలను గూర్చి వివరించాను.

సినిమా సంభాషణలు-ప్రాముఖ్యత అనే రెండవ అధ్యాయంలో మూకీ నుంచి టాకీ దశ వరకు సినిమా పరిణామక్రమాన్ని తెలియజేసి, టాకీ సినిమాలో సంభాషణలకున్న ప్రాముఖ్యతను, సంభాషణల రచనా విధానాన్ని, లక్షణాలను మొదలగువాటిని వివరించాను.

ఆత్రేయ సంభాషణలు-వైవిధ్యం అనే మూడవ అధ్యాయంలో ఆత్రేయ సంభాషణలు సమకూర్చిన పౌరాణిక, చారిత్రిక, సాంఘిక చిత్రాలను గుర్తించి వస్తువైవిధ్యాన్ని బట్టి ప్రేమ సంభాషణలు, శృంగార సంభాషణలు, వ్యంగ్య సంభాషణలు, నిర్వచనాత్మక సంభాషణలు అని 25 రకాల సంభాషణలను విశ్లేషించాను.

ఆత్రేయ సంభాషణలు-భాష అనే నాల్గవ అధ్యాయంలో సంభాషణా రచనలో ఆత్రేయ ప్రయోగించిన సామెతలు, జాతీయాలు, అన్యదేశ్యాలు,





పాత్రోచిత భాష మొదలగువాటినెన్నింటినో వివరించాను.

సినిమా సంభాషణల రచయితగా ఆత్రేయ అనే ఐదవ అధ్యాయంలో ఆత్రేయగారు సినిమారచయితగా రచన చేసిన 1951-1989 మధ్య కాలాన్ని నాలుగు దశకాలుగా విభజించి వివరించాను. ఫలానాసినిమాకు మాటలు రాసింది ఆత్రేయ అని తెలియకపోయినా; సంభాషణా శైలిని బట్టి 'ఇది ఆత్రేయ రాసింది' అని గుర్తించగల ఆత్రేయగారి రచనా శైలిని, ఆత్రేయ రచనా విధానాన్ని నా పరిశోధన ద్వార తెలియజేశాను. ఆత్రేయ సినిమా సంభాషణా రచనకు మార్గదర్శి. సంభాషణలకు విజ్ఞాన సర్వస్వంగా నా పరిశోధన ద్వారా నిరూపించాను.

మద్రాసు, బెంగుళూరు, హైదరాబాద్ పట్టణాలలోని సినీ ప్రముఖులు, ఆత్రేయతో అనుబంధం ఉన్న అనేకమంది సినీ రచయితలను కలవడం జరిగింది. శ్రీమతి పద్మావతి ఆత్రేయ, శ్రీయుతులు బొల్లిముంత శివరామ కృష్ణ, దివాకర్‌బాబు, ఆకెళ్ళ, జె.కె.భారవి, తనికెళ్ళ భరణి, గొల్లపూడి మారుతీ రావు, కాశీ విశ్వనాథ్, డా॥ డి. రామానాయుడు మొదలగు వారినెందరినో ఇంటర్వ్యూ చేసి ఆత్రేయకు సంబంధించిన అనేక విషయాను తెలుసుకున్నాను. శ్రీయుతులు గుమ్మడి వెంకటేశ్వరరావు, మురళీ మోహన్, కె.విశ్వనాథ్, తోటపల్లి మధు, అప్పలాచార్య మొదలగువారికి ప్రశ్నావళిని పంపించి వారి లేఖల ద్వార ఆత్రేయకు సంబంధించిన అనేక విషయాలను సేకరించాను.

ఫిబ్రవరి 17, 1995లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో పరిశోధకునిగా చేరిన నేను ఆగస్టు 7, 1999లో నా పరిశోధనా గ్రంధాన్ని అవార్డుకొరకు సమర్పించగా ఫిబ్రవరి 26, 2000 సం॥లో అవార్డు ప్రదానమైనది.

**ప్రశ్న:** ఆత్రేయగారి గురించి చాలా మందికి తెలియని; మీకు మాత్రమే తెలిసిన విషయాలు ఏమైనా ఉంటే మాకోసం చెప్తారా? అందరికి తెలిసినవి కూడా మాకోసారి గుర్తుచేస్తారా?

### ఆత్రేయకు సంబంధించిన ఆసక్తికర విషయాలు ఆత్రేయ వ్యక్తిగత విషయాలు

⊙ 'ఆచార్య ఆత్రేయ' అనేది కలం పేరు. ఆత్రేయకు తల్లిదండ్రులు పెట్టిన పేరు కిళాంబి వేంకట నరసింహాచార్యులు. ఆచార్య ఆత్రేయ అనే పేరులోని ఆచార్య అనే పదం బిరుదుగాని, విద్యార్హతను సూచించే పదంగాని కాదు. నరసింహాచార్యలనే పేరులోని ఉత్తరభాగమే ' ఆచార్య '. ఇక ఆత్రేయ అనేది వారి గోత్ర నామం. ఇలా ఆచార్య పదానికి గోత్రనామాన్ని కలిపి 'ఆచార్య ఆత్రేయ' అనే కలం పేరును రూపొందించుకున్నారు ఆత్రేయగారు.

### దేశభక్తునిగా ఆత్రేయ

⊙ 1942లో ఆత్రేయ చిత్తూరులో ఉపాధ్యాయ శిక్షణ పొందుతూ 'క్విట్ ఇండియా' ఉద్యమంలో పాల్గొనగా పోలీసులు పట్టుకెళ్ళి జైల్లో వేసారు. కొన్నాళ్ళు జైలు జీవితాన్ని గడిపిన దేశ భక్తుడు ఆత్రేయ.

### ఆత్రేయ ఉద్యోగాలు

⊙ ఆత్రేయ సినిమా రచయితగాక ముందు బ్రతుకుదెరువుకోసం అనేక ఉద్యోగాలు చేశాడు. ఏ ఉద్యోగంలోనూ స్థిరంగా లేడు. నెల్లూరు జిల్లా మున్సిఫ్ కోర్టులో కాపీయిస్ట్‌గా కొన్నాళ్ళు, తిరుత్తని





సెటిల్‌మెంట్ ఆఫీసులో గుమస్తాగా కొన్నాళ్ళు, నెల్లూరులోని 'జమీన్‌రైతు' పత్రికకు సహాయ సంపాదకునిగా కొన్నాళ్ళు, ఆంధ్ర నాటక కళాపరిషత్‌లో వేతన కార్యదర్శిగా కొన్నాళ్ళు ఆత్రేయ పని చేశారు.

## ఆత్రేయ ప్రేమ వ్యవహారం

⊙ వివాహానికి ముందు ఆత్రేయ బాణం అనే యువతిని గాఢంగా ప్రేమించాడు. కొన్ని కారణాలచేత ఆమెను వివాహం చేసుకోలేకపోతాడు. పెద్దలని నొప్పించలేక వారు కుదిర్చిన ప్రకారంగా 1940 ఫిబ్రవరి 10వ తేదిన ఆత్రేయ పద్మావతిగారిని వివాహం చేసుకున్నాడు. పెద్దల ఒత్తిడితో పెళ్ళైతే చేసుకున్నాడుగాని ప్రియురాల్ని మరిచిపోలేక పోతాడు ఆత్రేయ. ఆత్రేయ ప్రేయసి పేరు 'బాణం'. చక్కగా వీణను మీటేదట! అందుకే ఆత్రేయ వీణపాటల రచనకు ప్రసిద్ధి. మాయని ఆ ప్రేమగాయాలే అనేక ప్రేమగీతాలు-సంభాషణల రచనకు ప్రేరణ అయ్యాయి.

## మన'సు'కవి, రాత్రేయ, బూత్రేయ

⊙ ఒకసారి ఆత్రేయను కలవడానికి శ్రీశ్రీగారు వచ్చి అక్కడున్న బొల్లిముంత శివరామకృష్ణతో "రాత్రేయ ఉన్నాడా?" అని అడగాడంట. రాత్రేయ అని శ్రీశ్రీ ఎందుకన్నాడో కొద్దిసేపటికిగాని శివరామకృష్ణగారికి అర్థంకాలేదట! విశేషమేమిటంటే...ఆత్రేయ రాత్రులే ఎక్కువగా రచన చేస్తాడట. ఆత్రేయ, ఆత్రేయ శిష్యుడు జె.కె.భారవి మధ్య జోక్ – సీరియస్‌గా "గురువుగారు...తెల్లారింది! ఇక నిద్రపోదామా!" అనేవాడట భారవి.

⊙ కొన్ని పాటలకు ఆత్రేయను కొందరు బూత్రేయ అనికూడా అనేవారు. ఒక సినీ రచయితగా తాను అలా రాయాల్సిన పరిస్థితికి బాధపడుతూ " **నా సినిమా సాహిత్యం గూర్చి కొన్ని నిజాలు చెప్పాలి. నేను రాసినవన్నీ మంచివికావు. కొన్ని చెత్తపాటలూ రాశాను. కొన్ని బూతులుగా ధ్వనించేవీ రాశాను. సినిమా కవి బ్రతుకు అనేకానేక అభిరుచులుగల విటులను సంతృప్తిపరచవలసిన పడుపువృత్తి.**" అని వివరణకూడా ఇచ్చాడు. 'ఎదురులేని మనిషి' సినిమాలో " అబ్బా...దెబ్బ తగిలిందా..."అనే పాటలో "తగలరాని తావులో తగిలింది" అని రాసిన ఆ లైన్‌ను అబ్జెక్ట్ చేస్తూ 'మీరంత పబ్లిక్‌గా డెలిబరేట్‌గా సెక్స్‌రాస్తే ఎట్లాగండీ? మీరెలా సమర్థిస్తారు దీన్ని?' " అని సెన్సార్‌బోర్డ్ చైర్మన్ అడిగాడట. ఏం చెయ్యాలో పాలుబోని దర్శక నిర్మాతలు పాటరాసిన ఆత్రేయగారిని ఆర్గ్యుమెంట్‌కి పంపిస్తారు. తగలరాని చోటులో తగిలిందని రాసినందుకు మీరు అబ్జెక్ట్ చేశారు. అసలు తగలవలసిన చోటులెక్కడో మీరు చెప్తే తగలరాని చోటేదో నేను చెప్తానని ఆత్రేయ వాదించాడు. ఆ వాదనకు సెన్సార్ బోర్డ్‌వారు తెల్లముఖం వేసారట! " బూతులు విషయానికి వస్తే అది రాయడం కూడా చాలా మందికి చేతకాదు. అది రాయడానికి కూడా చాలా టాలెంట్ కావాలి" అని మాటల రచయిత దివాకర్‌బాబు అంటారు.

⊙ ఆత్రేయకు చత్వారం వచ్చినా కళ్ళజోడు వాడేవారు కాదు. అతి చిన్న అక్షరాల్ని రాత్రులు





చదవాల్సి వచ్చినప్పుడు మాత్రమే బూతద్దంలో చూస్తూ చదివేవారు. ఓసారి అత్రేయ అలా చదివే సమయంలో ఓ నిర్మాత వచ్చి 'ఏమిటి...బూతద్దంలో చూస్తున్నారు' అని అడిగాడు. " నా రచనల్లో బూతు వుందంటారుగా- వెదుకుతున్నా' అని ఆత్రేయ అన్నారట!

### ఆత్రేయ రాతలు...

⊙ ఆత్రేయ డిక్టేటర్. అవును! ఆయన డిక్టేటరే! హిట్లర్‌లా డిక్టేటర్ అని కాదు నా ఉద్దేశం. ఆయన డిక్టేట్ చేస్తూ ఉంటే తన అసిస్టెంట్స్ రాస్తూ ఉంటారు. స్వహస్తాలతో రాసిన సందర్భాలు చాలా తక్కువ!

⊙ ఒకసారి శ్రీమోదుకూరి జాన్సన్ ఆత్రేయను కలిసి పిచ్చాపాటి మాట్లాడుతూ- "నేను మీ అడుగుజాడలలోనే నడుస్తున్నాను. నిర్మాత ముందుగా డబ్బిస్తేగాని రాయడంలేదు గురువుగారూ" అన్నాడట. "పిచ్చివాడా, నేను డబ్బిచ్చినా రాయడంలేదు. ఆ సంగతి నీకు తెలియదేమో పాపం" అన్నారట ఆత్రేయ నవ్వుతూ...

⊙ ఆత్రేయకు ఒకరోజు పావలా దొరికితే దాంతో ఒక ఎక్సర్ సైజ్ పుస్తకంకొని వీథి దీపం కింద కూర్చుని 'గౌతమబుద్ధ' నాటకం రాసి ఒక ప్రచురణ కర్తకు చూపించగా అతనికి నచ్చి 50 రూపాయలు పారితోషకం ఇవ్వగా అదే పదివేలుగా భావించి ఆత్రేయ పుచ్చుకున్నాడట!

### ఆత్రేయ దుర్భల జీవితం

⊙ ఒక జత వస్త్రాలతో కాలం గడుపుతూ నాటకాలకు ఉపయోగించే తెరలు చుట్టుకొని దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించారు ఆత్రేయ.

⊙ మద్రాసు వచ్చిన తొలిదినాల్లో ఆత్రేయ కొన్నాళ్ళు ఇంటింటికి తిరిగి సబ్బులు అమ్మే ఉద్యోగం చేశారు.

⊙ అప్పుడప్పుడు ఆత్రేయకు పావలా,బేడ టిఫిన్ చెయ్యమని ఇచ్చేవాడట హాస్యనటుడు రమణారెడ్డి.

⊙ ఆత్రేయ సినీకవిగా లక్షలు ఆర్జించినా చివరి దశలో దుర్భర పరిస్థితుల్ని అనుభవించాడు. ఎంత ఆర్థిక దుస్థితి అంటే- "కీర్తి ప్రతిష్టల్ని తాకట్టు పెట్టుకునేవాడు ఎవడన్నా వుంటే బాగుండయ్య"అని మాటల రచయిత దివాకర్ బాబుతో అనేవాడట ఆత్రేయ! అదే విషయం గూర్చి తన ఆత్మకథలో ఇలా రాసుకుంటాడు.

**" లక్షలార్జించి ధనము నలక్ష్యపరచి**
**ఖర్చు చేసితి స్వపర సుఖాల కొరకు**
**ప్రొద్దుగుంకెడి వయసున బొక్కసాన**
**లేదు చిల్లిగవ్వైన నన్నాదుకొనగ "**

### ఆత్రేయ విశ్వాసాలు

⊙ ఆత్రేయ రాసిన కొన్ని పాటలు, మాటలను బట్టి ఆయనను కొందరు హేతువాదిగా, నాస్తికునిగా భావిస్తారు. అతనికున్న కొన్ని నమ్మకాలను బట్టి ఆత్రేయకూడా అందరిలాంటివాడేనని అర్థమవుతుంది. ఎప్పుడూ మే 7వ తేదీన పుట్టిన రోజు చేసుకునే ఆత్రేయ తిథి, వార నక్షత్రాలు అన్నీ కలిసి వచ్చాయని మే 21వ తేదిన తన పుట్టిన రోజును జరుపుకొనబోతున్నట్లు ఆత్రేయే స్వయంగా





వెల్లడించాడు. ఆత్రేయకు సంఖ్యా శాస్త్ర మీద పిచ్చినమ్మకం. ఆత్రేయకు నాడీ జోతిష్యంపై గొప్ప నమ్మకం.

### ఆత్రేయ తొలి – చివరి పాటలు, మాటలు

⊙ రచనా క్రమం రీత్యా 'దీక్ష' చిత్రంలో 'పోరాబాబు పో ' అనే పాట మొదటిది కాగా 'ప్రేమ యుద్ధం'లోని ' ఈ మువ్వల గానం మన ప్రేమకు ప్రాణం' అనే పాట ఆత్రేయగారి చివరి పాట.

⊙ ఆత్రేయను పాటల రచయితగా తన 'దీక్ష' చిత్రంతో పరిచయం చేసిన దర్శకులు కె.ఎస్.ప్రకాశరావుగారు ఆదే చిత్రానికి ఆత్రేయను మాటల రచయితగాకూడా పరిచయం చేసారు.తాపీ ధర్మారావు, ఆత్రేయ దీక్ష చిత్రానికి సంయుక్తంగా సంభాషణలు సమకూర్చారు. మాటల రచయితగా ఆత్రేయ చివరిగా సంభాషణలు సమకూర్చిన చిత్రం 'లైలా (1989)'

⊙ డా॥ చక్రవర్తి సినిమాలో శ్రీశ్రీ రచించిన 'మనసున మనసై బ్రతుకున బ్రతుకై' అనే మనసు పాటను బట్టి అది మనసుకవి ఆత్రేయ రాసాడని, తోడికోడళ్లు సినిమాలో ఆత్రేయ రచించిన 'కారులో షికారుకెళ్ళే పాల బుగ్గల పసిడీ దాన'అనే అభ్యుదయ గీతాన్ని బట్టి దీన్ని శ్రీశ్రీ రాసాడని చాలామంది పొరబడుతుంటారు.

⊙ ఆత్రేయ సుమారు 2,000 పాటలు, 200 సినిమాలకు మాటలను రాశారు.

### ఆత్రేయ బిరుదులు–పురస్కారాలు

⊙ ఆత్రేయ మనిషి, మనసు, మమత అనే పదాలను విడిచిపెట్టకుండా మాటలు–పాటలు రాస్తుంటారు గనుకనే ఆయనకు మన'సు'కవి అని పేరు వచ్చింది. ఇది ప్రజలిచ్చిన బిరుదుగా ఆత్రేయ భావించాడు.

⊙ 1989 మే 5వ తేదీ ఆంధ్ర సార్వత్రిక విశ్వవిద్యాలయం వారు ఆత్రేయగారికి గౌరవ డాక్టరేట్‌ను ప్రధానం చేశారు.

⊙ తమిళ చిత్ర పరిశ్రమలో ఆత్రేయ లాంటి గొప్ప రచయిత కణ్ణదాసన్. ఒకోసారి వీరిరువురు ఒకరి భావాలు ఒకరు షేర్ చేసుకునువాళ్లట! అందుకే ఆత్రేయను ఆంధ్రా కణ్ణదాసన్ అనేవారు. నాటక రంగంలో ఎన్నో అవార్డులు అందుకున్నారు అత్రేయ. నాటక రచయితగా ఆత్రేయను ఆంధ్ర ఇబ్సన్ అని అంటారు.

⊙ సతీ సావిత్రి టైటిల్ కార్డులో 'కవితా సుధానిధి'గా ఆత్రేయను చిత్రదర్శకులు పేర్కొన్నారు.

### ఆత్రేయ స్క్రిప్టు గూర్చి

⊙ తెలుగు సినిమా స్క్రిప్టుకు స్వరూపాన్ని ఇచ్చినవారు ఆత్రేయ. ఆత్రేయగారు సినిమా సంభాషణలు రాసేముందు పేపరుకు పై భాగంలో శ్రీ విఘ్నేశ్వరాయ నమః అని రాసేవారు. పేపరును సగభాగానికి మడిచి ఎడమవైపు ఎర్ర సిరాతో యాక్షన్‌పార్ట్‌ను, కుడిపైపు నీలిరంగు సిరాతో సంభాషణలు రాసేవారు.

⊙ రాసి ప్రేక్షకుల్ని, రాయక నిర్మాతల్ని ఏడ్పిస్తాడని ఆత్రేయమీద ఒక పెద్ద విమర్శ. నిజమే. తాను అనుకున్నది మనసులోనుంచి వచ్చేవరకు





రోజులు...నెలలు పట్టవచ్చు. అప్పుడే పేపరుమీద పెడతాడు. సముద్రమంత మథనం జరగాలి. అలా ఆత్రేయ రాసిన మాటలు ప్రేక్షకులకు కన్నీళ్ళు పెట్టిస్తాయి. సెంటిమెంట్ సంభాషణలు రాయడంలో ఆత్రేయది అందెవేసిన చెయ్యి. లేడీస్ సెంటిమెంట్ లేకపోయినా సెంటిమెంట్ ఆత్రేయ బాగా రాస్తాడని శ్రీశ్రీ పొగిడేవాడట.

⊙ స్క్రిప్టును ఆలస్యంగా ఇవ్వడం గూర్చి ఆత్రేయ తనపై తానే జోక్ వేసుకున్న సందర్భాన్ని అక్కినేని నాగేశ్వరరావుగారు ఇలా చెప్పారు. “ఒకరోజు వాగ్దానం షూటింగ్‌లో ఆర్టిస్ట్‌లంతా మేకప్ వేసుకుని రెడీగా ఉన్నారట. ఆత్రేయగారక్కడ లేరు. డైరెక్టర్‌గారు ఎక్కడ అని అడిగితే మాకు తెలియదని ఎవరిమటుకు వారు సమాధానం చెప్పారట. కాస్త అటూ ఇటూ తిరిగిచూస్తే ఎవరికీ కనబడకుండా ఓమూల కూర్చుని ఆరోజు తీయాల్సిన సీన్స్ రాస్తున్నాడట ఆత్రేయ. ‘ఏంటండి..ఏంటీపని’ అని అడిగితే ‘అదికాదు నాగేశ్వరరావ్‌గారూ నేను స్క్రిప్టులు తొందరగా ఇవ్వనని అందరూ అంటుంటారు గదా! అలాంటప్పుడు నేను తీస్తున్న సినిమాకి స్క్రిప్ట్ ముందే రెడీ చేసి పెట్టుకుంటే ఏంబావుంటుంది? పక్షపాత బుద్ధి అనుకోరూ ”అని ఘొల్లున నవ్వుతూ ఆత్రేయ అన్నారట.

⊙ ఏమండీ మీరు లెవెన్త్ హవర్‌లో రాసిస్తారు ఎందుకండి అని ఒక రచయిత అడిగితే “ముందుగా రాసిస్తే ప్రతివాడు కరెక్ట్ చేసేవాడేన్రా”అని చెప్పాడట ఆత్రేయ.

⊙ ఒక నిర్మాత ఇచ్చిన కథ మీద ఆత్రేయకు పట్టుదొరక్క డైలాగులు రాయడం ప్రారంభించలేదు. స్క్రిప్ట్ కోసమని తిరిగీ తిరిగి విసిగిపోయిన ఆ నిర్మాత ఆత్రేయ దగ్గరకొచ్చి ‘ నాఫైలు నా మొహాన్న పడేయండి. ఇంకొకడిచేత రాయించుకుంటాను. కవులకు కరువులేదు’ అన్నాడు. ‘అలాగే...వేరే ప్రొడ్యూసర్లవీ రెండున్నాయి. అవికూడా తీసుకెళ్లి రాయించు” అన్నారు ఆ నిర్మాత కోపం పోయేలా నవ్విస్తూ ఆత్రేయ.

⊙ ఆత్రేయ నిజ జీవితంలో సమయస్ఫూర్తితో హాస్యస్ఫూరకంగా , వ్యంగ్యంగా మాట్లాడగలుగుతాడుగాని హాస్య సంభాషణా రచన చేయలేడు. సినిమా రచయితగా ఆత్రేయ రాయలేనిది ఏమైన ఉన్నదా అంటే అది హాస్య సంభాషణ ఒక్కటే! అందుకే కొన్ని చిత్రాల్లో హాస్య సన్నివేశాలకు సంభాషణలను అప్పలాచార్య, కొర్రపాటి గంగాధరరావు లాంటి వారిచేత దర్శక - నిర్మాతలు రాయిస్తారు. అందుకే- “ఆత్రేయ కామెడీ మేకింగ్‌లో దిట్ట అయినప్పటికీ రైటింగ్‌లో డల్ ” అని కొందరంటారు.

⊙ ఆత్రేయగారికి సినిమా స్క్రీన్-ప్లే పట్ల ఎంత అవగాహన ఉందో తెలుసుకోవాలంటే ఈ విషయాన్ని వినాల్సిందే. జీవనతరంగాలు సినిమా తీసేముందు బ్యాగ్రౌండ్ సాంగ్ పెట్టాలనే ఆలోచనలో లేరు దర్శక -నిర్మాతలు. సిట్టింగులో స్టోరీ చర్చిస్తుండగా ఆత్రేయగారు అక్కడికి వచ్చారు. కథానాయిక తల్లి చనిపోయిన తర్వాత ఆ సీన్ కట్‌చేస్తే ఆతర్వాత చితి, ఫ్లేమ్‌ను సీన్‌గా చూపిద్దామని అనుకుంటుండగా ఈ రెండింటికి మధ్య బ్యాగ్రౌండ్





టైటిల్ సాంగ్ పెడితే బ్రహ్మాండంగా ఉంటుందని చెప్పి పాటరాసుకుని తీసుకు వస్తాడు ఆత్రేయ. పాట బాగానే ఉంది. మరి ఎలా చిత్రీకరించాలో మాకు అర్థం కావట్లేదని వారు అంటే ఆత్రేయ ఇలా వివరిస్తాడు.

ఈ సినిమాలో కథానాయిక రోజా. ఆమె తమ్ముడు చందు. దొంగతనం అతని అలవాటు. చందుని ఒకసారి పోలీసులు వెంబడిస్తుంటే వారినుంచి తప్పించుకోడానికి ఒక శవాన్ని మోసుకెళ్ళే గుంపులోకి వెళ్ళి శవం మోసుకెళ్ళేవాళ్ళలోని ఒకడిని తప్పుకోమని అతని భుజానికి ఎత్తుకుంటాడు. పోలీసులు వెళ్ళగానే మళ్ళీ వెళ్ళి పోతాడు. ఇక్కడే-

" మమతే మనిషికి బందీఖానా
భయపడి తెంచుకు పారిపోయినా
తెలియని పాశం వెంటబడి
ఋణం తీర్చుకోమంటుంది
నీ భుజం మార్చుకోమంటుంది. "అని

సాహిత్యానికి దృశ్యాన్ని సమన్వయం చేస్తాడు. అదీ ఆత్రేయ గొప్పతనం.

## సినీ రచయితగా ఆత్రేయ

ఆత్రేయ సుందర ప్రదేశాలలో ప్రకృతిని ఆస్వాదిస్తూ రాయడానికే ఇష్టపడతాడు. ఎక్కువగా రాత్రివేళ మెరీనాబీచ్‌కు వెళ్ళేవాడట.

⊙ 'వెలుగు నీడలు' చిత్రానికి ఆత్రేయచేత మంచి సంభాషణలు రాయించుకోవడానికి డి. మధుసూదనరావుగారు ఆత్రేయగారికి ఒక కారు, అసిస్టెంట్ డైరెక్టర్ కె.వి.రావు, డ్రైవర్, బోయ్‌ను అప్పగించి కేరళలోని పీచీడామ్ గెస్ట్‌హౌస్‌కు పంపించాడు. నెలరోజులకు ఆత్రేయ స్క్రిప్ట్ అప్పజెప్పాడట.

⊙ మధుర స్వప్నం సినిమాకు మాటలు రాసింది ఆత్రేయ. ఆ సినిమా క్లైమాక్స్ గోదావరి నదిలో పడవ మీద రాస్తానంటే ఆ చిత్ర దర్శకుడు రాఘవేంద్రరావు ఏర్పాటు చేయించి రాయించారు.

## ఆత్రేయ - కల్లా కపటంలేని పిల్లాడి మనసు

⊙ ఐదువందల రూపాయకోసం టాక్సీలో తిరిగి మూడొందలు టాక్సీకి ఇచ్చి రెండొందలు మిగుల్చుకున్న రోజులూ ఉన్నాయి ఆత్రేయ జీవితంలో!

⊙ ఆత్రేయకు డబ్బులున్నా నిద్రపట్టదు; డబ్బులు లేకపోయినా నిద్రపట్టదట! డబ్బులుంటే నిద్రాహారాలు మానైనా సరే ఆ డబ్బు ఖర్చయ్యేవరకు ఏవేవో కొనేవారు. డబ్బులేకపోతే ఏదో ఒక నిర్మాత దగ్గర డబ్బు ముట్టేదాక తిరుగుతూ ఉండేవాడట!

⊙ ఆత్రేయకు కొత్తకొత్త వస్తువుల మీద వ్యామోహం ఎక్కువ. ఖరీదైన ఫైల్స్, కాగితాలు, పెన్నులు, వాచీలు, సిగరెట్లు, సెంట్లు, సిల్కు బట్టలు మొదలుగున్నవాటికి డబ్బంతా తగలేసేవాడట!

⊙ తాను దర్శక - నిర్మాతగా నిర్మించిన 'వాగ్దానం' చిత్రం ద్వార తెలుగు చిత్ర పరిశ్రమకు దాశరథిని పాటల రచయితగా పరిచయం చేసిన సహృదయుడు ఆచార్య ఆత్రేయ.

⊙ ఆత్రేయ దర్శక-నిర్మాతగా 'వాగ్దానం' చిత్రాన్ని నిర్మించి ఆర్థికంగా నష్టపోయాక, మరెప్పుడూ సినిమాలు తీయనని 'వాగ్దానం'చేశాడట!

## బహుముఖ ప్రజ్ఞాశాలిగా ఆత్రేయ





⊙ ఆత్రేయ గొప్ప నాటక రచయితగా, ప్రయోక్తగా, దర్శకునిగా, నటునిగా ప్రత్యేక స్థానాన్ని కలిగి ఉండడమేకాక, వాగ్దానం చిత్రానికి దర్శక-నిర్మాతగా, ఋణానుబంధం, దేశమంటే మట్టికాదోయ్ మొ॥చిత్రాలకు కథారచయితగా, మూగమనసులు చిత్రానికి ఆత్రేయ-ముళ్ళపూడి వెంకటరమణ,డా॥ఆనంద్ చిత్రానికి ఆత్రేయ-వి.మధుసూదనరావు, వాగ్దానం చిత్రానికి ఆత్రేయ-బొల్లిముంత శివరావకృష్ణ, తోడి కోడళ్ళు చిత్రానికి ఆత్రేయ-ఆదుర్తి సుబ్బారావుగార్లు కథానుసరణలు చేశారు. సతీ సావిత్రి, ఆదర్శకుటుంబం చిత్రాలకు ప్రత్యగాత్మ-ఆత్రేయ, మంచి మనసులు చిత్రానికి ఆదుర్తి-ఆత్రేయ, కన్నతల్లి చిత్రానికి జగన్నాధం-ఆత్రేయలు స్క్రిన్‌ప్లేలు సమకూర్చారు. సినీ నటునిగా ఆత్రేయ కోడెనాగు, ఆదర్శం చిత్రాలలో నటించారు. కోడెనాగులో రామశర్మ పాత్రలో నటించారు. భామాకలాపం చిత్రంలో అతిథి పాత్రలో నటించారు. అపర శ్రీనాథునిగా ఆత్రేయను చెప్పుకోవచ్చు. భోగాలు అనుభవించాడు- చివరి దశలో పరమ దారిద్ర్యాన్ని అనుభవించాడు.

⊙ తెలుగు చిత్ర పరిశ్రమలో 'అ'త్రయం అంటే అద్భుతం. ఆదుర్తి సుబ్బారావు, ఆచార్య ఆత్రేయ, అక్కినేని నాగేశ్వరరావు కాంబినేషన్‌లో వచ్చిన చిత్రాలన్నీ విజయవంతమే! ఉదా: డా॥చక్రవర్తి, తోడికోడళ్ళు, మాంగల్యబలం, మంచి మనసులు, వెలుగు-నీడలు, మూగమనసులు మొదలగున్నవెన్నో...

## సంచలనం సృష్టించిన లేఖ

⊙ ఆత్రేయ గారి తత్వంతో విసిగిపోయిన పద్మావతిగారు కోపంతో ఆత్రేయకు ఒక ఉత్తరం రాసింది. మీరు ఆత్మకథ రాస్తున్నారని విన్నాను. ఊరికే ఆత్మకథ రాయడం కాదు; ఇంకో మనిషికి చేసిన అన్యాయం గూర్చి కూడా రాయండని లేఖరాసి పోస్ట్ చేసింది. ఆ విషయం అంతటితో మరిచిపోయింది. ఆత్రేయపై కోపగించి ఆమె 1976లో రాసిన లేఖ 1989లో ఆత్రేయ చనిపోయిన తర్వాత ఆంధ్రజ్యోతిలో ప్రచురింపబడింది. ఇది వారికెలా చేరిందంటే- భార్య రాసిన లేఖను అందుకున్న ఆత్రేయ ఆత్మకథలో రాయడం కాదు కావాలంటే పేపర్లోనే ఇస్తానని ఆంధ్రజ్యోతి వారికి ఆ లేఖను సీల్‌చేసి ఇచ్చి తాను చనిపోయిన తర్వాతే బయటకు తీసి దానిని పేపర్లో ప్రచురించమని ఆత్రేయ వారివద్ద మాటతీసుకుని చెప్పాడట!

## ఆత్రేయగారిపై పరిశోధనలు-గ్రంథాలు

⊙ వివిధ విశ్వ విద్యాలయాల్లో ఆత్రేయగారి సాహిత్యంపై పరిశోధనలు జరిగాయి. 'ఆత్రేయ నాటికా సాహితి'అనే లఘు సిద్ధాంత వ్యాసాన్ని 1980లో శ్రీ ఎ.వి.రవీంద్రకుమార్ శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో సమర్పించగా, పైడిపాల సత్యన్నారాయణ రెడ్డి 'ఆత్రేయ నాటకాలు-పూర్వాపరాలు'అనే లఘుసిద్ధాంత వ్యాసాన్ని 1984లో ఆంధ్ర విశ్వవిద్యాలయంవారికి సమర్పించారు. 'ఆత్రేయ అభ్యుదయ ఆదర్శాలు' అనే పరిశోధనా గ్రంథాన్ని కె.రాధాదేవిగారు మద్రాసు విశ్వవిద్యాలయానికి 1990లో సమర్పించగా





కె.స్వర్ణలత 'ఆత్రేయ విశ్వశాంతి-వైశిష్ట్యం'అనే పరిశోధనా గ్రంథాన్ని1992లో నాగార్జున విశ్వవిద్యాలయంవారికి సమర్పించారు. ఇక ఆత్రేయగారి సినిమాపాటల విషయానికొస్తే 'ఆత్రేయ సినీగీతాలు-ఒక పరిశీలన' అనే పేరుతో కె.బి.శ్రీలక్ష్మి సిద్ధాంత వ్యాసాన్ని 1994లో శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయానికి సమర్పించారు. 'ఆత్రేయ-కణ్ణదాసన్‌ల పాటలు-ఒక పరిశీలన' అనే అంశంపై శ్రీమతి ఆదుర్తి వెంకటనాగశోభగారు వారి సిద్ధాంత వ్యాసాన్ని మద్రాసు విశ్వవిద్యాలయానికి సమర్పించారు. మనసుకవి,ఆత్రేయ నాటకసాహిత్యం-సంభాషణలు అనే గ్రంథాల్ని రచించిన నేను 'ఆత్రేయ సినిమా సంభాషణలు-ఒక పరిశీలన' అనే అంశంపై నా పరిశోధనా గ్రంథాన్ని 2000లో ఆంధ్ర విశ్వవిద్యాలయం వారికి సమర్పించాను. మొదలి నాగభూషణ శర్మ సంపాదకత్వంలో "ఆచార్య ఆత్రేయ తెలుగు నాటకరంగం"అనే వ్యాస సంకలనాన్ని1986లో తెలుగు విశ్వవిద్యాలయం వారు ప్రచురించారు. ఆత్రేయ మరణాంతరం ఆత్రేయగారికి ఆత్మీయులైనవారు, సినిమా ప్రముఖులు కొందరు 'మనస్విని'పబ్లిక్ ఛారిటబుల్ ట్రస్ట్‌ను ఏర్పాటుచేసి చలన చిత్ర రంగ ప్రముఖులనుంచి విరాళాలు సేకరించి 'ఆత్రేయ సాహితి' పేరుతో ఆత్రేయగారి సాహిత్యాన్ని శ్రీ కొంగర జగ్గయ్యగారి సంపాదకత్వంలో ఏడు సంపుటులుగా సాహిత్యాభిమానులకు అందించారు.

⊙ మే 7, 1921లో జన్మించిన ఆత్రేయ సెప్టెంబర్ 13, 1989, బుధవారం రాత్రి 11 గంటలకు మరణించారు.

**ప్రశ్న:** పద్మావతి ఆత్రేయగారి గురించి కొన్ని విషయాలు తెలియజేస్తారా?

**జవాబు:** ఆత్రేయను కవిగా కాకుండా మామూలు మనిషిగా చూస్తే ఆయనపై నాలాంటి వాడికే కోపం వస్తుంది. ఆత్రేయగారికి పద్మావతి గారు భార్య అనేగాని, దాదాపు భర్తకు దూరంగానే ఆయనున్నన్నాళ్ళూ బ్రతికింది. కవిగా స్థిరపడకముందు ఎంత దుర్భర జీవితాన్ని ఆత్రేయ అనుభవించినా , గొప్ప కవిగా ఆత్రేయకు పేరొచ్చాక సినీప్రపంచంలో ఆయన మకుటం లేని రాజులా జీవించాడు. కాకుంటే పద్మావతి గారి జీవితమే ఏ సంతోషం లేకుండా పోయింది. ఆత్రేయగారితో వివాహం జరిగాకే ఆత్రేయగారి ప్రేమవ్యవహారం తెలిసింది. అయినా సర్దుకు పోయింది. కాని ఆత్రేయ తత్వమే మారలేదు. నాకు తెలిసి కొందరు కవులుగా బలమైనవారే. సంఘంలో వ్యక్తులుగా చాలా బలహీనులు. అలాంటి వారిలో ఆత్రేయ మొదటివారేమోనని అనుకుంటున్నాను. ఆత్రేయను ఆమె వివాహమాడడం ఆమె అదృష్టం అనడం కంటే ఆమె దురదృష్టం అని చెప్పడమే కరెక్టనిపిస్తుంది. ఆత్రేయ గారి భార్య పద్మావతి అనే ఒక్క గౌరవం తప్పించి ఆమె జీవితంలో పొందిన సంతోషం లేదు. సంతానంకూడా లేదు.

**ప్రశ్న:** మీరు స్థాపించి నిర్వహిస్తున్న 'ఆత్రేయ సాహితీ స్రవంతి' సంస్థ గూర్చి చెప్తారా?





**జవాబు:** తెలుగు సినిమా పాటలకు,మాటలకు విజ్ఞాన సర్వస్వం వంటి వారు ఆచార్య ఆత్రేయగారి సినిమా సంభాషణలపై పరిశోధన చేసి పిహెచ్.డి అవార్డును పొందడమేగాక ఆత్రేయ నాటక సాహిత్యంపై " ఆత్రేయ నాటక సాహిత్యం-సంభాషణలు " అనే పుస్తకాన్ని రచించాను. ఆత్రేయగారి సినిమా పాటలపై మన'సు'కవి అనే గ్రంధాన్ని రచించాను. ఆత్రేయ సాహిత్యాభిమానుల కొరకు ఆత్రేయగారి 151 ప్రసిద్ధ సినీగీతాలతో కూడిన " ఆత్రేయ ఆణిముత్యాలు" అనే ఎమ్.పి.త్రీ. సీ.డీ.ని రూపొందించాను. ఆత్రేయగారి సాహిత్యం,వ్యక్తిత్వానికి సంబంధించి పద్మావతి ఆత్రేయ,ఆకెళ్ళ,జె.కె.భారవి,డి.వి.నరసరాజు,గొల్లపూడి మారుతీరావు,బొల్లిముంత శివరామకృష్ణ, డా॥డి.రామానాయుడు,కాశీ విశ్వనాథ్,తనికెళ్ళ భరణి వంటి ప్రముఖుల ఇంటర్వ్యూలను " ఆత్రేయ సాహిత్యం-వ్యక్తిత్వం " పేరుతో ఆడియో సీ.డీ.గా రూపొందించాను. ఆత్రేయ జీవితం,సినిమా సాహిత్యంపై " మహా కవి ఆత్రేయ " అనే డాక్యుమెంటరీ వీడియో సీ.డీ.ని ," ఆత్రేయ సినిమా పాటలు " , " సంభాషణా చాణుక్యుడు ఆత్రేయ " అనే వీడియో సీ.డీ.లను రూపొందించిన నేను 2004 మే 7వ తేదీన ఆత్రేయ 83వ జయంతిని పురస్కరించుకుని " ఆత్రేయ సాహితీ స్రవంతి "అనే సంస్థను స్థాపించాను.' ఆత్రేయ సాహితీ స్రవంతి " గౌరవ సలహాదారులుగా శ్రీమతి పద్మావతి ఆత్రేయ,రసరాజు గార్లు వ్యవహరిస్తున్నారు. ప్రతి సంవత్సరం ఆత్రేయ జయంతి,వర్ధంతి సభలను నిర్వహించడమేకాకుండా, ప్రముఖ తెలుగు సినీ రచయితల సాహిత్యంపై కూడా ఈ సంస్థ సమావేశాలు ఏర్పాటు చేయాలని నిర్ణయించుకుంది. సినీ పరిశ్రమకు ఉత్తమ సాహిత్యాన్ని అందించిన వారికి సంస్థ "ఆత్రేయ సాహితీ పురస్కారాన్ని" ప్రదానం చేస్తోంది. సినీ రచయితగా విశిష్ట సేవలందిస్తున్నవారికి "ఆత్రేయ సాహితీ స్రవంతి" బిరుదు ప్రదానం చేస్తోంది

2006 మే 7వ తేది. ఆత్రేయ 85వ జయంతిని పురస్కరించుకుని ప్రముఖ సినీ గేయ రచయిత శ్రీ జాలాది గారికి " జానపద గేయ శిరోమణి "బిరుదును ప్రదానం చేసింది. 13 సెప్టెంబర్ 2006 ఆత్రేయగారి 17వ వర్ధంతిని పురస్కరించుకుని ఆత్రేయ శిష్యుడు శ్రీ గురుచరణ్ గారికి " ఆత్రేయ సాహితీ పురస్కారం "ను ప్రదానం చేసింది " ఆత్రేయ సాహితీ స్రవంతి ".

**ప్రశ్న:** ఎవరైనా ఈ సంస్థగూర్చి తెలుసుకోవాలంటే ఎలా సంప్రదించాలి?

**జవాబు:** **www.acharyaathreya.com** అనే వెబ్‌సైట్‌లో అన్ని వివరాలు ఉంటాయి. ఈ సంస్థ తరపున నిర్వహించే కార్యక్రమాలలో మీరు పాల్గొనొచ్చు, ఈ సంస్థ నిర్వహించే కార్యక్రమాలకు మీ ఆర్థిక తోడ్పాటును అందించవచ్చు.

> " తెలిసేట్లు చెప్పేది
> సిద్ధాంతం
> - అది
> తెలియక పోతేనే
> వేదాంతం "





## ఆత్రేయ సాహితీ ప్రవంతి పూర్వ కార్యదర్శి కవి
## డా॥ యిమ్మిడిశెట్టి చక్రపాణి జరిపిన ఇంటర్వ్యూ





**డా॥యిమ్మిడిశెట్టి**: నమస్కారం పృథ్వీరాజ్‌గారు

**డా॥తలతోటి** : నమస్కారం!

**డా॥యిమ్మిడిశెట్టి**: హైకూ అనేగాక, ఆత్రేయ అనే పదం విన్నాకూడా ఆంధ్రదేశంలో గుర్తుకొచ్చే పేరు మీది. పిహెచ్.డి పరిశోధనను ప్రారంభింపక మునుపు ఆత్రేయగారి సాహిత్యంతో మీకున్న పరిచయంగూర్చి వివరిస్తారా?

**డా॥తలతోటి** :నిజానికి ఆత్రేయ సాహిత్యంతో ప్రత్యక్ష పరిచయం లేదు. ఇది ఆత్రేయ రాసిన పాట, ఇది ఆత్రేయ రాసిన సంభాషణ అని తెలియకుండానే ఊహతెలిసిన వయసునుంచి ఆత్రేయ సాహిత్యాన్ని వివిధ సినిమాల ద్వారా అనుభూతిచెందుతూ వచ్చాను. ' ప్రేమనగర్ ' సినిమాను బహుశా నా ఎనిమిదేళ్ళ వయసులో చూసి ఉంటాను. దానికి ముందు చూసిన సినిమాలు నాకు జ్ఞాపకంలేవు. ఎం.ఏ.తెలుగు సాహిత్య విద్యార్థిగా చదువుకుంటున్నప్పుడు ఆత్రేయగూర్చి విన్నాను. ఫలాన సినిమాలకు ఆత్రేయ పాటలు-మాటలు సమకూర్చాడని నాకు తెలిసాక 'ప్రేమనగర్' నుంచి 'నీరాజనం' సినిమావరకు నేను విన్న ఆత్రేయ పాటలు, సంభాషణలు ఒక్కొక్కటి గుర్తుకురావడం జరిగింది. హైద్రాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో నేను ఎం.ఏ.తెలుగు చదువుతున్నప్పుడు గేయరచయితగా, సంభాషణా రచయితగా సినీ పరిశ్రమలో ప్రవేశించే ప్రయత్నం కూడా చేశాను. సినీసాహిత్య అధ్యయన





అనుభవంతో సినీ రంగంలో రచయితగా ప్రవేశిద్దామనే ఆలోచనతో ఆ తదనంతరం నా పిహెచ్.డి. పరిశోధనాంశంగా ఆత్రేయ సినీ సంభాషణలను ఎంచుకోవడం ఒక ఆలోచనైతే; ఎవరూ స్పృశించని అంశాన్ని నా పరిశోధనాంశంగా ఎంచుకొని పిహెచ్.డి.చేయాలనేది మరో తలంపు.

తెలుగు చిత్ర పరిశ్రమలో అంతమంది రచయితలుంటే ఆత్రేయనే ఎంచుకోడానికి గలకారణమేమిటని మీరడగవచ్చు. సినిమా పాటలకు–మాటలకు రంగు,రుచి,వాసన అన్నట్లు స్వరూప–స్వభావాన్ని; సాహిత్య గౌరవాన్ని తన రచనలతో కలుగజేసినవాడు ఆత్రేయ. అలతి పదాల కూర్పరి–నేర్పరి ఆత్రేయ. ఆత్రేయ సినిమా పాటలు–మాటలు ఔత్సాహిక సినీ రచయితలకు మార్గదర్శకాలు, విజ్ఞాన నిఘంటువులు. సమకాలీన రచయితలకు ప్రేరణ. ఆత్రేయ సినిమా సంభాషణలనే నా పరిశోధనాంశంగా ఎంచుకోవడంలో మరో ముఖ్యమైన కారణం ఉంది. అదేమిటంటే – ఆత్రేయ సినిమా పాటలను "నా పాట నీనోట పలకాలి" పేరుతో మూడు సంపుటాలుగా, ఆత్రేయ నాటికలు–నాటకాలను మూడు సంపుటాలుగా, ఆత్రేయగారి ఆత్మకథ–గేయాలు–సూక్తులు– ఛలోక్తులను "కదంబం" పేరుతో ఇలా ఏడు సంపుటాలుగా ఆత్రేయ సాహిత్యాన్ని మనస్విని పబ్లిక్ ఛారిటబుల్ ట్రస్ట్‌వారు ప్రచురించారు. ఆత్రేయ రచనలో వారు సేకరించక మిగిలిపోయిన అంశంగా ఆత్రేయగారి సినిమా సంభాషణలు ఉన్నాయి. ఆత్రేయ గారి సంభాషణలను నా పరిశోధనాంశంగా ఎంచుకుంటే ఆత్రేయగారి సమగ్ర సాహిత్యం ఒకవిధంగా గ్రంథస్థం అవుతుందని భావించే ఆ అంశాన్ని నేను ఎంచుకున్నాను.

**డా॥యిమ్మడిశెట్టి**: విశ్వవిద్యాలయాలలోని చాలా మంది పరిశోధకులు కావ్యాలు, ప్రబంధాలు, ఆధునిక సాహిత్యాంశాలపై పిహెచ్.డి. పరిశోధనలు చేస్తూ ఉంటారు. కాని మీరు ప్రత్యేకించి ఆత్రేయ సినిమా సంభాషణలపై పరిశోధన చేయడానికి గల కారణాలేమైనా ఉన్నాయా?

**డా॥తలతోటి** :నిజమే! మీరన్నట్లు నూటికి 70 శాతం అదే భారతం, అదే రామాయణం, అవే ప్రబంధాలపై పరిశోధనలు జరిగాయి. కొన్ని వందల ఎం.ఫిల్., పిహెచ్.డి.పట్టాలు విశ్వవిద్యాలయాలు ప్రదానం చేసాయి. ఇటువంటి పరిశోధనా వాతావరణం విశ్వవిద్యాలయాలలో నెలకొని ఉన్న స్థితిలోకూడా "సినిమా పాటల్లో సాహిత్యపు విలువలు", "తెలుగు సినిమా పాటల్లో సాహితీ ముత్యాలు", "తెలుగు సినిమా పాట", "తెలుగు సినిమా పాటలపై జానపద వాఙ్మయ ప్రభావం" వంటి పలు అంశాలపై అడపాదడపా వివిధ విశ్వవిద్యాలయాలలో సినీ సాహిత్యంపై పరిశోధనలు జరిగాయి. అయితే ఈ పరిశోధనలుకూడా సినిమా పాటలకే పరిమితమయ్యాయి.

హైద్రాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో ఎం.ఏ.పూర్తిచేసి, యూ.జి.సి. ఫెలోషిప్ పొందిన నేను ఆత్రేయ సంభాషణలపై పరిశోధన చేయాలనే ఆలోచన–ఆశయంతోనే ఆంధ్రవిశ్వవిద్యాలంలో 1995లో





పిహెచ్.డి.లో చేరి “ఆత్రేయ సినిమా సంభాషణలు-ఒక పరిశీలన”అనే అంశంపై పరిశోధనను ప్రారంభించి 2000 సంవత్సరంలో పిహెచ్.డి.పట్టాను స్వీకరించాను. నాకు తెలిసి సినిమా సంభాషణలపై జరిగిన తొలి పరిశోధన ఇది. విచిత్రమేమిటంటే పిహెచ్.డి. పూర్తికాకముందే “మన‘సు’కవి” పేరుతో ఆత్రేయ సినిమా పాటలతో నేను రచించి, ప్రచురించిన వ్యాస సంపుటి, ‘‘ఆత్రేయ నాటకసాహిత్యం-సంభాషణలు” అనే అంశంపై మరో పరిశోధనాత్మక పుస్తకాన్ని నవంబర్ 1999లో రచించి ప్రచురించాను. ఇదే సమయంలో ఆత్రేయ జీవితం-సినిమా సాహిత్యంపై “ మహా కవి ఆత్రేయ ” అనే డాక్యుమెంటరీ వీడియో సీ.డీ.ని రూపొందించాను.

**డా॥యిమ్మిడిశెట్టి:** ఆత్రేయ సాహిత్యంపై పరిశోధనలు సరే...“ ఆత్రేయ సాహితీ స్రవంతి” సంస్థ స్థాపన నేపథ్యాన్ని వివరిస్తారా?

**డా॥తలతోటి** : 2000 సంవత్సరంలో అనకాపల్లి, ఏ.ఎం.ఏ.ఎల్.కాలేజీలో తెలుగు అధ్యాపకునిగా చేరాను. 2002లో ఇండియన్ హైకూ క్లబ్ స్థాపించి అనేక సాహిత్య కార్యక్రమాలను వ్యవస్థాపక అధ్యక్షునిగా నిర్వహిస్తూ వస్తున్నాను. ఆత్రేయ సాహిత్యంపై పరిశోధన చేసిన నేను ఆత్రేయగూర్చి మాత్రమేగాక తెలుగు సినీసాహిత్యానికి సంబంధించికూడా అనేక కార్యక్రమాలు నిర్వహించాలనే ఆలోచన చేశాను. దాని ఫలితమే ఇండియన్ హైకూ క్లబ్ అనుబంధ సంస్థగా 2004 మే 7వ తేదీన ఆత్రేయ 83వ జయంతిని పురస్కరించుకుని “ ఆత్రేయ సాహితీ స్రవంతి ”అనే సంస్థ పేరుతో కార్యక్రమాలను ప్రారంభించాను. తొలి కార్యక్రమాన్ని ప్రముఖ గైనకాలజిస్టు డా॥కె.విజయలక్ష్మిగారు జ్యోతి ప్రజ్వలనతో ప్రారంభించాం. 2004 సంవత్సరానికి “ ఆత్రేయ సాహితీ స్రవంతి ” గౌరవ సలహాదారులుగా శ్రీమతి పద్మావతి ఆత్రేయ,రసరాజు గార్లు వ్యవహరించారు.

2006 మే 7వ తేదీ ఆత్రేయ 85వ జయంతిని పురస్కరించుకుని ప్రముఖ సినీ గేయ రచయిత శ్రీ జాలాది గారికి “ జానపద గేయ శిరోమణి ” ఆత్రేయ సాహితీ స్రవంతి బిరుదును, 13 సెప్టెంబర్ 2006 ఆత్రేయగారి 17వ వర్ధంతిని పురస్కరించుకుని ఆత్రేయ శిష్యుడు శ్రీ గురుచరణ్ గారికి “ ఆత్రేయ సాహితీ పురస్కారం ”ను ప్రదానం చేసింది సంస్థ. ఇవేగాక ఆరుద్ర, దాశరథి, వేటూరి సినీసాహిత్యంపై కార్యక్రమాలను నిర్వహిస్తోంది ఆత్రేయ సాహితీ స్రవంతి.

**డా॥యిమ్మిడిశెట్టి:** ఆత్రేయ అభిమానులకోసం ఆత్రేయ సాహిత్యాన్ని వివిధ రూపాలలో సాంకేతికంగా రూపొందిస్తున్నారని విన్నాను. వాటి వివరాలను తెలియజేస్తారా?

**డా॥తలతోటి** : ఆత్రేయ సాహిత్యాభిమానుల కొరకు ఆత్రేయగారి 151 ప్రసిద్ధ సినీగీతాలతో కూడిన “ ఆత్రేయ ఆణిముత్యాలు” అనే ఎమ్.పి.త్రీ.ఆడియో సీ.డీ.ని మొదట తీసుకు వచ్చాను. ఆత్రేయగారి సాహిత్యం, వ్యక్తిత్వానికి సంబంధించి పద్మావతి ఆత్రేయ, ఆకెళ్ళ, జె.కె.భారవి, డి.వి.నరసరాజు, గొల్లపూడి మారుతీరావు, బొల్లిముంత శివరామకృష్ణ,





డా॥డి.రామానాయుడు, కాశీ విశ్వనాథ్, తనికెళ్ళ భరణి వంటి ప్రముఖుల ఇంటర్వ్యూలను " ఆత్రేయ సాహిత్యం-వ్యక్తిత్వం " పేరుతో ఆడియో సీ.డీ.గా రూపొందించాను. " ఆత్రేయ సినిమా పాటలు " ," సంభాషణా చాణుక్యుడు ఆత్రేయ " అనే వీడియో సీ.డీ.లను నేను రూపొందించాను. ఆత్రేయ జీవితం-సాహిత్యం, ఆత్రేయ మొదటి-చివరి పాటలు, ఆత్రేయ వీణపాటలు, ఆత్రేయ సినీ సంభాషణలపై వివిధ డాక్యుమెంటరీలను స్వయంగా రూపొందించి యూట్యూబ్‌లో పెట్టాను. డబ్లుడబ్లుడబ్లు.ఆచార్యఆత్రేయ.కామ్ పేరుతో గతకొన్నేళ్ళుగా వెబ్‌సైట్‌ను నిర్వహించడమేగాక, ఆత్రేయ సాహిత్యాన్ని ఈ-బుక్‌గా రూపొందించి అంతర్జాలంలో అందరికీ అందుబాటులో ఉండేలా పెట్టడం, గిఫ్‌ఫార్మాట్‌లలో ఆత్రేయ ఫోటోలను , సినీ సన్నివేశాలను రూపొందించడం, ఆచార్య ఆత్రేయ ఫేస్‌బుక్‌ను నిర్వహించడం...ఇలా ఎన్నో సాంకేతిక పరమైన పరిజ్ఞానంతో ఆత్రేయ సాహిత్యాన్ని ప్రపంచ వ్యాప్తంగా అందుబాటులో ఉండేలా కృషిచేస్తున్నాను.

**డా॥యిమ్మిడిశెట్టి:**ఆత్రేయ సాహిత్యంపై ఇంకా మీరు చేయాలనుకునే ప్రణాళికాంశలేమిటి?

**డా॥తలతోటి** :ఆత్రేయ సాహిత్యంపై ఇప్పటికే ఎంతో చేశాను. ఆత్రేయ సాహిత్యాభిమానిగా, పరిశోధకునిగా ఇంకా చేస్తూనే ఉన్నాను. ఆత్రేయ సాహిత్యంపై జరిగిన పరిశోధనా గ్రంథాలను సేకరిస్తున్నాను. ఆత్రేయ సంభాషణలు సమకూర్చిన చిత్రాల వీడియో సీ.డీలను, వీడియో పాటలను సేకరిస్తున్నాను. పిహెచ్.డి.పట్టా వచ్చినా ఇంకా పరిశోధన సాగిస్తూనే ఉన్నాను. మనస్విని పబ్లిక్ ఛారిటబుల్ ట్రస్ట్ పేరుతో కొంగర జగ్గయ్య ఆత్రేయ సాహిత్యాన్ని 1990లో ఏడు సంపుటాలలో ప్రచురించారు. సుమారు 353 చిత్రాలలోని 1,097 పాటలను మూడు సంపుటాలలో వారు ప్రచురించారు. మనస్వినీవారు సేకరించని 50పైగా చిత్రాలలోని 230 పాటలను నేను ఇటీవల సేకరించాను. సంభాషణలపై నేను పరిశోధన చేస్తున్నప్పుడు గుర్తించని ఆత్రేయ సంభాషణలు సమకూర్చిన మరో 20 చిత్రాలను గుర్తించాను.

ఆంధ్రా కణ్ణదాసన్‌గా పిలువబడే ఆత్రేయగారి విగ్రహాలు తమిళ సినీకవి కణ్ణదాసన్ విగ్రహాలమాదిరిగానే అనకాపల్లిలో ఏర్పాటుచేయాలని సంస్థ ఆలోచన చేస్తుంది. ఆత్రేయ నాటక ప్రదర్శనలు, ఆత్రేయ పాటల పోటీలు, ఆత్రేయ సాహిత్యంపై రాష్ట్రస్థాయిలో ఒక మంచి వ్యాస సంకలనాన్ని తీసుకు రావాలనే ప్రణాళికలతో ఆత్రేయ సాహితీ సంస్థ పనిచేస్తుంది.

**డా॥యిమ్మిడిశెట్టి:** పృథ్వీరాజ్ గారూ! ఆత్రేయగారి సాహిత్యంపై మీరు చేసిన కృషిని అభినందిస్తున్నాను. ఆత్రేయకు సంబంధించి మీ సంస్థ తలపెట్టిన అన్ని కార్యక్రమాలు నెరవేరాలని ఆశిస్తూ, ఈ మూఖా ముఖిలో ఆత్రేయగారి సాహిత్య విషయాలను తెలియజేసినందుకు ధన్యవాదాలు.

**డా॥తలతోటి** : ధన్యవాదాలు





# "ఆత్రేయ సాహితీ స్రవంతి" స్థాపన, కార్యక్రమాల నిర్వహణ

ఒక సాహితీ సంస్థను స్థాపించడమంటే సాహిత్య యజ్ఞానికి పూనుకోవడమే. ప్రస్తుత రోజుల్లో మిగతా ఏ కార్యక్రమాలనైనా చెయ్యొచ్చుగాని సాహిత్య కార్యక్రమానికి శ్రోతలను తీసుకొచ్చి ఒక గంటపాటు కూర్చోబెట్టడం చాలా కష్టమైన విషయం. ఇండియన్ హైకూ క్లబ్, దాని అనుబంధ సంస్థ కార్యక్రమాలన్నీ శ్రోతలు, సాహిత్యాభిమానుల ఇళ్ళకు వెళ్ళి కరపత్రాలను పెళ్ళి పత్రికల్లా ఇచ్చి ఆహ్వానించ బట్టే కార్యక్రమాలు అంత విజయవంతంగా జరిగాయి. అనేక కార్యక్రమాలకు అనకాపల్లి, పరిసర ప్రాంతాలలోని మా సాహితీ శ్రోతలు అనేక కార్యక్రమాలకు విచ్చేసి మమ్మల్ని ప్రోత్సహించారు. ఈ సందర్భంగా వారికి మా సంస్థలనుండి హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఏదో ఒక కొత్త సమాచారం తెలియజేయాలి, కొత్తవ్యక్తిని పరిచయం చేయాలి. కొత్త వ్యక్తికి అవకాశం కల్పించాలి అని తపించి చేసిన కార్యక్రమాలు ఎన్నో! కొన్ని సంస్థలను నేనే కాదు; చాలామంది గమనించే ఉంటారు. సాధారణంగా వేదిక మీదకు ఎక్కించరు. నేనైతే ఏదో ఒక బాధ్యతను కల్పించి కార్యక్రమ నిర్వహణలో వారి గుర్తింపుకు అనేకులకు అవకాశాలు కల్పించాను.

ఒక సంస్థ వ్యక్తిమీద ఆధారపడకూడదు. ఆ వ్యక్తితో సంబంధం లేకుండా కొనసాగుతూనే ఉండాలి. అనకాపల్లి "లాఫింగ్ క్లబ్" కార్యక్రమాలు చూసినప్పుడల్లా సంతోషం వేస్తుంది. దానితో "ఇండియన్ హైకూ క్లబ్''ను పోల్చుకుని చూసినప్పుడు బాధవేస్తుంటుంది. నేను ఏ నాడు ఈ సంస్థల నుండి కార్యక్రమాలు నేను చేస్తేనే జరగాలి, నేనే ఆలోచన చేయాలని అనుకోలేదు. ఎన్నోమార్లు మిత్రులకు చెప్పాను ఏవైనా కార్యక్రమాలు ప్లాన్ చెయ్యండి, దానికి కావాల్సిన డబ్బుల్ని కూడా నేనే సర్దుతాను అని. కాని స్పందనగా చూడలేకపోయాను.

హుందాతనం ఉట్టిపడే హోటల్ విజయా రెసిడెన్సీ వేదికను తక్కువ రెంట్‌కు ఇండియన్ హైకూక్లబ్ దాని అనుబంధ సంస్థల కార్యక్రమాలకు ఇచ్చి ప్రోత్సహించిన కళాభిమాని, కళాకారుడు స్వర్గీయ జె.రాజుగారు వారి కుటుంబ సభ్యులకు ధన్యవాదాలు. కార్యక్రమాల వివరాలను దినపత్రికలో వార్తగా ప్రజలలోకి తీసుకుపోయిన అనకాపల్లి పాత్రికేయ మిత్రులకూ ధన్యవాదాలు.

సింహావలోకనంగా ఒకసారి వెనక్కితిరిగి చూస్తే ఇంత స్వల్పకాలంలో ఇన్ని కార్యక్రమాలు చేశామా అని ఆశ్చర్యం వేస్తుంటుంది. ప్రత్యేకించి ఆత్రేయ సాహితీ స్రవంతి ద్వారా నిర్వహిద్దామని నిర్వహించడంలో జాప్యమైన నిరుత్సాహపరచిన అంశాలు బ్రస్ట్‌సైజ్ ఆత్రేయ విగ్రహ స్థాపన, ఆత్రేయ నాటకాలు నాటికలు ప్రదర్శింపజేసి వాటిని వీడియోగా రికార్డు చేసి జనం దృశ్యనాటకాలుగా చూడడానికి వీలుగా యూట్యూబ్‌లో అందుబాటులో ఉండేలా చెయ్యడం, ఆత్రేయ మ్యూజికల్ నైట్ నిర్వహించడం వంటివి కార్యరూపం దాల్చలేదు.








2004 మే 7వ తేదీన ఆత్రేయ 83వ జయంతిని పురస్కరించుకుని " ఆత్రేయ సాహితీ స్రవంతి "అనే సంస్థను డా॥తలతోటి పృథ్వీరాజ్ స్థాపించారు. 2004 సంవత్సరానికి " ఆత్రేయ సాహితీ స్రవంతి " గౌరవ సలహాదారులుగా శ్రీమతి పద్మావతి ఆత్రేయ,రసరాజు గార్లు వ్యవహరించారు. సాయికుల్వంత్ జూనియర్ కాలేజ్ కరస్పాండెంట్ శ్రీ ఎమ్.కామరాజు " ఆత్రేయ సాహితీ స్రవంతి " డిజిటల్ బ్యానర్‌ను ఆవిష్కరించారు. తొలి కార్యక్రమాన్ని ప్రముఖ గైనకాలజిస్ట డా॥కె.విజయలక్ష్మిగారు జ్యోతి ప్రజ్వలనతో ప్రారంభించారు.

ప్రతి సంవత్సరం ఆత్రేయ జయంతి,వర్ధంతి సభలను నిర్వహించడమేకాకుండా, ప్రముఖ తెలుగు సినీ రచయితలసాహిత్యంపై కూడా ఈ సంస్థ సమావేశాలు ఏర్పాటు చేయాలని నిర్ణయించుకుంది. ప్రతి సంవత్సరం విడుదలయిన తెలుగు చిత్రాలలోని సంభాషణలు, పాటలను పరిశీలించి బెస్ట్ లిరిసిస్ట్, బెస్ట్ డైలాగ్ రైటర్ అవార్డులను ఆత్రేయ సాహితీ స్రవంతి ప్రకటించి ప్రశంసా పత్రంతో,సన్మాన-సత్కారాలతో తగురీతిగా వారిని గౌరవించాలనే లక్ష్యంతో సంస్థ పనిచేస్తోంది. సినీ పరిశ్రమకు ఉత్తమ సాహిత్యాన్ని అందించిన వారికి సంస్థ "ఆత్రేయ సాహితీ పురస్కారాన్ని" ప్రదానం చేస్తోంది. సినీ రచయితగా విశిష్ట సేవలందిస్తున్నవారికి బిరుదు ప్రదానం చేస్తోంది " ఆత్రేయ సాహితీ స్రవంతి ".

2006 మే 7వ తేది. ఆత్రేయ 85వ జయంతిని పురస్కరించుకుని ప్రముఖ సినీ గేయ రచయిత శ్రీ జాలాది గారికి " జానపద గేయ శిరోమణి "బిరుదును ప్రదానం చేసింది. 13 సెప్టెంబర్ 2006 ఆత్రేయగారి 17వ వర్ధంతిని పురస్కరించుకుని ఆత్రేయ శిష్యుడు శ్రీ గురుచరణ్ గారికి " ఆత్రేయ సాహితీ పురస్కారం "ను ప్రదానం చేసింది " ఆత్రేయ సాహితీ స్రవంతి ".

7 మే 2021న ఆత్రేయ ఆత్రేయ శతజయంతి ఉత్సవాలను నిర్వహించాలని ఆలోచన చేస్తుంది. ఈ కార్యక్రమం ఆత్రేయ పాటలు, నాటికలు, పుస్తకావిష్కరణలు మొదలగువాటితో సాగాలని ఆశిస్తున్నాను.








" ఆత్రేయ సాహితీ స్రవంతి " బ్యానర్ ను ఆవిష్కరించిన ఇండియన్ హైకూ క్లబ్ బ్యానర్ ను ఆవిష్కరించిన శ్రీ ఎం.కామరాజు



ఆత్రేయకు నివాళులర్పిస్తున్న కమలాకరరావు గారు



పృథ్విరాజ్ రూపొందించిన ఆత్రేయ సాహితీ స్రవంతి లోగో

" ఆత్రేయ పాటల్లో లోతైన భావాలు, జీవిత సత్యాలు, ఎంతో మేధస్సు ఇమిడి వున్నాయి. ప్రజల ఆలోచనలు, ఊహాగానాలు ఆయన పాటల్లో వుట్టిపడుతుంటాయి. మనిషి జీవిత అనుభవాలు, చీకటి, వెలుతురు, విజయాలు, అపజయాల గురించి ఆయన హృదయాలకు హత్తుకునే విధంగా పాటలు రాసారు."

– కీ.శే. ఎన్.టి.రామారావు





## జయంతి, వర్ధంతి సమావేశాలు

"ఆత్రేయ సాహితీ స్రవంతి" మహాకవి ఆత్రేయ జయంతి, వర్ధంతులను పురస్కరించుకని వివిధ కార్యక్రమాలను నిర్వహిస్తూ వస్తుంది. ఆత్రేయ సాహిత్యంపైనే గాక ఇతర సినీకవుల సాహిత్యంపైకూడా వారి జయంతి, వర్ధంతులను పురస్కరించుకుని కార్యక్రమాలను నిర్వహించింది "ఆత్రేయ సాహితీ స్రవంతి". వివిధ కార్యక్రమాల నిర్వహణద్వారా సినీ సాహిత్యవిలువలు సభలకు హాజరయినవారికి పంచామని మేము భావిస్తున్నాము.



### ఆత్రేయ 83వ జయంతి



7 మే 2004న 83వ ఆత్రేయ జయంతిరోజున ప్రముఖ గైనకాలజిస్టు డా॥జె. విజయలక్ష్మి గారు జ్యోతి ప్రజ్వలనతో, శ్రీ ఎమ్.కామరాజుగారు "ఆత్రేయ సాహితీ స్రవంతి బ్యానర్ ఆవిష్కరణ"తో " ఇండియన్ హైకూ క్లబ్ " అనుబంధ సంస్థగా అనేక లక్ష్యాలతో నగర ప్రముఖులు,ఆత్రేయ అభిమానులతో "ఆత్రేయ సాహితీ స్రవంతి" అనే సంస్థని ప్రారంభం అయినది. పృథ్విరాజ్ రచించిన "మన 'సు' కవి" వ్యాస సంపుటి ఆవిష్కరణ, పృథ్విరాజ్ రూపొందించిన మహాకవి ఆత్రేయ డాక్యుమెంట్ ప్రదర్శనలతో ఇలా వైభవంగా సంస్థ ప్రారంభం అయినది.



ఆత్రేయ సాహితీ స్రవంతి

(ఇండియన్ హైకూ క్లబ్ అనుబంధ సంస్థ)

అందరికీ ఆహ్వానం

07-05-2004





## ఆత్రేయ 15వ వర్ధంతి






ఆత్రేయ పాటల్లో...

ఆత్రేయ మాటల్లో...


అందరికీ ఆహ్వానం

ఆత్రేయ సాహితీ స్రవంతి

సభాధ్యక్షులు : శ్రీ కొణతల నారాయణరావు,

ముఖ్య అతిథి : శ్రీ ఆంధ్ర నరసింహమూర్తి,

వక్త : డా॥ తలతోటి పృథ్విరాజ్,

తేది, సమయం : 13-09-2004

సోమవారం సాయంత్రం 6 గం॥లకు

స్థలం : హోటల్ విజయా రెసిడెన్సీ,

ఆర్టీసీ కాంప్లెక్స్ ఎదురుగా, అనకాపల్లి.

13 సెప్టెంబర్ 2004న 15వ ఆత్రేయ వర్ధంతి సమావేశం జరిగింది. ప్రముఖ కథకులు శ్రీ ఇచ్ఛాపురపు రామచంద్రం, శ్రీ ఆంధ్ర నరసింహమూర్తి మొ॥ పాల్గొన్నారు. ప్రచురించే కార్యక్రమ కరపత్రాలుకూడా ప్రజలను ఎడ్యుకేట్ చేసేలాగా పాంప్లెట్ వెనుక ఆత్రేయగారి పాటలు, మాటల్లోని ప్రసిద్ధమైన పంక్తులను ఉదహరిస్తూ ఆనందింపజేసేలా ఉంటాయి. వీటి రచన పరిశోధకునిగా పృథిరాజ్ చేసేవాడు. సాహితీ మిత్రులు డా॥ యిమ్మిడిశెట్టి చక్రపాణి సూచన మేరకు సంస్థ ప్రారంభంలో ఆత్రేయ సాహితీ స్రవంతి కార్యదర్శిగా శ్రీ బొగ్గారపు కృష్ణాజీ గారిని నియమించి కార్యక్రమాలను నిర్వహించడం జరిగింది. అనకాపల్లిలోని ప్రముఖులను కార్యక్రమాలలో పాల్గొనేలా చేసేవాళ్ళం.





## ఆత్రేయ 84వ జయంతి



ఆత్రేయకు నివాళులర్పిస్తూ శ్రీ రాపర్తి జగదీష్ కుమార్



ముఖ్య అతిథిగా కవివి శ్రీ చీకట్ల కామేశ్వరరావుగారు



ఆత్రేయగూర్చి సాహితీ పరిశోధకుడు పృథ్విరాజ్



7 మే 2005న 84వ ఆత్రేయ జయంతి కార్యక్రమం నిర్వహింపబడినది. ఇదేరోజు పిల్లలను సాంస్కృతిక అంశాలలో ప్రోత్సహించాలని "భారత్ బాల వికాస్" పేరుతో ఇండియన్ హైకూ క్లబ్ అనుబంధ సంస్థను ప్రారంభించి వ్యాసరచన పోటీలు నిర్వహించాము. హైకూ క్లబ్ మహారాజ పోషకుల్లో శ్రీ రాపర్తి జగదీష్ కుమార్ ఒకరు. అనేక కార్యక్రమాలకు వారు ఆర్థిక తోడ్పాటును అందించారు. భమిడిపాటి ప్రసాదరావుగారు ఆత్రేయ సాహితీ స్రవంతి ఉపాధ్యక్షులుగా వ్యవహరించారు. పృథ్విరాజ్ రూపొందించిన "ఆత్రేయ ఆణిముత్యాలు" ఆడియో సీడి.ఈ కార్యక్రమంలోనే ఆవిష్కరింపబడింది.








13 సెప్టెంబర్ 2005న 16వ ఆత్రేయ వర్ధంతి సమావేశం జరిగింది. ముఖ్య అతిథిగా శ్రీ మళ్ళ రామ అప్పారావు గారు ఈ కార్యక్రమానికి హాజరయ్యారు. భమిడిపాటి ప్రసాదరావుగారు నేను రూపొందించిన "ఆత్రేయ సాహిత్యం-వ్యక్తిత్వం" అనే ఆడియో సీ.డి.ని ఈ కార్యక్రమంలోనే ఆవిష్కరించారు.

పృథ్వీరాజ్ నివాసంలోని హాల్‌నే "బషో కాన్ఫరెన్స్" హాల్‌గా మార్చి కొన్ని సాధారణ సాహితీ కార్యక్రమాలను అక్కడ నిర్వహించడం జరిగింది. సాంకేతికతతో అనుసంధానం చేయబడిన హాల్‌గా రూపొందించాము.


14, సెప్టెంబర్ 2005

ఆత్రేయను స్మరించడం ఆనందదాయకం

ఆత్రేయకు నివాళి


అందరికీ ఆహ్వానం

శ్రీ భమిడిపాటి ప్రసాదరావు

తేది, సమయము : 13-09-2005



ఆత్రేయ చిత్రపటాన్ని పూలమాలతో అలంకరించి నివాళులర్పించిన శ్రీ మళ్ళ రామ అప్పారావు (ఎడమ వైపు), పృథ్వీరాజ్ (కుడివైపు)







## ఆత్రేయ 86వ జయంతి

7 మే 2006న 86వ ఆత్రేయ జయంతి కార్యక్రమం నిర్వహింపబడినది. ఈ కార్యక్రమ నిర్వహణకు ఎక్కువ డబ్బులు వెచ్చించి నిర్వహించాము. కారణం ముఖ్య అతిథిగా జాలాదిని ఆహ్వానించాము. సిటీకేబుల్‌లో స్క్రోలింగ్, ఆటోలో మైక్ ద్వారా ప్రచారం, జాలాదిగారికి రానూ పోనూ కారు. జాలాదిగారితో ప్రయాణ అవకాశం గట్టి బ్రహ్మాజీగారికి దక్కింది. ముందుచెప్పినట్లు పాంప్లెట్ ఎడ్యుకేట్ చేసేలా పృథ్విరాజ్ రూపొందించడం జరిగింది. జాలాదిగారికి బిరుదు"జానపద గేయ శిరోమణి" అనే బిరుదు ప్రదానం చేసి ఘనంగా సత్కరించాము. వారు మరణించాక నివాళిగా వారి సాహిత్యాంశాలపై నేను ఒక బ్లాగ్‌ను రూపొందించడం జరిగింది. ఆత్రేయ సాహితీస్రవంతి సంస్థద్వారా జాలాది గారి జయంతి, వర్ధంతి కార్యక్రమాలను కూడా నిర్వహించడం జరిగింది.

జాలాది బ్లాగ్: http://jaladirajarao.blogspot.com/



**మనసు కవి గూర్చి...**

* ఆచార్య ఆత్రేయ గారి అసలు పేరు కిళాంబి వేంకట నరసింహాచార్యులు
* క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని జైలు శిక్ష అనుభవించిన స్వాతంత్ర్య సమరయోధుడు ఆత్రేయ.
* పది నాటకాలు, పదిహేను నాటికలు రచించిన నాటక రచయిత, నటుడు, ప్రయోక్త. 'ఎన్.జి.ఓ.','ఈనాడు' ప్రసిద్ధ నాటకాలు.
* 1951 'దీక్ష' సినిమాలో 'పోరాబాబు పో...' అనే పాట మొదటిది కాగా 1989 ప్రేమయుద్ధం లోని 'ఈ ముద్దుల గానం ...' అనే పాట ఆత్రేయగారి చివరి పాట.
* 1951లో 'దీక్ష' చిత్రానికి [illegible]తో సంయుక్తంగా సంభాషణలు సమకూర్చిన ఆత్రేయగారు మాటలు రచయితగా రాసిన చివరి చిత్రం 'ప్రేమ' (1989).
* సుమారు మూడువేల పాటలు, 200 చిత్రాలకుపైగా సంభాషణలు సమకూర్చిన కవి ఆత్రేయ.
* సినీ నటుడిగా కోడెనాగు చిత్రంలో రామశాస్త్రి పాత్రను, భామాకలాపం చిత్రంలో అతిథిపాత్రను మరియు ఆదర్శం చిత్రంలోనూ నటించారు.
* 'ఆత్రేయం' కాంబినేషన్‌లో ఆ చిత్రం సూపర్ హిట్, ఆదుర్తి సుబ్బారావు, ఆత్రేయ, అక్కినేని నాగేశ్వరరావు.
* తెలుగు చిత్రసీమలో కథా రచయితగా, పాటల, మాటల రచయితగా స్క్రీన్-ప్లే రచయితగా, 'వీక్ష' చిత్రంతో దర్శక-నిర్మాతగా తెలుగు చిత్ర పరిశ్రమకు సుపరిచితులు.
* ఆత్రేయ జననం 7-5-1921. భౌతికంగా మరణం 13-9-1989, రాత్రి గం. 10-00లకు మద్రాసులో...
* ఆత్రేయ సాహిత్యం చదవడమంటే ఆత్రేయ జీవితాన్ని దర్శించడమే!
* ఆత్రేయ సాహిత్యంపై జరిగిన పరిశోధనలకు పలు విశ్వవిద్యాలయాల్లో ఎం.ఫిల్, పిహెచ్.డి. అవార్డుచేయబడ్డాయి.
* మనస్విని ట్రస్ట్ పేరుతో ఏర్పాటు చేయబడిన సంస్థ ఆత్రేయ సాహిత్యాన్ని 7 సంపుటాలుగా వెలువరించింది.

– డా॥ తలతోటి పృథ్విరాజ్,
ఆత్రేయ సాహిత్య పరిశోధకుడు.

ఉషోదయా ఆఫ్‌సెట్ ప్రింటర్స్, [illegible], అనకాపల్లి, ఫోన్: 226797, 320420

**ఆహ్వానం**

ఆత్రేయ సాహితీ స్రవంతి
(ఇండియన్ హైకూ క్లబ్ అనుబంధ సంస్థ)

ఆచార్య ఆత్రేయ 86వ జయంతి సభకు అందరికీ ఆహ్వానం

ముఖ్య అతిథి
**శ్రీ జాలాది**
సుప్రసిద్ధ సినీ కవి

ఆత్మీయ అతిథి
**శ్రీ రావర్తి జగదీష్ కుమార్,** బి.ఇ.,
ఇండియన్ హైకూ క్లబ్ మహారాజ పోషకులు,
సంఘ సేవకులు, మంగళ పాలెం.

గౌరవ అతిథి
**శ్రీ ధమిడిపాటి ప్రసాదరావు,**
ఆత్రేయ సాహితీ స్రవంతి ఉపాధ్యక్షులు

సభాధ్యక్షులు
**డా॥ తలతోటి పృథ్విరాజ్,**
ఇండియన్ హైకూ క్లబ్ వ్యవస్థాపక అధ్యక్షులు

| స్థలం | సమయం |
|---|---|
| వై.ఎమ్.వి.ఎ. శ్రీధరాల వేంకటరమణ మెమోరియల్ హాలు, గాంధీ మార్కెట్, అనకాపల్లి. | తేది. 7-5-2006, ఆదివారం, ఉదయం గం॥ 10-00లకు |







ఆత్రేయతో ఉన్న అనుబంధాన్ని సభకు వివరిస్తున్న జాలాది



డా॥కె.విష్ణుమూర్తిగారికి పృథ్వీరాజ్ రూపొందించిన ఆత్రేయ ఆణిముత్యాలు సీడీని బహుకరిస్తున్న జాలాది




తన సినీ జీవితాన్ని సభకు వివరిస్తున్న జాలాది



సభకు హాజరైన ఆత్రేయ అభిమానులు, ఆత్రేయ సాహితీ స్రవంతి అభిమాన శ్రోతలు, ఆప్తులు



ఆత్రేయ చిత్రపటాన్ని పూలమాలతో అలంకరించి నివాళులర్పించిన జాలాది





## ఆత్రేయ 17వ వర్ధంతి

13 సెప్టెంబర్ 2006న 17వ ఆత్రేయ వర్ధంతి సమావేశం జరిగింది. ముఖ్య అతిథిగా, వక్తగా ఆత్రేయ శిష్యుడు, ప్రముఖ సినీ గేయ రచయిత శ్రీ గురుచరణ్ గారు కార్యక్రమానికి విచ్చేశారు. వారికి **"ఆత్రేయ సాహిత్యపురస్కారం " ప్రదానం** చేసి సత్కరించడమైనది. ఈ సందర్భంగా వారి చిత్రగీతాలన్నింటిని సీడీగా కూర్చి ఈ కార్యక్రమంలో సీ.డీ.గా ఆవిష్కరించడమైనది. బిరుదు ప్రదానం అంశం పేజీలో మరికొన్ని వివరించడం జరుగుతుంది. ఆత్రేయ సాహితీ స్రవంతి ప్రధాన కార్యదర్శిగా వ్యవహరించిన శ్రీ వేపా పార్వతీశంగారి మిత్రులే శ్రీ గురుచరణ్ గారు. **"భామాకలాపం" సినిమాలో** ఆత్రేయ, సుత్తివేలుపై చిత్రీకరించిన హాస్య సన్నివేశంలో ఆత్రేయప్రక్క అసిస్టెంట్‌లా హాస్పటల్‌కు తీసుకువచ్చినట్లు నటించింది గురుచరణ్ గారే!



అందరికీ ఆహ్వానం

శ్రీ గురుచరణ్, హైదరాబాద్

డా॥ తలతోటి పృథ్విరాజ్

సెల్ : 9394441241, 9440190669, 9849302720







ఆత్రేయకు నివాళి అర్పిస్తున్న శిష్యుడు గురుచరణ్



గురుచరణ్ పాటల సీ.డీ.(ఆడియో) ఆవిష్కరణ



ఆత్రేయ సాహితీ స్రవంతి-ఆత్రేయ పురస్కార వేదిక



గురుచరణ్ చేతులమీదుగా జ్ఞాపికతో భమిడిపాటి



'అందరి మేలు కోరిన ఆత్రేయ'



ఆత్రేయ సాహిత్యం అజరామరం

సినీగేయ రచయిత గురుచరణ్








7 మే 2007న ఆత్రేయ 86వ జయంతి కార్యక్రమం నిర్వహించబడినది. ఈ కార్యక్రమంలో నేను రూపొందించి సాహితీ మిత్రుడు పి.లక్ష్మణ్ రావ్‌కు అంకితంచేసిన "సంభాషణా చాణుక్యుడు ఆత్రేయ" అనే వీడియో సీ.డీని అమరజ్యోతి ఆవిష్కరించారు.





ఆహ్వానం

ఆత్రేయ సాహితీ ప్రవంతి

తేది. 7-5-2007 సోమవారం ఉదయం 10 గంటలకు



అనితరసాధ్యం ఆత్రేయ సాహిత్యం



ఆత్రేయ చిత్రపటాన్ని పూలమాలలతో అలంకరించి ఆత్రేయకు నివాళులు అర్పిస్తున్న ఆత్రేయ సాహితీ ప్రవంతి సభ్యులు డా॥ తలతోటి పృథ్వీరాజ్, భమిడిపాటి ప్రసాదరావు, కవయిత్రి పి.అమరజ్యోతి





## ఆత్రేయ 15వ వర్ధంతి

13 సెప్టెంబర్ 2007న 18వ ఆత్రేయ వర్ధంతి సమావేశం బషో కాన్ఫిరెన్స్ హాల్లో జరిగింది. తొలుత ఆత్రేయ చిత్రపటాన్ని పూలమాలతో అలంకరించి నివాళులర్పించి వివిధ అంశాలపై శ్రీ వేపా పార్వతీశం, శ్రీ భమిడిపాటి ప్రసాదరావు, డా॥ తలతోటి పృథ్విరాజ్ ఉపన్యసించడం జరిగింది.



ఆత్రేయకు నివాళులు అర్పిస్తున్న కవులు,రచయితలు



ఆత్రేయగారిగూర్చి మాట్లాడుతున్న శ్రీ వేపా పార్వతీశం



ఆత్రేయగారిగూర్చి భమిడిపాటి ప్రసాదరావు



ఆత్రేయగారిగూర్చి డా॥ తలతోటి పృథ్విరాజ్





## ఆత్రేయ 88వ జయంతి

7 మే 2009న 88వ ఆత్రేయ జయంతి కార్యక్రమం బషో కానిఫరెన్స్ హాల్లో నిర్వహింపబడినది. ఈ కార్యక్రమానికి అనకాపల్లి ఫిలిమ్ సొసైటి వ్యవస్థాపకులు శ్రీ తమ్మన సుబ్బారావుగారు ముఖ్య అతిథిగా విచ్చేశారు.




పూలమాలతో నివాళి అర్పించిన శ్రీ తమ్మన సుబ్బారావు



కథకులు జి.రంగబాబుగారు ఆత్రేయగారిగూర్చి...



ఆత్రేయగారిగూర్చి డా॥యిమ్మిడిశెట్టి చక్రపాణి





ఆత్రేయగారికి పూలమాలవేసి నివాళులు అర్పిస్తున్న ఆత్రేయ సాహితీ స్రవంతి సభ్యులు





## వేటూరిని నివాళి

ప్రముఖ సినీ గేయ రచయిత వేటూరి సుందరరామమూర్తి 22 మే 2010న మరణించారు. అందుకుగాను ఆత్రేయ సాహితీ ప్రవంతి వారి సంస్మరణ సభను 28 మే 2010న హెూటల్ విజయా రెసిడెన్సీలో నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమానికి వేటూరి సాహిత్యంపై వ్యాస సంపుటి వెలువరించిన శ్రీ గూటూరిని ఆహ్వానించడమైనది.



వేటూరిగూర్చి డా॥తలతోటి పృథ్వీరాజ్, జి.రంగబాబు



వేటూరి చిత్రపటాన్ని పూలమాలతో నివాళులర్పించిన ఆత్రేయ సాహితీ ప్రవంతి సభ్యులు



వేటూరి సంస్మరణ సభలో మౌనం పాటిస్తూ సంతాపాన్ని ప్రకటించిన ఆత్రేయ సాహితీ ప్రవంతి సభ్యులు





వేటూరికి నివాళులు అర్పిస్తూ మాట్లాడిన డా॥ యిమ్మిడిశెట్టి చక్రపాణి, వేటూరి అభిమాని గూటూరి







## ఆత్రేయ 92వ జయంతి

7వేం 2012న ఆత్రేయ 92వ జయంతి కార్యక్రమాన్ని అనకాపల్లిలోని శాఖవీధిలో ఉన్న ప్రభుత్వ గ్రంధాలయంలో లైబ్రేరియన్ శ్రీమతి సాయాదేవి సహకారంతో జరిగింది. ఆత్రేయ సాహితీ స్రవంతి సమావేశ ప్రాముఖ్యతను బట్టి హెూటల్ విజయా రెసిడెన్సీలోనూ, బషో కాన్ఫిరెన్స్ హాల్లోనూ చేయడమేగాక పాఠకులు ఉండే గ్రంథలయంలో నిర్వహించడం సముచితం అని కార్యక్రమాలు నిర్వహించడం ప్రారంభించాము. కార్యక్రమాల వేదికలను మార్చుతూ వచ్చాము. ప్రజలవద్దకు పాలనలాగా శ్రోతలవద్దకు సభ అన్నట్లు! హైకూ క్లబ్ కార్యక్రమ నిర్వహణలో ఇతోదికసహాయ సహకారాలు అందించిన వారు దివాకర్ గారు. వారికి ధన్యవాదాలు.



ఆత్రేయగారి గూర్చి దివాకర్‌గారు



ఆత్రేయగారి గూర్చి కథకులు జి.రంగబాబుగారు, కవి, నటులు గట్టిబ్రహ్మాజీగారు



ఆత్రేయ చిత్రపటాన్ని పూలమాలతో అలంకరించి నివాళులర్పించిన ఆత్రేయ సాహితీ స్రవంతి సభ్యులు, గ్రంథాలయ ఉద్యోగులు



ఆత్రేయగారి గూర్చి డా॥ యిమ్మిడిశెట్టి చక్రపాణి





## ఆత్రేయ 23వ వర్ధంతి

13 సెప్టెంబర్ 2012 న ఆత్రేయ 23వ వర్ధంతి సమావేశం అనకాపల్లి శాఖా గ్రంథాలయంలో జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా ఏ.ఎం.ఏ.ఎల్.కళాశాల పూర్వ ప్రిన్సిపాల్ కన్నయ్య శెట్టిగారు హాజరై ఆత్రేయ చిత్రపటాన్ని పూలమాలతో అలంకరించి నివాళులర్పించారు.



దివాకర్ గారికి పుస్తక జ్ఞాపికను అందిస్తున్న కథకులు జి.రంగబాబుగారు



ఆత్రేయగారి చిత్రపటాన్ని పూలమాలతో అలంకరించి నివాళి అర్పించిన రిటైర్ ప్రిన్సిపాల్ కన్నయ్య శెట్టిగారు, సంస్థ సభ్యులు సన్నికంటి, అమరజ్యోతి,భమిడిపాటి..



ఆత్రేయ సాహితీ అభిమానిగా శ్రీ ఆంధ్ర నరసింహమూర్తి



ఆత్రేయ సాహితీ స్రవంతి కార్యకలాపాలను కొనియాడుతున్న ముఖ్య అతిథి, రిటైర్ ప్రిన్సిపాల్ కన్నయ్య శెట్టిగారు



ఆత్రేయ సాహితీ స్రవంతి కార్యకలాపాలను వివరిస్తున్న ప్రధాన కార్యదర్శి గట్టి బ్రహ్మాజీ





# ఆత్రేయ 24వ వర్ధంతి

13 సెప్టెంబర్ 2013న ఆత్రేయ 24వ వర్ధంతి సమావేశం అనకాపల్లి లోని గాయత్రీ స్కూల్లో జరిగింది. ఈసారి గ్రంథాలయం నుండి స్కూల్, కళాశాలలకు వేదికను మార్చాము. విద్యార్థులకు సాహిత్యాభిరుచిని కలిగించే కార్యక్రమాలుకూడా చేశాము.



డా॥ చక్రపాణి, బళ్ళా నాగభూషణం, కమలాకర్, సనారా



ఆత్రేయ సాహితీ సంపుటిని సభలో ఆవిష్కరించిన కథకులు జి.రంగబాబుగారు



ఆత్రేయ సాహితీ స్రవంతి స్థాపకులు, ఆత్రేయ సాహితీ పరిశోధకుడు డా॥ తలతోటి పృథ్వీరాజ్



సినీ సాహితీ విశ్లేషకునిగా ఆత్రేయ సాహిత్యంపై ప్రసంగిస్తున్న కథకులు జి.రంగబాబుగారు. చిత్రంలో ఆత్రేయ సాహితీ స్రవంతి జి. బ్రహ్మాజీ.



ఆత్రేయ సమావేశానికి విచ్చేసిన అనకాపల్లి ఆత్రేయ సాహితీ అభిమానులు





## జాలాది 83వ జయంతి

9 ఆగస్ట్ 2014న జాలాది 83వ జయంతి సమావేశం స్కూల్ ఆవరణలో జరిగింది. ఆత్రేయ సాహితీ స్రవంతి కేవలం ఆత్రేయ జయంతి, వర్ధంతి రోజుల్లో నిర్వహించే సమావేశాలలో ఆత్రేయ సాహిత్యాన్ని స్మరించుకోవడమే గాకుండా ఇతర సినీ రచయితల జయంతి,వర్ధంతుల సందర్భంగా కార్యక్రమాలు నిర్వహించి వారి సాహిత్యాన్ని స్మరించుకునే సంప్రదాయాన్ని కొనసాగించింది. ఆత్రేయ సాహితీ స్రవంతి నూతన కార్యవర్గానికి ఇదేరోజు బాధ్యతలు అప్పగించడమైనది.



ఆత్రేయ సాహిత్యంపై డా॥ తలతోటి పృథ్వీరాజ్





ఆత్రేయ సాహిత్యంపై శ్రీ గట్టి బ్రహ్మాజీ





"మణిషి పోతెమాత్రమేమి మనసు వుంటదీ
మనసుతోటి మనసెపుడో కలసి పోతదీ"



ఆత్రేయ సాహిత్యంపై శ్రీ జి.రంగబాబు








9 సెప్టెంబర్ 2014న ఆత్రేయ 25వ వర్ధంతి కార్యక్రమం అనకాపల్లి, శారదానగర్ లోని బి.ఎం.ఎల్. స్కూల్ ఆవరణలో జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా శ్రీ బోయిన చిన్నారావు విచ్చేశారు.



బి.ఎం.ఎల్.స్కూల్ స్థాపకులు శ్రీ బోయిన చిన్నారావు సభను ఉద్దేశించి మాట్లాడుతూ...



ఆత్రేయ చిత్రపటానికి నివాళులర్పిస్తూ సంస్థ సభ్యులు



ఆత్రేయ సుమారు 2,000 పాటలు, 200 చిత్రాలకు మాటలు రాశారు. 'వాగ్దానం' చిత్రానికి దర్శకునిగా - నిర్మాతగా, రుణానుబంధం, మూగమనుషులు, డా॥ ఆనంద్ మొదలైన చిత్రాలకు కథారచయితగా ఆదర్శ కుటుంబం, మంచి మనుషులు, కన్నతల్లి, సతీసావిత్రి (రామారావు, వాణిశ్రీ) చిత్రాలకు స్క్రీన్‌ప్లే రచయితగా ఆదర్శం, కోడెనాగు, భామాకలాపం చిత్రాలలో నటుడిగా వివిధ ప్రక్రియలలో పనిచేశారు.





## వేటూరి 79వ జయంతి

29 జనవరి 2015న వేటూరి 79వ జయంతి కార్యక్రమం అనకాపల్లిలోని వివేకానంద ఛారిటబుల్ ట్రస్ట్ హాల్లో జరిగింది. ఈ సందర్భంగా వేటూరి పాటలపోటీని నిర్వహించడం జరిగింది.












# 29న జిల్లాస్థాయి వేటూరి పాటల పోటీ

కొత్తూరు, న్యూస్‌టుడే: సినీ కవి వేటూరి సుందరరామమూర్తి జయంతి సందర్భంగా 29న జిల్లాస్థాయి వేటూరి పాటల పోటీలను నిర్వహిస్తున్నామని ఆత్రేయ సాహితీ స్రవంతి అధ్యక్షుడు గల్లి ప్రసాద్ తెలిపారు. శనివారం శారదానగర్‌లో జరిగిన సమావేశంలో సంస్థ వ్యవస్థాపకుడు డాక్టర్ తంగేటి పృథ్వీరాజ్, ఇండియన్ హైకూ క్లబ్ అధ్యక్షుడు జి.రంగబాబు లతో కలసి ఏర్పాటు చేసిన సమావేశంలో ఆయన మాట్లాడారు. అనకాపల్లి పట్టణంలోని వివేకానంద ఛారిటబుల్ ట్రస్టు హాల్లో శుక్రవారం సాయంత్రం 3 గంటలకు పోటీలు ప్రారంభం అవుతాయన్నారు. ప్రథమ, ద్వితీయ, తృతీయ విజేతలకు జ్ఞాపికలు, ప్రశంసాపత్రాలతో పాటు సత్కార కార్యక్రమం ఉంటుందన్నారు. పోటీల్లో పాల్గొనదలచిన వారు ఫోన్ నెంబరు 9440372307 లో సంప్రదించాలని ఆయన కోరారు.





## ఆత్రేయ 92వ జయంతి

7 మే 2015న ఆత్రేయ 92వ జయంతి కార్యక్రమం అనకాపల్లిలోని బ్రహ్మాజీ గృహ ఆవరణలో జరిగింది. ఈ కార్యక్రమంలో ఆత్రేయ గీతాన్ని తెలుగు టీచర్ శకుంతల మేడమ్‌గారు ఆలపించి అలరించారు. లైబ్రరీ, స్కూల్స్ నుండి ఈ సారి గృహాలలోకూడా ఆత్రేయను స్మరించుకునే కార్యక్రమాలు చేపట్టాము.



ఆత్రేయగూర్చి కథకులు జి.రంగబాబు





ఆత్రేయగూర్చి జి.బ్రహ్మాజీ, మల్లారెడ్డి శంకర్ ప్రసాద్‌లు







గృహాలలోనికార్యక్రమాల వల్ల గృహిణీలే కాదు; పిల్లలు కూడా ఆత్రేయ ఏవరూ? సాహిత్యవిషయలు ఏమిటీ అనేవి తెలుస్తాయి. పెద్దయ్యాక జ్ఞప్తికి వస్తాయి. సన్నికంటి ఆదినారాయణ నిత్య శ్రోత.





## ఆత్రేయ 26వ వర్ధంతి

13 సెప్టెంబర్ 2015న ఆత్రేయ 26వ వర్ధంతి కార్యక్రమం ప్రధాన కార్యదర్శి గట్టి బ్రహ్మాజీగారి ఇంటి ఆవరణలో జరిగింది. ఈ సందర్భంగా సీ.డి. ఆవిష్కరణ జరిగింది. ఈ కార్యక్రమంలో రిటైర్ బ్యాంక్ ఉద్యోగి కె.జగన్నాథరావుగారు ముఖ్య అతిథిగా పాల్గొని సీ.డి.ని ఆవిష్కరించారు. అదేవిధంగా తెలుగు ఉపాధ్యాయురాలు శ్రీమతి కె.శకుంతలగారు, జి. ఉషగారు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

ఆత్రేయ జయంతి, వర్ధంతి కార్యక్రమాలు ప్రతిసంవత్సరం జరిగేవేగనుక కార్యక్రమం నిర్వహించకుండా ఉండేకన్నా ఏదోఒక ప్రత్యేకమైన ఆత్రేయ పనిని ప్రజలలోకి తీసుకువెళ్ళడం కోసం ఇటువంటి కార్యక్రమాలు అప్పుడప్పుడు ఇలా గృహాలలో ఏర్పాటు చేయుడమైనది. చొరవతీసుకున్న బ్రహ్మజీగారికి అభినందనలు.



### ఘనంగా ఆత్రేయ వర్ధంతి



సీడీ ని ఆవిష్కరిస్తున్న ఆత్రేయ అభిమానులు

అనకాపల్లి, సెప్టెంబర్ 14: సినిమా పాటల రచనలో అలతి పదాలకు పట్టాభిషేకం చేసిన కవి ఆచార్య ఆత్రేయ అని డాక్టర్ తలతోటి పృథ్వీ రాజ్ అన్నారు. ఆదివారం స్థానిక శారదానగర్‌లో ఆత్రేయ సాహితీస్రవంతి ఆధ్వర్యంలో 26వ వర్ధంతి వేడుకలు ఘనంగా నిర్వహించారు. ఈ కార్యక్రమంలో ప్రధాన వక్తగా పాల్గొన్న ఆత్రేయ సాహితీ పరిశోధకుడు తలతోటి పృథ్వీరాజ్ మాట్లాడుతూ తేలికైన సామాన్యమైన పదాలతో సినిమా పాటలకు ప్రాణం పోసి సామాన్యుల గుండెల్లో మనసు కవిగా వెలసిన కవి ఆత్రేయ అని అన్నారు. ఈ సందర్భంగా పృథ్వీరాజ్ రూపొందించిన సినీ సాహితీ సిపాని ఆచార్య ఆత్రేయ అనే ఆడియో సీడీని ప్రముఖ కథకులు జి. రంగబాబు ఆవిష్కరించారు. ఈ కార్యక్రమంలో కొడుకుల జగన్నాథరావు, కె. శకుంతల, జి. ఉష తదితరులు పాల్గొన్నారు.

### అన్ని వర్గాలను ఆకట్టుకున్న మహాకవి ఆత్రేయ



సీడీని ఆవిష్కరిస్తున్న నిర్వాహకులు, అతిథులు

శారదానగర్ (కొత్తూరు), న్యూస్‌టుడే: వాడుక తేలికైన పదాలతో అన్ని వర్గాల రసజ్ఞులను ఆకట్టుకున్న మహాకవి, సినీ పాటల రచయిత ఆచార్య ఆత్రేయ అని ఆత్రేయ సాహితీ స్రవంతి వ్యవస్థాపకుడు, సాహితీ పరిశోధకుడు డాక్టర్ తలతోటి పృథ్వీరాజ్ అన్నారు. అనకాపల్లి మండలం కొత్తూరు శారదా నగర్‌లోని స్రవంతి కార్యాలయంలో సోమవారం జరిగిన ఆత్రేయ 26వ వర్ధంతి సమావేశంలో ఆయన మాట్లాడారు. సినిమా పాటల రచనలో అలతి పదాలకు ఆత్రేయ పట్టాభిషేకం చేశారన్నారు. తేలికైన పదాలతో పాటలకు ఆయన ప్రాణం పోశారని కొనియాడారు. సామాన్యుల గుండెల్లో స్థిరం ఆయన చిరంజీవిగా చిరకాలం నిలిచే ఉంటారన్నారు. ఈ సందర్భంగా ఆయన రూపొందించిన సినీ సాహితీ సిపాని ఆచార్య ఆత్రేయ ఆడియో సీడీని కథకులు, రచయిత గొంతిన రంగబాబు చేతుల ఆవిష్కరించారు. స్రవంతి అధ్యక్షుడు గట్టి బ్రహ్మాజీ అధ్యక్షతన జరిగిన సమావేశంలో కొడుకుల జగన్నాథరావు, కె. శకుంతల, జి. ఉష తదితరులు పాల్గొన్నారు.





## ఆత్రేయ పురస్కారం, బిరుదు ప్రదానాలు

ఇండియన్ హైకూ క్లబ్ అనుబంధ సంస్థ అయిన " ఆత్రేయ సాహితీ స్రవంతి " ప్రధాన లక్ష్యాలలో ఆత్రేయ పురస్కార-బిరుదు ప్రదాన అంశాలు. సినిమా సాహిత్యానికి సంబంధించిన సంస్థ గనుక, స్వయంగా సినీ రచయిత అయి ఉండికూడా తన చిత్రానికి తానే అన్ని పాటలు రాసుకునే అవకాశం ఉన్నాకూడా తన "వాగ్దానం" చిత్రం ద్వారా "దాశరథి"ని చిత్రసీమకు పాటల రచయిత పరిచయం చేసిన సహృదయుడు ఆచార్య ఆత్రేయ.

అదే సహృదయతను ఆత్రేయ సాహితీ స్రవంతి కూడా ఆత్రేయ జయంతి, వర్ధంతి కార్యక్రమాలను మాత్రమే నిర్వహించడం కాకుండా వివిధ సినీ రచయితల కార్యక్రమాల నిర్వహణద్వారా వారి సాహిత్యంపైకూడా కార్యక్రమాలను నిర్వహిస్తోంది. వారి సాహిత్యాన్ని ప్రజలలోకి తీసుకువెళ్ళే ప్రయత్నాలు చేసింది.

పురస్కారం, బిరుదులు ఒక రచయితకు ప్రోత్సాహకాలు. లక్షలు ప్రదానం చేయనవసరం లేదు. వారి కృషిని గుర్తిస్తేచాలు!. అటువంటి పనే ఆత్రేయ సాహితీ స్రవంతి చేసింది. ఆత్రేయ శిష్యుడైన గురుచరణ్ గారికి ఆత్రేయ పురస్కారాన్ని ప్రదానం చేయగా, ఆత్రేయ సమకాలీనుడైన జాలాది గారికి జానపద గేయ శిరోమణి అనే బిరుదుతో సత్కరించింది.














ఆత్రేయేతర రచయితలైన ఆరుద్ర, వేటూరిపై ఆత్రేయ సాహితీ స్రవంతి నిర్వహించిన కార్యక్రమాల ఫోటోలలో కొన్ని . సినిమా మాటల, పాటల రచయితగా మైలవరపు గోపి, మోదుకూరి జాన్సన్ ల సాహిత్యంపై సినిమా సాహిత్య పరిశోధకునిగా పృథ్వీరాజ్ రూపొందించిన ఆడియో డాక్యుమెంట్స్, డాటా ఫైల్స్.





## జాలాదికి బిరుదు ప్రదానం

7 మే 2006న ఆత్రేయ 85వ జయంతిని పురస్కరించుకుని జాలాదిగారిని ఆహ్వానించడం జరిగింది. ఈ కార్యక్రమంలో వారిని **"జానపద గేయ శిరోమణి" అనే బిరుదుతో** వారిని సత్కరించడం జరిగింది. కారణం సినిమాలలో వారు అనేక సినిమా పాటలు జానపద శైలిలో రాశారు. జానపద గేయాలకు గుర్తింపును తీసుకు వచ్చారు. కొసరాజుతో సమాన స్థాయిలో పల్లెపదాలను సినిమా పాటల్లో పలికించిన కవి. కేవలం జానపదశైలీ గీతాలకే పరిమితం కాకుండా "పుణ్యభూమి నాదేశం నమో నమామి" అని దేశభక్తి పూరితమైన అద్భుత గేయాన్ని రాసిన కవికూడా. అటువంటి గేయాలనెన్నింటినో రాసి తెలుగు సినీగీతాలను సుసంపన్నంచేసి, సినిమా పాటల చరిత్రలో తనకంటూ ఒక స్థానాన్ని ఏర్పరచుకున్న కవిగా, ప్రత్యేకతను చాటుకున్న కవిగా ఆత్రేయ సాహితీ స్రవంతి గుర్తించి అనకాపల్లి పురప్రజల సమక్షంలో జాలాదిగారిని ఘనంగా సత్కరించింది.



జాలాదిని సత్కరిస్తున్న ఆత్రేయ సాహితీ స్రవంతి సభ్యులు డా॥తలతోటి పృథ్వీరాజ్, భమిడిపాటి, గట్టి బ్రహ్మాజీ, జి. రంగబాబు





# జానపద గేయ శిరోమణి



అద్భుతమని చెప్పగలిగే పాటలు
ఆయన ఖాతాలో అనేకం. జానపద
గీతాలకు ఆయన పెట్టింది పేరు.
ఆయన ఎవరో కాదు. వందలాది పాటల
జాలాది. యావత్ ఆంధ్రలోనే జానపదుల
జాలాది ఆయన మారుపేరు. ఎన్నో
అవార్డులందుకున్న గీతాలు ఆయనకే సొంతం.
జానపద జావళీల స్రవంతి. ప్రతీ మదిని ఆనంద పరవశంలో
ఓలలాడించే అద్భుత గేయ రథసారథి. పదవిన్యాసాల వారధి.
దేశభక్తిగీతం రచించినా...జాన పదాలతో జ్ఞానపదాలు అల్లినా...
విప్లవగీతాలతో మేల్కొల్పినా...జోల పాటతో ఓలలాడించినా
ఆయనదో ప్రత్యేక శైలి.పాటల రచనలో ఆయన అనంత
జ్ఞాన జలధి, జానపద జావళీల జాలాది.తెలుగు సినీ సాహిత్యంలో
ఎంతో ఉన్నతమైన విలువలతో కూడిన గేయాలను రచించి
పండిత, పామర జనావళి మనసుల్లో చిరస్థాయిగా నిలిచిన
జావళీల జాలాది గారికి ఆచార్య ఆత్రేయ 85వ జయంతి
సందర్భంగా ఇండియన్ హైకూ క్లబ్ అనుబంధ సంస్థ
ఆత్రేయ సాహితీ స్రవంతి ఆత్మీయంగా ప్రదానంచేసిన బిరుదు

## జానపద గేయ శిరోమణి

INDIAN HAIKU CLUB
ATHREYA SAHITHEE SRAVANTHI
D.No. 6-5, 6th Street, Saradanagar, Anakapalle - 531 001. A.P.
Ph: 08924-220778, 320778, Cell: 9394441241
http://indianhaikuclub.telugupeople.com
http://haikumonthly_magazine.telugupeople.com
e-mail: Indianhaikuclub@rediffmail.com





## గురుచరణ్‌కు పురస్కారం

“ఆత్రేయ సాహితీ పురస్కారం” అందుకున్న తొలి రచయిత గురుచరణ్ గారు. ఆత్రేయ శిష్యునిగా తెలుగు సినిమా పాటలలో “ముద్దబంతి నవ్వులో మూగ బాసలు”, “ముసి ముసి నవ్వులలోన”, “బోయవాని వేటకు గాయపడిన కోవెల” అనే పాటలెన్నో రాశారు. అనకాపల్లిలో చదువుకున్నారు. ఆత్రేయ సాహితీ స్రవంతి సభ్యులైన శ్రీ వేపా పార్వతీశం గారికి మిత్రులు గురుచరణ్‌గారు. వీరు ఆత్రేయతో భామాకలాపంలో అతిథి నటునిగా నటించారు. సుమారు 52 చిత్రాలకు , 18 డబ్బింగ్ చిత్రాలకు పనిచేశారు. సుమారు 200 పాటలు రాశారు.

ఇటువంటి వీరికి ఆత్రేయ సాహితీ స్రవంతి 13 సెప్టెంబర్ 2006 ఆత్రేయ సాహితీ పురస్కారం ప్రదానం చేసింది.








## పాటల పోటీల నిర్వహణ

ఆత్రేయ సాహితీ స్రవంతి సినిమా సాహిత్యాన్ని అనుబంధం చేసుకుని చాలా పోటీలను నిర్వహించాలని అనుకున్నది. అటువంటి వాటిలో ఈ పాటల పోటీ ఒకటి. వేటూరివారి పాటల పోటీని నిర్వహించడం జరిగింది. రానున్న రోజుల్లో ఆత్రేయ పాటలపోటీలే కాకుండా ఇతర రచయితల పాటలపోటీలు, పాటలపై వ్యాసరచన పోటీలు నిర్వహించే ఆలోచన చేస్తుంది.








## వేటూరి 79వ జయంతి

29 జనవరి 2015న వేటూరి 79వ జయంతి కార్యక్రమం అనకాపల్లిలోని వివేకానంద ఛారిటబుల్ ట్రస్ట్ హాల్లో జరిగింది. ఈ సందర్భంగా వేటూరి పాటలపోటీని నిర్వహించడం జరిగింది.








విజేతలతో అతిథులు, నిర్వాహకులు





# వేటూరితో పాటకు కావ్య గౌరవం

## జిల్లాస్థాయి పాటల పోటీల విజేతలు

కొత్తూరు: తెలుగు సినిమా పాటకు కావ్య గౌరవాన్ని తీసుకువచ్చిన మహాకవి వేటూరి సుందర రామమూర్తి అని అనకాపల్లి రవాణాశాఖాధికారి సలీం కొనియాడారు. వేటూరి 79వ జయంతి వేడుకల సందర్భంగా ఆత్రేయ సాహితీ స్రవంతి గురువారం రాత్రి వివేకానంద ఛారిటబుల్ ట్రస్టు హాల్‌లో నిర్వహించిన జిల్లాస్థాయి పాటల పోటీలకు ఆయన ముఖ్యఅతిథిగా పాల్గొని మాట్లాడారు. సంఘ అధ్యక్షుడు గట్టి బ్రహ్మాజీ అధ్యక్షతన జరిగిన కార్యక్రమంలో వేటూరిపై పుస్తకాన్ని రచించిన తపాలా ఉద్యోగి గూటూరి వెంకటేశ్వరరావును నిర్వాహకులు సత్కరించి, జ్ఞాపిక బహూకరించారు. వివేకానంద ఛారిటబుల్ ట్రస్టు అధ్యక్షుడు డాక్టర్ కాండ్రేగుల విష్ణుమూర్తి, స్రవంతి వ్యవస్థాపకుడు డాక్టర్ తలతోటి పృథ్వీరాజ్, పలు సంఘాల ప్రతినిధులు జి.రంగబాబు, బళ్లా నాగభూషణం, సన్నికంటి ఆదినారాయణ, ఇవటూరి గౌరీశం, న్యాయవాది సాయిలక్ష్మణ్ తదితరులు పాల్గొన్నారు. పోటీల్లో వడ్డాదికి చెందిన సీహెచ్ రాంబాబు ప్రథమ, అనకాపల్లికి చెందిన కె.ప్రమీలాదేవి ద్వితీయ, ఇవటూరి కూర్మనాథ్ తృతీయ బహుమతులను పొందారు. ప్రతిభ చూపిన చిన్నారులు మాన్య అనూష, ఖ్యాతిశ్రీలకు ప్రత్యేక ప్రోత్సాహక బహుమతులు అందజేశారు. న్యాయనిర్ణేతగా వెంకటేశ్వరస్వామి దేవస్థానం మాజీ ఛైర్మన్ తిమ్మాపాత్రుని చక్రవర్తి వ్యవహరించారు.



విజేతలతో అతిథులు, నిర్వాహకులు




## పాటకు కావ్య గౌరవాన్ని తీసుకువచ్చిన కవి వేటూరి

అనకాపల్లి రూరల్: తెలుగు సినిమా పాటకు కావ్య గౌరవాన్ని తీసుకువచ్చిన కవి వేటూరి సుందరరామ్మూర్తి అని ఆర్టీవో మహమ్మద్ సలీం అన్నారు. పట్టణంలోని వివేకానంద చారిటబుల్ ట్రస్టు హాల్లో వేటూరి 79వ జయంతిని పురస్కరించుకుని వేటూరి పాటల పోటీల కార్యక్రమం గురువారం రాత్రి జరిగింది. ఈ సందర్భంగా ఆర్టీవో సలీం మాట్లాడుతూ వేటూరి పాటలు ఎప్పటికీ వాడని సాహిత్య పారిజాతాలన్నారు. ఆత్రేయ స్రవంతి సంస్థ అధ్యక్షుడు గట్టి బ్రహ్మాజీ మాట్లాడుతూ వేటూరి పాటలు తెలుగు సిని ప్రేక్షకుల అక్షర సిరి అన్నారు. ఈ సందర్భంగా నిర్వహించిన జిల్లాస్థాయి వేటూరి పాటల పోటీల్లో విజేతలైన వడ్డాదికి చెందిన సిహెచ్. రాంబాబుకు ప్రథమ బహుమతి, అనకాపల్లికి చెందిన కె. ప్రమీలాదేవి, యువటూరి కూర్మానాథ్ ద్వితీయ, తృతీయ బహుమతులను అందజేశారు. అనంతరం వీరిని సన్మానించారు. సమావేశంలో ఆత్రేయ సాహితీ స్రవంతి వ్యవస్థాపకుడు డాక్టర్ తలతోటి పృథ్వీరాజ్, బళ్లా నాగభూషణం, సన్నికంటి ఆదినారాయణ పాల్గొన్నారు.

"విద్య కంటే ధనం లేదు
అపకీర్తికంటే మరణం లేదు"

## 29వ జిల్లాస్థాయి వేటూరి పాటల పోటీ

కొత్తూరు, న్యూస్‌టుడే: సినీ కవి వేటూరి సుందరరామమూర్తి జయంతి సందర్భంగా 29వ జిల్లాస్థాయి వేటూరి పాటల పోటీలను నిర్వహిస్తున్నామని ఆత్రేయ సాహితీ స్రవంతి అధ్యక్షుడు గట్టి బ్రహ్మాజీ తెలిపారు. శనివారం శారదానగర్‌లో జరిగిన సమావేశంలో సంస్థ వ్యవస్థాపకుడు డాక్టర్ తలతోటి పృథ్వీరాజ్, ఇండియన్ హైకూ క్లబ్ అధ్యక్షుడు జి.రంగబాబులతో కలసి ఏర్పాటు చేసిన సమావేశంలో ఆయన మాట్లాడారు. అనకాపల్లి పట్టణంలోని వివేకానంద ఛారిటబుల్ ట్రస్టు హాల్లో శుక్రవారం సాయంత్రం 5 గంటలకు పోటీలు ప్రారంభం అవుతాయన్నారు. ప్రథమ, ద్వితీయ, తృతీయ విజేతలకు జ్ఞాపికలు, ప్రశంసాపత్రాలతో పాటు సత్కార కార్యక్రమం ఉంటుందన్నారు. పోటీల్లో పాల్గొనదలచిన వారు ఫోన్ నెంబరు 9440372307 లో సంప్రదించాలని ఆయన కోరారు.





# ఆత్రేయ సాహిత్యంపై వ్యాసాలు

ఆత్రేయగారి సాహిత్యంపై వివిధ పత్రికల్లో వివిధ అంశాలపై వ్యాసాలు రచించడం జరిగింది. అదే విధంగా సామాజిక మాధ్యమాలలో కూడా సందర్భానుసారంగా ఆత్రేయ పోస్టులు పెట్టడం జరిగింది. ఆత్రేయ సాహిత్యం అందరికీ అందుబాటులో ఉంచేందుకు అచార్య ఆత్రేయ డాట్‌కామ్ పేరుతో కొన్నాళ్ళు నిర్వహించడం జరిగింది. ఆ తర్వాత డబ్లూడబ్లూడబ్లూ.లిట్.ఇన్ వెబ్‌సైట్ ద్వారానే ఇండియన్ హైకూ క్లబ్ కార్యక్రమాల వివరాలను, ఆత్రేయ సాహితీ స్రవంతి వివరాలను పొందుపరచడం జరిగింది.

ఆత్రేయగారి సాహిత్యంపై నేను వివిధ వేదికలపై ఉపన్యసించడం ఒక పని అయితే, వివిధ పత్రికల్లో ఆసక్తికర అంశాలపై వ్యాసాలు రచించడం చేస్తున్నాను. ఆత్రేయ శతజయంతి ఉత్సవాలలో ఆవిష్కరించడానికి ఆత్రేయ వ్యాససంపుటి సిద్ధం చేస్తున్నాను.



ఆత్రేయ చివరికోరిక ఏమిటి?





## పృథ్వి "ఆత్రేయ వ్యాసాలు"

**1) మనసుకవి ఆచార్య ఆత్రేయ–ఆసక్తికర విషయాలు, (భావతరంగిణి, అక్టోబర్ 2013)**

**2) ఆత్రేయ – అద్భుత భావుకత: సాహితీ కెరటాలు (నేటి నిజం) 8 మే 2014**

**3) ఆత్రేయ ఆత్మకథ–లీడర్ దినపత్రిక**

**4) ఆత్రేయ రాజకీయ చురకలు–విశాలాంధ్ర**

**5) పాటల్లో ఆత్రేయ ప్రయోగాలు–పబ్లిక్ దినపత్రిక**

**6) ఆచార్య ఆత్రేయ–ప్రజాశక్తి**

(ఆత్రేయగారి పాటలపై నా విశ్లేషణాత్మకమైన వ్యాసాలను ప్రత్యేక సంపుటిగా తీసుకు వస్తున్నాను. అందుచేత ఈ సంపుటిలో "పాటకు పల్లవి ప్రాణం" అనే ఒకే ఒక వ్యాసాన్ని అందిస్తున్నాను.)





# పాటకు పల్లవి ప్రాణం




ఇప్పటిలా కాదు; ఒకప్పటిలా సినిమా పాటరాయడం ఒక కళ. అలవోకగా గొప్పకవిత్వాన్ని రాసే ఓ కవిని ఒక మంచి పాటను రాయమని కోరితే అది ఆతనికి ఒక పరీక్షే అవుతుంది. కవిత్వరచనకు పరుగులుపెట్టినట్లు పాటరచనకు పరుగులు తీయలేదు ఆ కవి కలం. కారణం.... చాలా చాలా కుదించి ఆ సన్నివేశానికి తగినట్లు, ఆ కథను పాటలో ప్రతిబింబింప చేయాలి సినీ కవి.

కావ్య సాహిత్యంలో కవికీ- రచయితకి; పాఠకునికీ - శ్రోతకి మధ్యే అనుబంధం ఉంటుంది. వారిద్దరి మధ్య మరెవ్వరూ ఉండరు. కాని సినిమా సాహిత్యం కావ్యసాహిత్యం ఆకర్షించగలిగే దానికంటే ఎక్కువగా శ్రోతను లేదా పాఠకుడ్ని ఆకర్షించగలుగుతుంది. కారణం ఈరకమైన సాహిత్యానికి అదనపు సొబగులు చేకూర్చే సంగీతకారులు-గాయకులు సినీకవి-శ్రోతకు మధ్య ఉంటారు. అందుచేతనే పాట మరింత పరిమళిస్తుంది. సాహిత్యానికి సంగీతం సమకూరుతుంది. ఎంతటివారినైనా పాట కట్టిపడేస్తుంది, ఆకర్షిస్తుంది. అందుకే జనవ్యవహారంలో కవిత్వంగా-సాహిత్యంగా చెప్పుకునేదానికంటే పాట బలమైనది అని ఒప్పుకోక తప్పదు.

తెలుగు సాహిత్య రచనలో కవులు ప్రయోగాలు చేసినట్లే సినిమా పాటల రచనలల్లోనూ సినీకవులు అనేకులు ఎన్నో ప్రయోగాలు చేశారు.

సాధారణంగా పాటకు పల్లవి, చరణాలు ఉంటాయి. అక్కడక్కడ కొన్ని పాటల్లో సాకీ, అనుపల్లవి వంటి వాటిని అనుసరిస్తూ ఉంటారు. ఇంకొన్ని పల్లవులు లేకుండా ఉన్న పాటలూ లేకపోలేదు.

సాధరణంగా సినిమా పాటల పల్లవులు సమగ్ర పంక్తుల్లా కనిపించినా పరిపూర్ణమైన భావాన్ని, అనుభూతిని పొందడానికి చరణాలవద్దకు వెళ్ళాల్సిందే! పల్లవికీ-చరణాలకు మధ్య పైకి కనిపించని ఒక అంతర్గతమైన అనుసంధానం ఉంటుంది. ఆ పాట చరణంలోకి వెళితేనే కవి భావన కొనసాగింపు కనిపిస్తుంది. ఆ పల్లవి భావం, పరమార్థం అప్పుడు అర్థమవుతుంది.

కాని కొందరి సినీకవుల పాటల్లో పల్లవులు ప్రత్యేకమైనవి. అవి వారి విలక్షణమైన రచనా శైలికి ఉదాహరణగా నిలుస్తాయి. అటువంటి కవే ఆచార్య ఆత్రేయ. పల్లవి గుమ్మంలాంటిది. దాన్ని దాటి చరణాల గదుల్లోకి ప్రవేశించాలి. మరో రకంగా కూడా చెప్పుకోవచ్చు. పల్లవి శిరస్సైతే చరణాలు దాని చరణాలే(పాదాలు). ఒక పల్లవిలోనే ఒక మహాద్భుతమైన భావాన్ని చెప్పిన పాటలెన్నో రాశారు ఆత్రేయ. అలాఅని





అన్ని పాటలను ఈవిధమైన శైలిలోనే రాయలేదు. సందర్భం, సన్నివేశాన్ని బట్టి మాత్రమే ఆత్రేయ ఇలా రాయడం జరిగింది.

ఆత్రేయ రచించిన కొన్ని పాటల్లోని పల్లవులు స్టేట్‌మెంట్‌లా, ఉపదేశంలా, ప్రజల ఆలోచనల ప్రతిబింబం అన్నట్లు ఉంటాయి. రెండు మూడు చరణాలు ఇచ్చే అనుభూతి ఒకే ఒక పల్లవి ఇస్తుంది. రెండు, మూడు చరణాల వైశాల్యంలో చెప్పగలిగే భావుకతను ఒకే ఒక పల్లవిలో సంక్షిప్తంగా, అసామాన్యంగా చెప్పగలిగారు ఆత్రేయ.

సినిమా సన్నివేశానికి మాత్రమే పరిమితం కాకుండా కొన్ని పాటల పల్లవులు సార్వకాలీనమైనవిగా ఉంటాయి. అంటే ఎప్పుడూ ఆయా సందర్భాలను బట్టి కోట్‌చేసి చెప్పుకునేవిగా ఉంటాయి. జీవిత సత్యాలుగా చలామణి అవుతూ ఉంటాయి.

సామాజిక-తాత్విక-ఉపదేశాత్మక లేదా సందేశాత్మక అంశాలకు సంబంధించిన పంక్తులనే తన పాటలకు పల్లవులుగా పొదిగిన నేర్పరి, కూర్పరి ఆచార్య ఆత్రేయ.

## పాటకు పల్లవి ప్రాణం :

పాటలో సాకీ, పల్లవి, అనుపల్లవి, చరణం ఎన్ని ఎలా ఉన్నా ఆత్రేయ 'సంగీతలక్ష్మి' అనే సినిమాలో **"పాటకు పల్లవి ప్రాణం/ నా జీవన జీవం గానం"** అనే పాటలో చెప్పిన ప్రకారం పాటకు పల్లవే ప్రాణం! ఇది నిజం!. శతక పద్యానికి చివరి పాదం మకుటంలా, సినిమా పాటల చరణాలకు పల్లవులే ప్రాణం, నిజమైన మకుటం. మకుటం శిరస్సుకే ఉంటుంది. క్రింది పాదానికి కాదు. పల్లవి వస్తే పాట సగం అయిపోయినట్లే! ఒక్కమాటలో చెప్పాలంటే పల్లవే చరణాలను పుట్టిస్తుంది.



కొన్ని సినిమా పాటల్లో పల్లవి ఎలా ఉన్నా, చరణంలో అద్భుతమైన భావుకతను ప్రదర్శించిన పాటలు లేకపోలేదు. ఉదా: 'మురళీ కృష్ణ' అనే సినిమాలోని 'నీ సుఖమే నే కోరుకున్నా....' అనే పాట చరణంలో-

**"అనుకున్నామని జరగవు అన్నీ**
**అనుకోలేదని ఆగవు కొన్ని**
**జరిగేవన్నీ మంచికని**
**అనుకోవడమే మనిషి పని"** అని- మనిషి తాను అనుకున్నది ఏదైనా జరగనప్పుడు అంతా మనమంచికేలే అని బాధపడకుండా సర్దిచెప్పుకునే తీరును పైపాటలో ప్రతిబింబింపచేసి గొప్ప సత్యాన్ని చరణంలో ఆత్రేయ ఆవిష్కరించారు. ఇదే రకమైన చరణం మరొటి ఉదహరించాలంటే "చిల్లర దేవుళ్ళు"చిత్రంలో -

**'కలువకు చంద్రుడు ఎంతో దూరం**
**కమలానికి సూర్యుడు మరీ దూరం'** అని చెప్పి **"దూరమైన కొలది పెరుగును అనురాగం, విరహంలోనే ఉంది అనుబంధం'** అని పల్లవితో ఆగిపోకుండా -

**"నవ్వునవ్వుకు తేడా ఉంటుంది**
**నవ్వే అదృష్టం ఎందరికుంటుంది**
**ఏ కన్నీరైనా వెచ్చగ ఉంటుంది**
**అది కలిమిలేములను మరిపిస్తుంది"** అని అంటాడు ఆత్రేయ.

పై విధంగా ఆత్రేయ తన చరణాలతో శ్రోతలు తలాడించగలిగే కమ్మని భావాలనెన్నింటినో రాసినప్పటికీ








పాటల పల్లవుల రచనలోకూడా తన ప్రతిభను ప్రదర్శించిన సినీ కవి ఆచార్య ఆత్రేయ. ఉదా: "సెక్రెటరి" చిత్రంలో-

"మనసులేని బ్రతుకొక నరకం
మరువలేని మనసొక నరకం
మనిషికెక్కడ ఉన్నది స్వర్గం
మరణమేనా దానికి మార్గం" అని రాస్తారు ఆత్రేయ.




చరణంలోకి చెవిపెట్టకుండానే పల్లవిలోనే ఉపదేశాన్నో- జీవితానుభవాన్నో; సత్యాన్నో- తాత్త్వికతనో స్టేట్మెంట్‌లా చెప్పిన ఎన్నో పల్లవులు ఆత్రేయ పాటల్లో ఉన్నప్పటికి కొన్ని ప్రధానమైనవాటినే ఈ వ్యాసంలో ఉదహరిస్తూ విశ్లేషించబోతున్నాను.

బాణీని బట్టి, సంగీతాన్ని బట్టి ప్రజాధరణపొందిన పాటకాకున్నా అందులోని సాహిత్యాన్ని పరిశీలించి మాత్రమే ఉదహరిస్తున్నాను. దీనికి సంక్షిప్తంగా చెప్పగలిగే రచనాశైలి కవి ఏర్పరచుకోగలిగి ఉండాలి. ఒకవిధంగా ఆధునిక కవిత్వంలోని, మినీ కవిత్వంలోని గాఢత ఇటువంటి పంక్తుల్లో కనిపిస్తుంది.

## తాత్త్విక పల్లవులు :

నా పరిశీలనలో, ఆత్రేయ పల్లవిలోనే పాట సారాన్ని-సారాంశాన్ని-ఆత్మను రంగరించి రాసిన పల్లవులు ఎక్కువ తాత్త్విక వస్తువులకు సంబంధించి రాసిన పాటల్లో ఉన్నాయి. ఉదా: "సంధ్య" చిత్రంలో-

"ఈ అనంతకాల గమనంలో
ఈ రవంత జీవన పయనంలో
అందరు నీవారు
చివరకు మిగిలేదెవరూ లేరు" అని జీవిత సత్యాన్ని తెలియజేశారు ఈ పల్లవిలో. అంతేకాదు 'తహసిల్దారుగారి అమ్మాయి' సినిమాలో-

"కనబడని చెయ్యేదో
నడుపుతుంది నాటకం
ఆ నాటకాన నువ్వూ నేను
ఆట బొమ్మలం కీలు బొమ్మలం" అని పల్లవిలో జీవితనాటంగూర్చి చెప్పేస్తాడు ఆత్రేయ. అలాగే 'ఆడబ్రతుకు' అనే సినిమాలో-

"తనువుకెన్ని గాయాలైనా మాసిపోమునేలాగైనా
మనసుకొక్క గాయమైనా మాసిపోదు చితిలోనైనా"
అని మన'సు'కవి పరిశోధనాత్మక అనుభవంతో చెప్పినట్లు పల్లవిలో పలికించారు. 'అమరదీపం' చిత్రంలో-

"ఇంతే ఈ జీవితము చివరికి అంతా శూన్యము





అమృతాన్నే ఆశిస్తాము
ఆలాహలమే పొందేము"
అని, అంతా మిథ్య అనేది తేటపరిచారు. పోయినవారిగూర్చి ఎంత దు:ఖించినా ప్రయోజనం ఉండదు. ఈ కాలగమనంలో నిరంతరం జరిగే ప్రక్రియలు జనన మరణాలు. అందుకే 'గాజుల కిష్టయ్య' చిత్రంలో-




"రారయ్యా పోయినవాళ్ళూ....
ఎవరయ్యా ఉండేవాళ్ళూ...
నవ్వు మరచి నన్ను మరచి
ఎందుకు కన్నీళ్ళూ ఇలా ఎన్నాళ్ళూ" అని జీవిత




తాత్త్వికతను తెలియజేశారు పల్లవిలో. ఇదేవిధంగా 'ఇల్లాలు' సినిమాలో -
"ఓ బాటసారి ఇది జీవిత రహదారి
ఎంతదూరమో ఏది అంతమో
ఎవరూ ఎరుగని దారి ఇది
ఒకరికి సొంతం కాదుఇది!" అని మనిషి జీవిత ప్రయాణంలోని మర్మాన్ని తెలియజేశారు. అలాగే బంధాలు-అనుబంధాలు ప్రాణాలు ఉన్నందాకేనంటూ -
"ఈ జీవన తరంగాలలో
ఆదేవుని చదరంగంలో
ఎవరికి ఎవరు సొంతము
ఎంతవరకీ బంధము" అని 'జీవనతరంగాలు' చిత్రంలోని పల్లవిలో తాత్త్విక బోధన చేశారు ఆత్రేయ.

## ఉపదేశాత్మక పల్లవులు:

ఆత్రేయ పాటల పల్లవులలో తాత్త్వికమైనవేగాక, ప్రబోధాత్మక లేదా ఉపదేశాత్మక పల్లవులుకూడా ఎన్నో ఉన్నాయి. ఉదా: 'మాయదారి మల్లిగాడు' చిత్రంలో-
" నవ్వుతూ బతకాలిరా
తమ్ముడూ నవ్వుతూ చావాలిరా
చచ్చినాక నవ్వలేవురా
ఎందరేడ్చినా బ్రతికిరావురా... తిరిగిరావురా" అని అంటాడు ఆత్రేయ. బ్రతుకుగూర్చి ఇతర కవులు చెప్పినట్లే ఆత్రేయగారు కూడా-
" బ్రతుకు పూలబాటకాదు
అది పరవశించి పాడుకునే పాటకాదు" అని 'భార్యాబిడ్డలు' చిత్రంలలో హెచ్చరిస్తాడు. అంతేగాకుండా మనిషి జీవితంలోకి తొంగిచూసి తొందరపెట్టే కోర్కెలను అదుపులో పెట్టుకొనకపోతే జరిగే అనర్థాలను "కోరికలే గుర్రాలైతే" అనే చిత్రంలో తెలియజేస్తూ-
"కోరికలే గుర్రాలైతే ఊహలకే రెక్కలు వస్తే
మనిషికి మతిపోతుంది బ్రతుకే శృతి తప్పుతుంది" అని జీవిత గమనంగూర్చి చెబుతాడు ఆత్రేయ.
"అందమైన జీవితము అద్దాల సౌధము
చిన్నరాయి విసిరినా చెదరిపోవును
ఒక్క తప్పుచేసినా ముక్కలే మిగులును" అని 'విచిత్రబంధం' అనే సినిమాలో జీవిత సున్నితత్వాన్ని గూర్చి ఆత్రేయ సందేశాత్మకంగా పల్లవిలో పలికించారు.





## లోకం తీరు :




ఆత్రేయ పల్లవులలో పేర్కొనదగిన మరోరకమైన పల్లవులు లోకం తీరను, వైఖరిని విమర్శనాత్మక దృక్పథంతో రాసిన పల్లవులు. ఈ లోకంలో మురిపించి మైమరిపించేవేకాదు; ఆకర్షించి అధ:పాతాళానికి తొక్కేసేవీ ఉంటాయి. అందుకనే-

"అందమైన లోకమని
రంగు రంగులుంటాయని
అందరూ అంటుంటారు రామరామా
అంత అందమైంది కానేకాదు చెల్లెమ్మ
చెల్లెమ్మా అందమైంది కానేకాదు చెల్లెమ్మ" అని 'తొలికోడి కూసింది' చిత్రంలో అంటాడు ఆత్రేయ. అదేవిధంగా మనుషులమధ్య ఉండే కుళ్ళూ కుతంత్రాలగూర్చి-

" నేస్తం చూదర ఈ కుళ్ళులోకం
చూస్తే కోరవు ఈ నరజన్మము
తీపిమాటలు-గొంతుకోతలు
నరులకు మాకే సొంతము" అని 'తోటరాముడు' సినిమాలో ఆత్రేయ అంటారు. నీతిని సమాధిచేస్తూ ధనంతో నిజం నోరును నొక్కేసే ఈ సంఘం తీరుగూర్చి 'మల్లెపువ్వు' అనే సినిమాలో-

" బ్రతికున్నా చచ్చినట్లే ఈ సంఘంలో
ఛస్తేనే బ్రతికేది ఈలోకంలో
నిజం నలిగిపోతుంది ధనం చేతిలో
నీతిమూల్గుతున్నది వల్లకాటిలో" అని రాస్తాడు ఆత్రేయ. ఒకడు బాగుపడుతున్నాడంటే ఏడ్చేవాళ్ళను చూసి-

"ఏడవనీ ఏడ్చేవాళ్ళను ఏడవనీ
ఎదుటివాళ్ళు బాగున్నారని ఏడవనీ
నవ్వేవాళ్ళ అదృష్టమేమని
ఏడ్చేవాళ్ళను ఏడవనీ" అని 'అర్థాంగి' సినిమాలో పలికిస్తాడు ఆత్రేయ. మంచితనానికీ- మనసుకు మమతకు విలువలేని నేటి లోకం తీరును పరిశీలించిన ఆత్రేయ-

"మంచితనానికి తావే లేదు
మనిషిగ మసలే వీలులేదు
మనసుకు మమతకు విలువే లేదు
ఏదీలేని బ్రతుకే చేదు"

(బంగారు కలలు-1974)అని అంటారు. డబ్బే సర్వం అనుకునే నేటి సమాజాన్ని గూర్చి-

"డబ్బెవరికి చేదు పిచ్చోడా
డబ్బెవరికి చేదు మంచోడా
ఈ భూమి తిరిగేది రూపాయి చుట్టు
ఈ మనిషికోరేది రూపాయి చెట్టు
డబ్బొక్కటే దైవము డబ్బొక్కటే లోకము"

(డబ్బెవరికి చేదు-1987) అని అంటారు ఆత్రేయ. ధనానికి ఇచ్చే విలువ గుణానికి ఇవ్వని ఈ జగాన్ని ఉద్దేశించి-

"ధనంలోనే జగంఉన్నది నిజం నిజం
ధనం ముందు గుణం చిన్నది నిజం నిజం" అని 'ఎదురీత' చిత్రంలో నగ్నసత్యాన్ని పలికిస్తాడు ఆచార్య ఆత్రేయ.





### వస్తు వైవిధ్య పల్లవులు :

ఒక అంశంపై రాసిన పల్లవి ఒక పాటలో నిర్వచనంలా, మరోపాటలో అనుభవసారంలా ఆత్రేయ పలికించారు. 'స్నేహబంధం' అనే సినిమాలో-

"స్నేహబంధము ఎంత మధురము
చెరిగిపోదు తరిగిపోదు జీవితాంతము" అని స్నేహబంధాన్ని నిర్వచించారు ఆత్రేయ. మనసుపై వందల పాటలు రాసిన మన'సు'కవి ఆత్రేయ. అందుకే ఆత్రేయ 'ప్రేమతరంగాలు' చిత్రంలో -

"మనసు ఒక మందారం
చెలిమి తన మకరందం
ఆ మధురిమకు పులకించే
బ్రతుకు ఒక మధుమాసం" అని మనసు-చెలిమితో పులకించే బ్రతుకులను ఎలా ఉంటుందో చెప్పాడు. అంతేకాదు; 'నీరాజనం'చిత్రంలో-

"మనసొక మధుకలశం
పగిలే వరకే అది నిత్య సుందరం" అని మనసును నిర్వచించారు ఆత్రేయ. అలాగే 'ప్రేమనగర్' చిత్రంలో -

"మనసుగతి ఇంతే మనిషి బ్రతుకింతే
మనసున్న మనిషికి సుఖములేదంతే" అని మంచిమనసుతో ఈ లోకంలో సుఖంగా బ్రతకలేని పరిస్థితులను భగ్నప్రేమికునిగా పాటలో తేల్చిచెప్పాడు ఆత్రేయ. 'ప్రేమలూ పెళ్ళిళ్ళు' చిత్రంలో-

"మనసులేని దేవుడు
మనిషికెందుకో మనసిచ్చాడు
మనసు మనసును వంచన చేస్తే
కనులకెందుకో నీరిచ్చాడు" అని ఆత్రేయ అంటాడు. అదేవిధంగా 'త్రిశూలం' చిత్రంలో-

"పెళ్ళంటే పందిళ్ళు సందెళ్ళు తప్పెట్లు
తాళాలు తలంబ్రాలు
మూడే ముళ్ళు ఏడే అడుగులు
మొత్తం కలిసి నూరేళ్ళు." అని అల్పాక్షరాలలో అనల్పార్థాన్ని ఇచ్చేవాక్యాలుగా ఈ పల్లవిలోని పంక్తులతో పెళ్ళిని నిర్వచించారు ఆత్రేయ.

### ప్రజల ఆలోచనల్ని ప్రతిబింబించే పల్లవులు :

కొన్ని కొన్ని సందర్భాలలో, కొన్ని విషయాలప్పుడు మనుషులు ఏవిధంగా ఆలోచిస్తారో ఆత్రేయ తన పాటల్లో అదేరకమైన ఆలోచనా సరళిని ప్రతిబింబింపజేశారు. మరిముఖ్యం ఆధ్యాత్మిక విషయాలకు సంబంధించి ఆత్రేయ రాసిన పాటలను పరిశీలిస్తే, సమాసంలో జరిగే అన్యాయాలు-అక్రమాలు గమనించి మనమూ దేవుడ్ని ప్రశ్నించినట్లే-

"ఉన్నావా అసలున్నావా...
ఉంటే కళ్ళుమూసుకున్నావా
ఈ లోకం కుళ్ళు చూడకున్నావా?" అని 'భక్తతుకారం' చిత్రంలో రాస్తారు ఆత్రేయ.

ఏది ఏమైనా ఆత్రేయగారు పాటలను జనం మెచ్చేలా రాయడమే కాదు, అలతి అలతి పదాలతో రాయడమే కాదు. జీవిత సత్యాలుగా నిలిచే పంక్తులను పాటల్లో రాయడమే గాక పల్లవుల్లోనే అద్భుత భావాలను పలికించినవాడనడంలో అతిశయోక్తిలేదు.

*(ఆచార్య ఆత్రేయ 99వ జయంతిని పురస్కరించుకుని రాసిన వ్యాసం)*





# ఆత్రేయపై బ్లాగ్ నిర్వహణ

ఆత్రేయ సాహిత్యం అందరికీ అందుబాటులో ఉంచేందుకు అచార్య ఆత్రేయ డాట్‌కామ్ పేరుతో కొన్నాళ్ళు నిర్వహించడం జరిగింది. ఆ తర్వాత డబ్లూడబ్లూడబ్లూ.లిట్.ఇన్ వెబ్‌సైట్ ద్వారానే ఇండియన్ హైకూ క్లబ్ కార్యక్రమాల వివరాలను, ఆత్రేయ సాహితీ స్రవంతి వివరాలను పొందుపరచడం జరిగింది. ఆచార్య ఆత్రేయం.బ్లాగ్‌స్పాట్. కామ్ పేరుతోనూ బ్లాగ్ నిర్వహిస్తున్నాను

మనసుకవి అనే యూ ట్యూబ్ ఛానల్లోకూడా ఆత్రేయకు సంబంధించి అనేక ఫైల్స్‌ను పెట్టడం జరిగింది.




"మనసుకవి" యూట్యూబ్ ఛానల్లో పృథ్వీరాజ్ రూపొందించి అప్‌లోడ్ చేసిన పలు వీడియో ఫైల్స్








పృథ్విరాజ్ రూపొందించి నిర్వహిస్తున్న ఆచార్య ఆత్రేయ బ్లాగ్




పృథ్విరాజ్ రూపొందించి నిర్వహిస్తున్న ఆచార్య ఆత్రేయ ఫేస్‌బుక్ ఎకౌంట్






More ▾ talathotiprithviraj@gmail.com Dashboard Sign Out

ATHREYA SAHITHEE SRAVANTHI

Tuesday, 11 May 2010

ACHARYA ATHREYA'S LIFE SKETCH - by Dr.Talathoti Prithvi Raj

Sri Acharya Athreya,the sweetest lyricist of the Telugu cine world found his niche as an unrivalled poet pouring songs of matchless beauty in spontaneous flow for no less a period than half a century. He kept the millions of cine-goers spell-bound with the magic of his melodious lyrics from generation to generation. The lovers of literature, of song and music, and the lay-man in the street irrespective of their cultural background or social status, were transported into ethereal realms of perfect joy, listening to his most captivating songs. The Telugu people of all classes hours built an immortal shrine in their hearts as an expression of their love and gratitude to this 'mana su kavi'.

The songs full of lyrical beauty and charm, enlivened with sentiments expressive of love in all its multifarious moods of self forgetful

Followers

Followers (2)

Follow

Blog Archive

▼ 2010 (1)

▼ May (1)

ACHARYA ATHREYA'S LIFE SKETCH - by Dr.Talathoti Pr...

About Me

పృథ్వీరాజ్ రూపొందించి నిర్వహిస్తున్న ఆత్రేయ సాహితీ స్రవంతి బ్లాగ్

## ఆత్రేయ రచించిన నాటికలు :

1) అశ్వఘోషుడు 2) ఆత్మార్పణ 3) ఎవరు దొంగ

4) ఒక్క రూపాయి 5) ఓటు నీకే 6) అంతర్యుద్ధము

7) అంత్యార్పణ 8) కళ కోసం 9) కాపలావాని దీపం

10) చస్తే ఏం? 11) చావకూడదు 12) తెరచిన కళ్ళు

13) ప్రగతి 14) మాయ 15) వరప్రసాదం





# ఆత్రేయ సాహిత్యంపై ఆడియో, వీడియో సీడీలు, డాటా ఫైల్స్ , స్క్రిప్ట్స

డా॥ తలతోటి పృథ్విరాజ్ ఆత్రేయ సాహితీ పరిశోధకునిగా, ఆత్రేయ సాహితీ స్రవంతి వ్యవస్థాపకునిగా ఆత్రేయగారి ఎన్నో సాహిత్యాంశాలపై వీడియో, ఆడియోలను రూపొందించారు. ముందుగా చక్కని స్క్రిప్ట్ రాసుకుని స్వయంగా తన గొంతుకనే వాయిస్‌ఓవర్‌కు ఉపయోగిస్తూ అనేక అంశాలపై ఆడియో,వీడియో సీడీలను రూపొందిస్తున్నారు. అదేవిధంగా వీడియో ఫైల్స్‌కు యాంకర్‌గా వ్యవహరిస్తూ రూపొందించారు.

ఆత్రేయ సాహిత్యాభిమానుల కొరకు పదుల కొలది డాటా ఫైల్స్ మరియు ఆడియో, వీడియో సీడీలను రూపొందించడం జరిగింది. అనేకమంది ఆత్రేయ సాహిత్యాభిమానులనుండి ప్రశంసలను సంపాదించారు. ఇటువంటి అంశాలకు సంబంధించిన ఆయా ఫైల్స్ ముఖ చిత్రాలను, సంక్షిప్త వివరాలను, అనుభూతులను తెలుసుకోగలరు.





## ఆత్రేయపై ఆడియో సీ.డీ.లు




"ఆత్రేయ సాహిత్యం-వ్యక్తిత్వం" అనే అంశంపై నేను ఆత్రేయపై రూపొందించిన మొదటి ఆడియో సీ.డీ. నేను పరిశోధనా సమయంలో అనేకమంది సినీ సంభాషణా రచయితలను కలిసి ఇంటర్వ్యూలు చేశాను. అవి రికార్డ్ చేశాను. ఎన్నో విషయాలు వారు నాతో పంచుకున్నారు. ఈ విషయాలను నేను నా "ఆత్రేయ సినిమా సంభాషణలు-ఒక పరిశీలన" అనే పరిశోధనా గ్రంథంలో ప్రస్తావించాను. వారి గొంతుకతో ఆత్రేయ సమకాలీనులు, సహరచయితలు ఆత్రేయగారి వ్యక్తిత్వం- సాహిత్యంపై చెప్పిన విషయాలు స్వయంగా ఆత్రేయ అభిమానులుకూడా వింటే బాగుంటుందనే ఆలలోచనతోనే ఈ సీ.డీ.రూపొందించడం జరిగింది.

ఇంటర్వ్యూకొరకు నేను ఇంకా అనేకమందిని కలిశాను. వేరువేరు కారణాలచేత ఆ సమయాన ఇంటర్వ్యూ చేయలేక పోయాను. కొందరు రమ్మని తీరా వెళ్ళాక తర్వాత రమ్మని చెప్పారు. నేను కలిసిన వారిలో అక్కినేని నాగేశ్వరరావు, కొంగర జగ్గయ్య, గుమ్మడి వెంకటేశ్వర రావు, మురారి, కోడిరామకృష్ణ, తోటపల్లి మధు మరికొందరు. ఆత్రేయకు కొంగర జగ్గయ్య 'గ్లాస్‌మేట్'గా చెబుతారు. అటువంటిది ఆత్రేయగూర్చి నాకేమి తెలియదని చెప్పడం బాధవేసింది.


ఆత్రేయ సిడిని విడుదల చేస్తున్న దృశ్యం

"ఆత్రేయ సాహిత్యం-వ్యక్తిత్వం" అనే ఆడియో సీ.డీ.ని 13 సెప్టెంబర్ 2005న ఆత్రేయ 16వ వర్ధంతి సమావేశంలో శ్రీ భమిడిపాటి ప్రసాదరావుగారిచే ఆవిష్కరింపజేశాను. అజాగ్రత్తతో చాలా ఫోటోలు విస్సయిపోయాయి. ఇప్పుడు బాధవేస్తోంది. పేపర్‌లోని ఫోటో ఇది.








"ఆత్రేయ ఆణిముత్యాలు" ఆడియో సీ.డీ. ఆత్రేయగారి సాహిత్యంపై నేను చేసిన అనేక పనులలో తృప్తినిచ్చిన మరొక పని ఇది. ఆత్రేయగారి ప్రసిద్ధమైన పాటలను జానపద, ఆధ్యాత్మిక, కరుణరసాత్మక, శృంగార, ప్రేమ గీతాలుగా ఇలా ఎంపిక చేసిమొదట 150 పాటలతో ఎం.పి.త్రీ సీ.డీ.గా ఆత్రేయ అభిమానులకొరకు (ప్రైవేట్ సర్క్యులేషన్) రూపొందించాను. ఒకటే అసంతృప్తి. ఆత్రేయ మొదటి పాట సంపాదించలేకపోయాననే అని!. ప్రయత్నించని చోటులేదు. ఒక సారి అకస్మాత్‌గా అనకాపల్లిలోనే నారాయణరావు డాక్టర్ హాస్పటల్‌వద్ద రోడ్డుప్రక్క సీ.డీ.లు అమ్మేవద్ద ఈ పాట సీడీ చూశాను. కోహినూర్ వజ్రం దొరికినంత ఆనందంతో కొన్నాను. ఆ పాటే "దీక్ష" చిత్రంలో "పోరా బాబూ పో" అనే పాట!



7 మే 2005న 84వ ఆత్రేయ జయంతిని పురస్కరించుకుని పృథ్వీరాజ్ రూపొందించిన "ఆత్రేయ ఆణిముత్యాలు" ఎం.పి.త్రీ. ఆడియో సీ.డీ. ని ఆవిష్కరించిన కవి శ్రీ చీకట్ల కామేశ్వరరావు




"ఆత్రేయ ఆణిముత్యాలు" ఎం.పి.త్రీ. ఆడియో సీ.డీ. తొలి కాపీని కొనుగోలుచేసిన "ఉపాధ్యాయ వేదిక" పత్రిక సంపాదకులు, సాహితీ మిత్రుడు శ్రీ మల్లారెడ్డి శంకర్ ప్రసాద్.








7 మే 2019 ఆత్రేయ జయంతిని పురస్కరించుకుని ఆత్రేయ అభిమానులను అలరించేందుకు చేసిన ఆడియో డాటా ఫైల్ ఈ "ఆత్రేయ అంత్యాక్షరి" . ఆత్రేయగారి అలరించే పాటలన్నీ ఏకబిగిన వినాలంటే చాలా సమయం వెచ్చించాలి. పల్లవి వినడంతోనే గొప్ప అనుభూతి చెందుతాము. అటువంటిది అంత్యాక్షరి అంటే వినే శ్రోత ముగిసిన అక్షరానికి సంబంధించిన పదంకొరకు ఆలోచన మొదలు పెడతాడు. అందుకే ఈ సీ.డీ.చేశాను. అనేకులు తమ ఆనందాన్ని వ్యక్తపరిచారు. చాలా ఏళ్ళుగా పెండింగ్‌లో పెట్టి పూర్తిచేసిన పని ఇది.




ఆత్రేయ జీవితం-సాహిత్యం గూర్చి పరిచయం చేయడానికి నా వ్యాఖ్యానంతో పరిచయంచేసిన ఆడియో డాటాఫైల్స్ రెండు ఉన్నాయి. 9 నిమిషాల 48 సెకెన్ల నిడివితో నేను ఆత్రేయను పరిచయం చేసిన



ఆడియో ఫైల్ ఒకటైతే, ఆత్రేయ పాటలు-మాటలు, ఇతరేతర అనేక ఆసక్తికర అంశాలతో 48 నిమిషాల నిడివితో మరో ఆడియో డాటా ఫైల్‌ను బ్యాగ్రౌండ్ మ్యూజిక్‌తో రూపొందించిన డాటా ఫైల్.

13 సెప్టెంబర్ 2015న 26వ ఆత్రేయ వర్ధంతిని పురస్కరించుకుని " సినీ సాహితీ పిపాసి ఆచార్య ఆత్రేయ" అనే వీడియో సీ.డీ. ని ప్రముఖ కథకులు ఇండియన్ హైకూ క్లబ్ ప్రధాన కార్యదర్శి శ్రీ జి.రంగబాబు ఆవిష్కరించారు. ఈ కార్యక్రమంలో ఆత్రేయ సాహితీ స్రవంతి అధ్యక్షులు శ్రీ గట్టి బ్రహ్మాజీ, కొడుకుల జగన్నాథరావు మొ॥పాల్గొన్నారు.








ఆచార్య ఆత్రేయగారి 99వ జయంతిని పురస్కరించుకుని ఆత్రేయ అభిమాలకొరకు ఆత్రేయగారి పాటలలోని పల్లవుల విశిష్టతను విశ్లేషణాత్మకంగా, విమర్శనాత్మకంగా వివరిస్తూ పృథ్వీరాజ్ అనే నేను రూపొందించిన 25 నిమిషాల 24 సెకన్ల ఆడియోనే ఈ 'పాటకు పల్లవి ప్రాణం'.

" భాషను అదుపు చేయడంలోను, భావాన్ని అదుపు చేయడంలోను తిమ్మెర వంటి తేలికమాటలతో తేనెలు, తీయని తావులు, వెదజల్లడంలోనూ ఈ ఆచార్యుడు (ఆత్రేయ) తిక్కనకు వారసుడు."

-శ్రీ వేటూరి సుందరరామ్మూర్తి.

మంచి జీవితం కోసం మనిషి జీవితానికి ఆత్రేయ పది సూత్రాలను అనుసరించమని చెప్పారు. ఏమిటంటే అవి-

" ఒకటి
మానవులందరు ఒకటి
రెండూ
మంచివాళ్ళని, చెడ్డవాళ్లని
మనలో జాతులు రెండు
మూడు
మూఢుల స్నేహం వీడు
నాలుగు
నలుగురి సుఖము చూడు
ఐదు వేళ్ళవలె ఐక్యమత్యమున
అందరు వుంటే అదియే మేలు ... ఒక॥

ఆరు నూరుగా నూరు ఆరుగా
అయినా కూడా అబద్ధమాడకు
ఏడు ఏడు ఏడు ఇతరులచూసి ఏడవకు .. ఒక॥

ఎనిమిది వరకు నిద్రపోకు
తొమ్మిదిపైన మేల్కొని ఉండకు
పదిమంది నిన్ను మంచివాడని
పొగిడినంతనే పొంగిపోవకు "

– ఆలు మగలు చిత్రంలోని పాట







## ఆత్రేయపై వీడియో సీ.డీ.లు




7 మే 2010న ఆత్రేయ జయంతిని పురస్కరించుకుని ఆత్రేయ పరిశోధకుడు పృథ్వీరాజ్ రూపొందించిన వీడియో సీ.డీ. ఆత్రేయ జీవితాన్ని, సాహిత్యాన్ని వివరిస్తూ వివిధ ఫోటోలు,ఆత్రేయ సాహితీ వీడియో,సినిమా క్లిపింగ్స్‌తో పృథ్వీరాజ్ తన వాయిస్ ఓవర్‌తో రూపొందించిన వీడియో సీ.డి.

ఆత్రేయ వీణపాటలకు ప్రసిద్ధి. పాత సినిమాలలో కనీసం ఒక వీణపాటైనా కథానాయికకు పెట్టడం సంప్రదాయం. అందునా ఆత్రేయ ప్రియురాలు బాణం వీణను బాగా పలికించేదట! ఆ స్ఫూర్తితో ఎన్నో పాటలు రాశాడని అంటారు. పార్ట్ 1 గా ఆత్రేయగారి ప్రసిద్ధ వీణ పాటలను తీసుకుని 3 జూన్ 2010న ఈ వీడియో రూపొందించారు పృథ్వీరాజ్, కథకులు జి.రంగబాబు, రూపకర్త పృథ్వీరాజ్ మధ్యమధ్యలో వివరణ ఉంది.







ఒక సినిమా పాటల రచయిత మొదటి, చివరి పాటలు ఏమిటనేది ఆసక్తికలిగించే ఇక విషయమైతే, రచయితగా ప్రవేశం, నిష్క్రమణ గమనంలో సాహితీ పరిణతి గతినికూడా శ్రోతలు అంచనా వేయవచ్చు. ఈ ఉద్దేశ్యంతో మరొక వీడియో డాటా ఫైల్‌ను పృథ్వీరాజ్ రూపొందించడం జరిగింది.







7 మే 2007న 86వ ఆత్రేయ జయంతిని పురస్కరించుకుని ఆత్రేయ సినీ సంభాషణలపై పృథ్విరాజ్ పవర్ పాయింట్ ప్రజెంటేషన్. ఈ సందర్భంగా పృథ్విరాజ్ రూపొందించిన "సంభాషణా చాణుక్యుడు-ఆచార్య ఆత్రేయ" వీడియో సీ.డీ. ని ఆవిష్కరించిన కవయిత్రి శ్రీమతి అమరజ్యోతి. సీ.డీ.స్వీకర్త ప్రముఖ కవి శ్రీ పి.లక్ష్మణ్‌రావ్

" బంగారు నావ – బ్రతుకు
బంగారు నావ – దాన్ని
నడిపించు నలుగురికి మేలైన త్రోవ
అవమానం చీకటులు ఆవరించిన
అపనిందల తుఫానులు అడ్డగించినా
కదలిపోవు కాలచక్రమాగిపోవునా
నావ నడిపించు నలుగురికి మేలైన త్రోవ"




15 ఏప్రిల్ 2007న అభిరుచి సేవా సమాఖ్యావారి ఆధ్వర్యంలో ఆత్రేయ సినిమా పాటలుపై సాహిత్యోపన్యాసం చేశాను. ఈ సందర్భంగా " ఆత్రేయ సినిమా పాటలు" అనే వీడియో సీ.డీ.ని కవి, సహృదయ సాహితీ అధ్యక్షులు, హైకూ క్లబ్ పోషకులు, నాకు అత్యంత ఆత్మీయులైన శ్రీ శేఖరమంత్రి ప్రభాకర్ గారికి అంకితం చేసిన ఈ సీ.డి.ని ఆ వేదికపై ఆవిష్కరించడం జరిగింది.

" మనిషిగా జీవించేది నీ చేతుల్లోనే వుంది
మంచి చెడు ఏదయిన నీచేతుల్లోనే వుంది
కావాలని నిప్పుతాకితే చేయి కాలక మానదు
కాలినందుకు కర్మ అంటే గాయమేమో మానదు "





# ఆత్రేయ సినిమా సీడీల సేకరణ

ఈ రోజుల్లో పాత సినిమాలు చూడడం అంటే పెద్ద కష్టపడే పనిలేదు. యూట్యూబ్ ఛానల్స్‌లో, సినిమాలు ప్రసారం చేసే వివిధ టి.వి. ఛానల్స్‌లలో వస్తున్నాయి. కాని ఇంతగా సినిమా సీడీలు లభించడం క్లిష్టమైన 2000 సం॥ నాటి పరిస్థితుల్లో ఆత్రేయ సాహిత్యంపై వీడియో డాక్యుమెంట్ చేయాలన్నా, పాటలపై విశ్లేషణ చేయాలన్నా వీడియో సీ.డీలు ఉంటేనే ఈ పరిశోధనాత్మక పనులన్నీ చేయడానికి వీలు పడుతుంది. ఈ కారణం చేతనే బయట లభించే ఆత్రేయ సంభాషణలు రాసిన సినిమాల సీడీలను ఒక్కొక్కటిగా సేకరించడం ప్రారంభించాను. ఇటువంటి సీ.డీల లైబ్రరీ ఉంది.





# ఆత్రేయ ఫోటోలు, లేఖల సేకరణ

కొందరు విదేశీ కరెన్సీ, మరికొందరు తపాలా బిళ్ళల సేకరణ ఒక హాబీగా పెట్టుకుని ఏదైనా వారికి దొరకగానే, సంపాదించగానే ఎంత సంతోషిస్తారో దానికి రెండింతల ఆనందాన్ని...ఇంకా చెప్పాలంటే కోహినూర్ వజ్రాన్ని సంపాదించినంత ఆనందాన్ని విభిన్నమైన ఆత్రేయగారి ఫోటోను సంపాదించినప్పుడు నేను అనుభూతి చెందాను. కారణం ఆత్రేయగారి ఫోటోలు విరివిగా లేవు వేటూరివంటి వారి ఫోటోలతో పోల్చి చూస్తే ఆయా దర్శక నిర్మాతలు వద్ద ఉండవచ్చేమోగాని పనిగట్టుకుని వాటిని సేకరించడం కూడా పెద్ద పనే.

వివిధ వ్యక్తుల నుండి, వివిధ పత్రికల్లో , వివిధ గ్రామ్‌ఫోన్ రికార్డ్ కవర్స్‌పై లభించే ఆత్రేయ ఫోటోలను, గ్రూప్ ఫోటోలను, పెయింటింగ్స్‌ను సేకరించగలిగాను. ఇవికూడా అనుభూతిని కలిగించే అంశాలే కనుక ఇక్కడ పొందుపరుస్తున్నాను. ఈ సందర్భంగా కోడెనాగు చిత్రాల ఫోటోలు అందించిన "ఆత్రేయ అభిమాని మైత్రేయ"గారికి నా కృతజ్ఞతలు.

అదేవిధంగా ఇందులో ఆత్రేయగారి అరుదైన లేఖ కూడా పొందుపరచాను. ఆత్రేయగారి మరణాంతరం వివాదం రేపిన లేఖను సేకరించడం సాధ్యపడలేదు. ఈ లేఖమాత్రం ఆత్రేయగారికి పద్మావతి ఆత్రేయగారిపట్ల ఉన్న ప్రేమను వెల్లడించే లేఖ. ఇక్కడ ఆత్రేయ లెటర్ హెడ్, ఆత్రేయ దస్తూరి, ఆ లేఖలో తన భార్యకు అన్యాయం చేశానే అనే ఆత్రేయగారి పశ్చాత్తాపం గమనించడానికి ఇక్కడ పొందుపరుస్తున్నాను.







నిర్మాత రమణమూర్తి, శోభన లతో ఆత్రేయ



దేవులపల్లి కృష్ణశాస్త్రి, ఆత్రేయ



విజయనిర్మలతో ఆత్రేయ



మద్రాసు వచ్చిన తొలిరోజుల్లో ఆత్రేయ



సంగీత దర్శకుడు కె.వి.మహదేవన్‌తో ఆత్రేయ

" అమ్మంటే అమ్మ – ఈ
అనంత సృష్టికామె అసలు బ్రహ్మ
రక్తాన్ని అర్పించి, ప్రాణాన్ని పూరించి
చేస్తుంది నీబొమ్మ "







నాటి ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీమతి కుముద్బెన్ జోషి, శ్రీ [illegible] గార్లతో ఆత్రేయ



నాటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ అంజయ్యగారితో ఆత్రేయ, ప్రక్కన దాశరథి



గణేష్ పాత్రో, ఆత్రేయ, బాలచందర్, ఆర్.యస్.రాజు









ఆత్రేయగారి వీరాభిమాని శ్రీ పాండురంగ స్వామి (మైత్రేయ)గారు, వారు ఆత్రేయగారితో దిగిన ఫోటోలను పంపించినందుకు కృతజ్ఞతలు.





ఆత్రేయగారి వీరాభిమాని శ్రీ కె.విజయేశ్వర కుమార్ (హైద్రాబాద్) పద్మావతి ఆత్రేయగారిని చివరి దశలో తాడేపల్లి గూడెంలో కలిసిన చిత్రం.



















గుమ్మడితో ఆత్రేయ

"తొమ్మిది నెలల ఆరాటం
అమ్మయిచ్చిన ఆకారం
ఉగ్గు పాలతో ఊయలజోలా
నిన్ను పెంచిన మమకారం "











"భామాకలాపం" చిత్రంలోని హాస్య సన్నివేశంలోనేగాక "ఆదర్శం" చిత్రంలో ఆత్రేయ నటించిన పోస్టర్. చాలా రోజుల తర్వాత ఈ స్టిల్‌ను సంపాదించగలిగాను





ఆచార్య ఆత్రేయ " కోడెనాగు " చిత్రంలో 'రామశర్మ'పాత్రలో నటించిన దృశ్యం.









[illegible]చారి, ఆత్రేయ, కమల, ప్రమీల (ఒడిలో [illegible])
నేలమీద - కొడుకు శ్రీనివాస్, కూతురు [illegible], కొడుకు కృష్ణ





"పుట్టినోళ్ళు సావకుండా
ఏమవుతారు...?
సచ్చినోళ్ళు పుట్టకుండ
యాడుంటారు...?
ఇది తెలిసినోళ్ళు యెవ్వరూ ఏడవరు
ఏడ్చామని సచ్చినోళ్ళు బతకరు "



"మట్టిబొమ్మలే
మనమంతాను
గిట్టిపోవలె మట్టిలోపలే "

" పుట్టిపెరిగేది భూమిపైన,
గిట్టికలిసేది మట్టిలోన
ఎన్నిబంధాలు ఇంతలోన
ఎవరు నీవారు చివరిలోన "





# ఆత్రేయ సాహిత్యం పై జరిగిన పూర్వ పరిశోధనలు- సేకరించబడిన ఆత్రేయ సాహిత్యాంశాలు

**విశ్వవిద్యాలలో ఆత్రేయ సాహిత్యంపై పరిశోధనలు:**

వివిధ విశ్వ విద్యాలయాల్లో ఆత్రేయగారి సాహిత్యంపై పరిశోధనలు జరిగాయి. 'ఆత్రేయ నాటికా సాహితి' అనే లఘు సిద్ధాంత వ్యాసాన్ని 1980లో శ్రీ ఎ.వి.రవీంద్రకుమార్ శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయంలో సమర్పించగా పైడిపాల సత్యన్నారాయణ రెడ్డి 'ఆత్రేయ నాటకాలు-పూర్వాపారాలు'అనే లఘుసిద్ధాంత వ్యాసాన్ని 1984లో ఆంధ్ర విశ్వవిద్యాలయంవారికి సమర్పించారు. 'ఆత్రేయ అభ్యుదయ ఆదర్శాలు' అనే పరిశోధనా గ్రంథాన్ని కె.రాధాదేవిగారు మద్రాసు విశ్వవిద్యాలయానికి 1990లో సమర్పించగా కె.స్వర్ణలత 'ఆత్రేయ విశ్వశాంతి-వైశిష్ట్యం'అనే పరిశోధనా గ్రంథాన్ని1992లో నాగార్జున విశ్వవిద్యాలయంవారికి సమర్పించారు. ఇక ఆత్రేయగారి సినిమాపాటల విషయానికొస్తే 'ఆత్రేయ సినీగీతాలు-ఒక పరిశీలన' అనే పేరుతో కె.బి.శ్రీలక్ష్మి సిద్ధాంత వ్యాసాన్ని 1994లో శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయానికి సమర్పించారు. 'ఆత్రేయ-కణ్ణదాసన్‌ల పాటలు-ఒక పరిశీలన' అనే అంశంపై శ్రీమతి ఆదుర్తి వెంకటనాగశోభగారు మద్రాసు విశ్వవిద్యాలయంలో రిజిష్టర్ చేయించుకున్నారు గాని పరిశోధన పూర్తిచేయలేదని తెలియవచ్చింది.తలతోటి పృథ్విరాజ్ 'ఆత్రేయ సినిమా సంభాషణలు-ఒక పరిశీలన' అనే అంశంపై వారి పరిశోధనా గ్రంథాన్ని 2000లో ఆంధ్రవిశ్వవిద్యాలయం వారికి సమర్పించారు.

**ఆత్రేయ సాహిత్యంపై ప్రచురింపబడిన పుస్తకాలు:**

మొదలి నాగభూషణ శర్మ సంపాదకత్వంతో "ఆచార్య ఆత్రేయ తెలుగు నాటకరంగం''అనే వ్యాస సంకలనాన్ని1986లో తెలుగు విశ్వవిద్యాలయం వారు ప్రచురించారు.

పైడిపాలగారు వారి ఎం.ఫిల్.సిద్ధాంత గ్రంథాన్ని ఆత్రేయ నాటకాలు-పూర్వాపరాలు" పుస్తకంగాకూడా ప్రచురించారు.

మనసుకవి,ఆత్రేయ నాటకసాహిత్యం-సంభాషణలు అనే పుస్తకాల్ని రచించి ప్రచురించారు డా॥ తలతోటి పృథ్విరాజ్.

గొల్లపూడి మారుతీరావుగారు "ఆచార్య ఆత్రేయ ఒక పరిశీలన" అనే గ్రంథాన్ని నా సహకారంతో 2015లో గ్రంథంగా తీసుకు వచ్చారు.

**7 సంపుటాలలో "ఆత్రేయ సాహితీ":**

**ఆత్రేయ మరణాంతరం ఆత్రేయగారికి ఆత్మీయులైనవారు, సినీ ప్రముఖులు కొందరు కలిసి "మనస్విని పబ్లిక్ ఛారిటబుల్ ట్రస్ట్, మదరాసు" ఏర్పాటు చేసి చలనచిత్ర ప్రముఖులనుండి విరాళాలు సేకరించి**





"ఆత్రేయ సాహితీ" పేరుతో ఆత్రేయగారి సాహిత్యాన్ని సేకరించి శ్రీ కొంగర జగ్గయ్య సంపాదకునిగా, శ్రీ పైడిపాల సహ సంపాదకునిగా ఆత్రేయ సాహిత్యాన్ని ఏడు సంపుటాలుగా 1990 ప్రచురించారు."ఆత్రేయ సాహితి" మొదటి సంపుటం నాటకాలు-1 అని, రెండవ సంపుటం నాటకాలు-2 అని, మూడవ సంపుటం నాటికలు అని, "ఆత్రేయ సాహితి" 4,5,6 సంపుటాలకు "నాపాట నీనోట పలకాలి-1,2,3 భాగాలని పేరుపెట్టి, ఏడవ సంపుటం "కదంబం" అని పేరు పెట్టి ప్రచురించారు.

సినిమా పాటల విషయానికి వస్తే పాటల మొదటి సంపుటిలో1951-1971 సంవత్సరాల మధ్య101 సినిమాలలోని 420(418) పాటలను, రెండవ సంపుటిలో1972-1979 సంవత్సరాల మధ్య116 సినిమాలలోని 344(351) పాటలను, మూడవ సంపుటిలో1980-1990 సంవత్సరాల మధ్య136 సినిమాలలోని 333(335) పాటలను సేకరించి ప్రచురించారు.

సంపాదకులు ఈ పాటల సంపుటికి ముందుమాట రాస్తూ "ఒక రచయిత వ్రాసిన సినిమా పాటలను ఎంపిక చేసికాకుండా (సెలెక్టెడ్‌గా కాక), సంపూర్ణంగా ముద్రించడం తెలుగులో ఇదే మొదటిసారి అనికూడా మనవిచేస్తున్నాం" అని తెలియజేస్తూ..."...సేకరించడం మొదలెట్టాక అవి 1200 దాటిపోయాయి. ఇదే ఖచ్చితమైన సంఖ్య అనికూడా చెప్పలేము." అని అనడమేగాక "...ఇంతచేసినా, శ్రీ ఆత్రేయ వ్రాసిన పాటలన్నీ సేకరించగలిగామని మేమనుకోవడం లేదు. ఇంకా కొన్ని అనివార్యంగా మిగిలిపోయి ఉండవచ్చు" అని సంపాదకులు కొంగర జగ్గయ్య "మా మాట" అనే వారి ముందుమాటలో అభిప్రాయ పడ్డారు. వీటిప్రకారం ఆత్రేయ మొత్తం 353 సినిమాలలో 1097 (1104)పాటలు రాశారు.

ఆత్రేయ సాహిత్యంపై విశ్వవిద్యాలయం స్థాయిలో ఎన్నో పరిశోధనలు జరిగినప్పటికీ ఆత్రేయ సాహిత్య సేకరణలో మరుగుపడిపోయిన, పరిశోధకులు సేకరించలేక పోయిన ఆత్రేయ సాహిత్యాని మరికొంత సేకరించాలని నా తపన ప్రారంభ అయింది. "ఆత్రేయ సినిమా సంభాషణలు-ఒక పరిశీలన" అనే అంశంపై 2000 సంవత్సరంలోనే ఆంధ్రవిశ్వకళాపరిషత్ నుండి నాకు పిహెచ్.డి. పట్టా వచ్చినప్పటికీ సేకరించాలనే తపన ఆగిపోలేదు.

మనస్వినీ ట్రస్ట్‌వారు ప్రస్తావించిన సినిమా పేర్లలో వారు పేర్కొనని కొన్ని పాటలను, 2) మనస్వినీ ట్రస్ట్‌వారు తీసుకు వచ్చిన ఆత్రేయ పాటల సంపుటులలో పేర్కొనని ఆత్రేయ పాటలు రాసిన సినిమా పేర్లు; అందులోని పాటలను సేకరించగలిగాను. ఈ క్రమంలో ఆత్రేయ సినిమా సంభాషణలు సమకూర్చిన మరికొన్ని సినిమా పేర్లను గుర్తించగలిగాను.

"మామూలు మాటలతో పాటలని పొదగవచ్చు అనే విషయాన్ని మొట్టమొదటిగా ప్రదర్శించి చెప్పింది, ఆచరించి చూపింది ఆచార్య ఆత్రేయ."
- శ్రీ కొంగర జగ్గయ్య.





# "మనస్విని" ట్రస్టువారు సేకరించి ప్రచురించిన ఆత్రేయ చిత్రాల పేర్లు-పాటలు

పాటలు రాసిన చిత్రాల పేర్లు- వాటి పల్లవులు:

**అంగడిబొమ్మ(1978)సత్యం,**
**నరసింహరాజు, అంజలీదేవి?**

**అంగడిబొమ్మ(1972)**
**కె.వి.మహదేవన్, డి.బి.యన్.ప్రొడక్షన్స్,**
**నారాయణరావు,నరసింహరాజు, అంజలీదేవి,**
**దర్శకులు:వి.మధుసూదనరావు,**
జాబిలి వెన్నెల్లు
నిదురపోరా బాబు నిదురపోరా
అహెూ ...అందాల రాశి

**అండమాన్ అమ్మాయి(1979)**
**కె.వి.మహదేవన్,వీనస్ కంబైన్స్,**
**ఏ.ఎన్.ఆర్,వాణిశ్రీ,చంద్రమోహన్,**
అండమానమ్మాయి,
ఈ కోవెల నీకై వెలిసింది,
చిత్రా చిత్రాల బొమ్మ.

**అంతస్తులు(1965)**
**కె.వి.మహదేవన్,జగపతి పిక్చర్స్,**
**ఏ.ఎన్.ఆర్,కృష్ణకుమారి,**
నిను వీడని నీడను నేనే,
నువ్వంటే నా కెందుకో ఇంత ఇది,
తెల్లచీర కట్టుకున్న దెవరికోసము.

**అంతా యింతే(19955)**
**జి.రామనాథన్,అరుణా ఫిలిమ్స్,**
రమ్ము చెలికాడ ఎందుకి తామసం,
కల్వలు పూచే కలలను కలచె,
ప్యారీ మిమ్ముల్ మీదె హంకీ మజా,
ఏలం ఏలం రండోయ్ రండీ,
కంటే కొల్లు విషమౌ కళ్ళుగల పడతికని యీ,
సుందరి సౌందరి నిరంజనియే,
కోతినుంచి జనించెను మనిషి,
ఆపాయ కనువిప్పు అయ్యా వాదుకాదయ్యా,
ఏమారిపోయినవి బహుజోరైన,
చిట్టాపిళ్ళకై జాడలుకాచి.

**అంతులేని కథ(1976)**
**ఎం.ఎస్.విశ్వనాథన్,అండాళ్ ప్రొడక్షన్స్,**
**రజనీకాంత్,కమల్‌హాసన్,జయప్రద**
దేవుడే యిచ్చాడు వీథి ఒకటి,.
కళ్ళలో వున్నదేదో కనులకే తెలుసు,
అరె ఏమిటీ లోకం పలుగాకుల లోకం,
తాళికట్టు శుభవేళ మెడలో కళ్యాణమాల,
ఊగుతుంది నీ ఇంట ఉయ్యాల.





**అంతే కావాలి(1955)**

**పెండ్యాల,ప్రకాష్‌వారి,**

వచ్చాడా-మనసుకు నచ్చాడా,

రావోయీ-ఇటు రావోయీ,

ఉషారుగుండాలోయ్ బాబూ,

నిజమేనా నిజమేనా,

నీకోసం నీకోసం,

ఓ వెడలిపోయే ప్రేమికా వినిపో,

ఎవరినీ ప్రేమించకు,

రాజాధి రాజులు-ధిరాజులు,

ఆనందమే ఆనందమే.

**అందమైనఅనుభవం(1979)**

**యం.యస్.విశ్వనాథన్, ప్రేమాలయా,**

**కమల్‌హాసన్,రజనీకాంత్,జయప్రద,జయసుధ:**

కుర్రాళ్లోయ్ కుర్రాళ్ళు వెర్రెక్కి వున్నోళ్ళు,

అందమైన లోకముంది,

ఆనంద తాండవమే ఆడెనుగా,

నువ్వే నువ్వమ్మా నవ్వుల,

హల్లో నేస్తం బాగున్నావా హల్లో నేస్తం గుర్తున్నానా

**అందరూ దొంగలే(1974)**

**కె.వి.మహదేవన్,పల్లవి ప్రొడక్షన్స్,శోభన్‌బాబు,లక్ష్మీ:**

ఓర్నాయాల! చూశానురా ఈ వేళ పిల్లంటె పిల్లకాదు,

గురు దేవా! మహదేవా!

**అక్కా చెల్లెలు(1970)కె.వి.మమదేవన్,జగపతి పిక్చర్స్,**

**ఏ.ఎన్.ఆర్,షావుకారు జానకి, కృష్ణ, విజయనిర్మల:**

శ్రీమతి ఏమన్నా శ్రీవారు తందానతాన,

పాండవులు పాండవులు తుమ్మెదా,

న్యాయానికి బందీగా న్యాయమూర్తి,

చిటాపటా చినుకులతో

**అగ్గిరవ్వ(1981)**

**కె.వి.మహాదేవన్, రామకృష్ణ సినీ స్టూడియోస్,**

**ఎన్టీఆర్,శ్రీదేవి(పాటలన్నీ):**

హెయ్...గొప్పల గోవిందమ్మో అమ్మీ అమ్మీ అమ్మమ్మీ,

పండైతే పనికిరాదు ఆవకాయకు,

లేతపిందెలో వగరుంటుంది

**అగ్గిరాముడు(పాతది1954)**

**ఎస్.ఎం.సుబ్బయ్యనాయుడు, పక్షిరాజా స్టూడియోస్,**

**ఎన్టీఆర్,భానుమతి(పాటలు-మాటలు):**

జై ఆంధ్ర జనని విశాలాంధ్ర ధరణీ,

కరుణ చూడవలెను గౌరి,

రారా యశోద నందన యదు వధూ జనమదన,

ఎవరురా నీ వెవరురా,

కొండాకోనలలోన పండిన,

మందులోయ్ మందులు,

ఎవరు పిలిచారూ నా ఎదుటెవరో,

రానీ రాజు రానీ రేయికానీ,

**అగ్నిజ్వాల(1983)సత్యం,జి.వి.కె.కంబైన్స్:**

తమ్ముడూ గంగ పొంగి ఉరికిందిరా

**అగ్నిపూలు(1981)కె.వి.మహాదేవన్, సురేష్ ప్రొడక్షన్స్:**

బృందావనీ గోపికా బృంద మందార,

వయసు కోతి వంటిది-మనసు కొమ్మవంటిది,

ప్రియుడా పరాకా-ప్రియతమా పరాకా,

అబ్బాయ్ అబ్బాయ్ నువ్వెంత

**అడవిలోఅభిమన్యుడు(1989)**

**కె.వి.మహాదేవన్, పల్లవిపూర్ణా పిక్చర్స్:**

పచ్చని పచ్చిక వెచ్చని కోర్కెను రెచ్చగొట్టుతూ ఉన్నది





**అత్తగారూ కొత్త కోడలు(1968)**
**జి.కె.వెంకటేష్,కల్పనా చిత్రా:**
*చిటుకుమన్నది చిటికమ్మా కిర్రుమన్నది తలుపమ్మా,*
*వెన్నెల తెచ్చాడూ మా పాపడు నవ్వులు పంచాడు,*
*వయసు ఆగదు మనకోసం మనసు ఉన్నది జతకోసం*
**అత్తలూ కోడళ్ళు(1971)**
**కె.వి.మహదేవన్,నందినీ ఫిలిమ్స్:**
*పాలపిట్ట పాలపిట్ట పరుగులెందుకు,*
*ఈ వీణ పలికించు ఎన్ని రాగాలో,*
*చీరకు రవికందమా? రవికకు చీరందమా?*
**అదృష్టవంతులు(1968)**
**కె.వి.మహదేవన్,పుహళేంది,జగపతి పిక్చర్స్:**
*కోడికూసే జాముదాకా తోడు రారా చందురూడా,*
*నమ్మరేం...? నేను మారానంటే నమ్మరేం...?*
**అన్నదమ్ములు(1969)**
**కె.వి.మహదేవన్,డి.బి.యన్,ఫిలిమ్స్:**
*నన్ను చూసి వెన్నెల చూస్తే ఆ వెన్నెల చల్లగ వుండదు*
**అనుబంధం(1984)చక్రవర్తి,లక్ష్మీఫిలిమ్ కంబైన్స్:**
*ఆ నాటి ఆ స్నేహ మానంద గీతం ఆ జ్ఞాపకాలన్నీ,*
*మల్లెపూలు గొల్లుమన్నవి పక్కలోనా*
**అనురాగం(1963)పెండ్యాల, అనురూపా పిక్చర్స్:**
*ప్రేమా పిచ్చీ ఒకటే నువ్వూ నేనూ వేరే,*
*అమ్మా అమ్మా అనే మాటలలో ఎంతటి కమ్మదనం వుంది*
**అనురాగ దేవత(1982)**
**చక్రవర్తి, రామకృష్ణా సినీ స్టూడియోస్:**
*చూసుకో పదిలంగా హృదయాన్ని అద్దంలా*
**అనురాధ(1971)కె.వి.మహదేవన్,ధనలక్ష్మీ మూవీస్:**
*ఇంతలేసి కళ్ళతో అంత లేత మనసుతో,*
*కోడెవయసు కుర్రాడా గుండెలుదీసిన మొనగాడా,*
*కూరకని రారా కొంటెకుర్రాడా*
**అబ్బాయిగారు-అమ్మాయిగారు(1972),**
**కె.వి.మహదేవన్,డి.బి.యన్.ప్రొడక్షన్స్:**
*తొలిచూపు చూసింది హృదయాన్ని*
**అభినందన(1988)ఇళయరాజా,లలితశ్రీ కంబైన్స్:**
*ప్రేమలేదని, ప్రేమించరాదని,*
*ప్రేమ ఎంత మధురం,*
*అదే నీవు అదే నేను,*
*రంగులలో కలవో ఎద పొంగులలో కళవో,*
*చుక్కలాంటి అమ్మాయి,*
*ఎదుటా నీవే ఎదలోనా నీవే,*
*మంచు కురిసే వేళలో?*
*కాలుచున్న గుండెలో?*
**అభిమన్యుడు(1984)కె.వి.మహదేవన్,యువచిత్ర:**
*ఆకేసి పప్పేసి బువ్వేసి నెయ్యేసి తనకో ముద్ద నాకో ముద్ద,*
*ఒకే గొడుగు ఒకే అడుగు ఒకే నడకగా,*
*సూర్యుడు చూస్తున్నాడు,*
*శృంగార సీమంతిని!*
**అభిలాష(1983)ఇళయరాజా, క్రియేటివ్ కమర్షియల్స్:**
*వేళాపాళా లేదు కుర్రాళ్ళాటకు,*
*ఉరకలై గోదావరి ఉరికె నా ఒడిలోనికి*
**అర్ధాంగి(1955)బి.నరసింహారావు,రాగిణి ఫిలిమ్స్:**
*రాధను రమ్మన్నాడు రాసక్రీడకు మాధవదేవుడు,*
*పెళ్ళి ముహూర్తం కుదిరిందా పిల్లా నీ పొగరణిగిందా,*





ఎక్కడమ్మా చంద్రుడూ? చుక్కలారా, అక్కలారా,
వద్దురా కన్నయ్య ఈ పొద్దు-ఇల్లువదలి పోవద్దురా అయ్య,
ఇంటికి దీపం ఇల్లాలే సుఖాల పంటకు జీవం ఇల్లాలే,
రాకరాక వచ్చావు చందమామ లేక లేక నవ్వింది కలువభామ,
ఏడవనీ ఏడ్చేవాళ్ళను ఏడవనీ,
తరలినావా త్యాగమూర్తీ ధర్మానికి నీ తలపంచి,
సిగ్గేస్తదోయ్ బావ సిగ్గేస్తదీ

**అల్లరి బుల్లోడు(1978)చక్రవర్తి,మారుతీ కంబైన్స్:**
పేదలకన్నా పేదవాళ్ళు ప్రేమపాశం లేనివాళ్ళు

**అల్లుడే మేనల్లుడు(1970)బి.శంకర్,పద్మశ్రీ పిక్చర్స్:**
పెళ్ళి కుదిరిందమ్మా పెళ్ళికుదిరింది,

**అల్లుడొచ్చాడు(1976)**
**టి.చలపతిరావు, ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్:**
లేతకొబ్బరి నీళ్ళల్లే పూత మామిడి పిందల్లే,
వేళాపాళా ఉండాలమ్మా దేనికైనా

**అమరదీపం(1977)సత్యం, గోపీకృష్ణా మూవీస్:**
నీవే రథసారధివై,
ఏ రాగమో ఇది ఏ తాళమో,
ఇంతే యీ జీవితము చివరికి అంతా

**అమ్మాయి పెళ్ళి(1974)కె.వి.మహదేవన్,భరణి కంబైన్స్:**
బాబూ నిదురపోరా! బాబ్బాబూ నిదురపోరా

**అమ్మాయిల శపథం(1975)విజయభాస్కర్,సురేష్ ఇంటర్నేషనల్:**
చూపిస్తా చమక్కులు చేయిస్తా గమ్మత్తులు,
నీలిమేఘమా జాలి చూపుమా,
నీలిమేఘమా జాలి చూపుమా,
నా వయసు ఉరికినది నీ మనసు,
నీకు నాకు బంధమేమో ఎరుగరయ్యా

**ఆకలి రాజ్యం(1981) యం.యస్.విశ్వనాథ్, ప్రేమాలయ:**
సాపాటు ఎటూలేదు పాటైనా పాడు బ్రదర్,
కన్నెపిల్లవని కన్నులున్నవని,
గుస్సా రంగయ్య కొంచెం తగ్గయ్య

**ఆడజన్మ(1970)మాష్టార్ వేణు, విజయలక్ష్మీ మూవీస్:**
నీ కథ యింతేనమ్మా దీనికి అంతేలేదమ్మా

**ఆడబ్రతుకు(1965)యం.యస్.విశ్వనాథ్, జెమినీ స్టూడియోస్:**
ఓంకార రూపిణీ ఓ కృపారసధునీ,
తనువుకెన్ని గాయాలైనా మాసిపోవునెలాగైనా,
బుజ్జి బుజ్జి పాపాయీ బుల్లి బుల్లి పాపాయీ,
ప్రేమేనీకు మాంగల్యం-అది జన్మజన్మ అనుబంధం

**ఆడపులి(1984)చక్రవర్తి,యస్.ఆర్.ఫిలిమ్స్:**
దాహం దాహం దాహమేస్తుంది,
ఓ చెల్లీ నీ మరణంతో మారిపోదు ఈ మగలోకం

**ఆడవాళ్ళు మీకు జోహార్లు(1981)కె.వి.మహాదేవన్,భారత్ ఫిలిమ్స్:**
ఒకసారే-ఒకసారే,
పాపికొండల వెనుక పాపంటిమనసున్న,
రేపు మాపు రూపు మెరుపు

**ఆత్మబంధువు(1987)**
**ఇళయరాజా,యస్.ఆర్.ఆర్ట్ క్రియేషన్స్:**
పట్టి తెచ్చేనులే పండువెన్నెల్ని నేనే

**ఆత్మబలం(1964)కె.వి.మహాదేవన్,జగపతి ఆర్ట్ పిక్చర్స్:**
గిల్లి కజ్జాలు తెచ్చుకునే అమ్మాయీ,





ఓ హోహోహోహో,,పరుగులుతీసే నీ వయసునకు,
చిటపట చినుకులు పడుతూవుంటే,
ఎక్కడికి పోతావు చిన్నవాడా,
నాలుగుకళ్ళు రెండైనాయీ రెండుమనసులు ఒకటైనాయీ,
తెల్లవారనీకు ఈ రేయిని తీరిపోనీకు ఈ తీయని హాయినీ,
రంజు రంజు భలే రామచిలకా

**ఆత్మీయుడు(1977)జె.వి.రాఘవులు,విజయ వాధవీ పిక్చర్స్:**

బిందిమీద బింది పెట్టి,
ఏం సోకు ఎంత సోకు ఇన్నాళ్ళు లేని సోకు,
అల్లో మల్లో ఆకాశంలో చల్లని వెన్నెల్లో

**ఆదర్శం(1952) అశ్వత్థామ, శుభోదయా పిక్చర్స్:**

క్రిష్ణహరే శ్రీక్రిష్ణహరే గిరిధారి హరే,
ఆర్థులం శరణార్థులం!,
సినిమాలో చేరాలి బావా!,
నేనేనా? నేనొకడేనా? కవితల లోకంలో,
కమ్మనైన కట్టుకథ నీకు చెప్పనా?,
నలుపు నలుపు నలుపు కాకినలుపు,
మానవ నీతి ఇదేనా; మానిని రాత ఇదేనా?,
ఎచటిదో యీ పిలుపు? ఎవరిదో యీ వలపు?
దీనా! ఓ భాగ్యహీనా! ఓ భగ్నవీణా!,
ప్రేమించానని అన్నావే? అవును,
తుదిపాట పాడుకోనీ! ఎదబాధ మాసిపోనీ!

**ఆదర్శ కుటుంబం(1969)**
**యస్.రాజేశ్వరరావు,ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్:**

కాళ్ళగజ్జె కంకాలమ్మ వేగుచుక్క వెలగ,
ఏయ్ ఏయ్‌రా చూస్తావేరా

**ఆదర్శవంతుడు(1980)యస్.రాజేశ్వరరావు,మహీజా ఫిలిమ్స్:**

నీలినీలి నింగిలో చీకట్లు చీకటైన నేలపై వెన్నెల్లు,
పుట్టి పెరిగేది భూమిపైన

**ఆరాధన(1988)ఇళయరాజా,కస్తూరి ఆర్ట్స్ క్రియేషన్స్:**

అరె! ఏమైందీ ఒక మనసుకు రెక్కలొచ్చి ఎగిరింది,
ఏమౌతుందీ తన మనసును,
హే జమ్ కూజమా,
తీగనై మల్లెలు పూచినవేళ

**ఆలయదీపం(1985)సత్యం,లక్ష్మీ ఫిలిమ్ కంబైన్స్:**

పగలు రాత్రి వెలిగే తారకు,
పున్నమి జాబిలి వెన్నెల వెలుగులు,
ముద్దీయనా...మురిపించనా,
ఆకాశం ఎరుగని సూర్యోదయం,
పగ్గాలు తెంచుకున్న ఈడు

**ఆలుమగలు(1959)కె.వి.మహదేవన్,ఎం.ఏ.వి.పిక్చర్స్:**

చీకటిరా బాబు చీకటిరా,
మల్లెపూల వెన్నెలలోన మాటేసే,
సంసారం మహాసాగరం ఈదాలి ఏకమై,
వందేమాతరం వందేమాతరం,
యుగయుగాలుగా తరతరాలుగా మగువల మాయకు,
ఒరే...ఒరే...ఒరే..ఒరే..వినరా,
ఎందుకు కవ్వించేదెందుకు ఈ హృదయం కదిలించి,
ఒకటి ఒకటి ఒకటి మానవులందరు ఒకటి,
జననీ...! వినుమా...!రామచంద్రుడు,
రాలిపోయిన ఓ రోజా...!





**ఆస్తిపరులు(1966)**

**కె.వి.మహదేవన్–పుహళేంది,జగపతి పిక్చర్స్:**

శ్రీకృష్ణ వృష్టి వరయాదవ,

మిడిసి పడకు మిడిసి పడకు అత్తకూతురా,

చిట్టి అమ్మలు చిన్ని నాన్నలూ,

చలి చలి చలి వెచ్చని చలి,

మగవాడివలె ఎగరేసుకుపో వగవాడివలె నను దోచుకుపో,

అందరికీ తెలియనిది నీ అందంలో,

చిట్టి అమ్మలూ చిన్న నాన్నలూ,

ఎర్ర ఎర్రని బుగ్గలదానా నల్లనల్లని కన్నులదానా

**ఇంటికి దీపం ఇల్లాలే (1961)**

**విశ్వనాథ్,రామమూర్తి,ఆర్.ఆర్.పిక్చర్స్:**

పొంగి పొంగి వచ్చినది,

నీవే-నీవే నిన్నే నిన్నే,

ఒకే రాగం-ఒకే తాళం,

కాపలా...హా...హా...హా,

కనుమూసి కథ ముగించినది

**ఇంద్రధనుస్సు(1977), కె.వి.మహదేవన్,ఉదయలక్ష్మీ ఆర్ట్ పిక్చర్స్:**

ఇది మైకమా...బింకమా!

ప్రేమకు మరణం లేదు,

ఏడురంగుల ఇంద్రధనుస్సు,

నేనొక ప్రేమపిపాసిని

**ఇంద్రధనుస్సు(1987)రాజ్–కోటి,వి.యస్.ఆర్ట్ మూవీస్:**

కథ ఏదైనా తుది ఇంతే యీ నాటికి,

శిలను శిల్పం చేసినా,

ఇంద్రధనుస్సు ఇల్లాలై

**ఇదాలోకం(1973)చక్రవర్తి, సమతా చిత్ర:**

ఏటి ఒడ్డున కూచుంటే ఏరు గలగలమంటుంటే,

నిత్య సుమంగళి నీవమ్మా నీ పసుపు కుంకుమ

**ఇది కథకాదు(1979)**

**యం.యస్.విశ్వనాథన్,ఆండాళ్ ప్రొడక్షన్స్:**

సరిగమలు గలగలలు,

జోలపాట పాడి ఊయలూపనా,

గాలికదుపులేదు-కడలికంతులేదు,

అటుఇటుకాని హృదయంతోటి

**ఇద్దరూ అసాధ్యులే (1979) సత్యం, శ్రీసారథి స్టూడియోస్**

చినుకు చినుకు పడుతూ ఉంటే,

సంక్రాంతి సంబరాల జాతరోయ్,

తల్లొక చోట పిల్లొక చోట,

వెయ్యకు గాలము,

నదిలో అలనురా .

**ఇదేం పెళ్ళాం బాబోయ్(1990) ఇళయరాజా, రాజా ఎంటర్‌ప్రైజెస్:**

మనసుకెటు మతిపోయింది

**ఇన్‌స్పెక్టర్( )రామనాథన్,జూపిటర్ పిక్చర్స్:**

తీయని ఆశలు తెలిపే కన్నులు,

రతియో జాంబవతియో,

మరుపాయెనా మోహనా,

మూలపడిన నా ముద్దుల వీణలో,

మార సుకుమార రార,

కన్న కలలన్నీ కల్లలైపోయెనే...,

జగజ్యోతి కళావాహినీ,

సుడిగాలి గోలలో నడికడలిలో





**ఇల్లాలి కోరికలు(1982) చక్రవర్తి, బాబూ ఆర్ట్స్:**
బాటలు వేరైనా-బాటసారులొకటే
**ఇల్లాలు(1965)కె.వి.మహదేవన్,ప్రసాద్ ప్రొడక్షన్స్:**
పోపోపో రారారా నువుపోయిన చోటే,
మల్లెపూవులు విరిసెరా-మంచుతెరలు కరిగెరా,
మనసునేదో కవ్విస్తూంది తలచుకుంటే,
అందమంటే నువ్వే-ఆనందమంటే నువ్వే
**ఇల్లాలు(1981) చక్రవర్తి, బాబు ఆర్ట్స్:**
గుండెలో సవ్వడి-ఏమిటో అలజడి,
ఓ బాటసారి...ఇది జీవిత రహదారి
**ఇల్లాలే దేవత(1985) చక్రవర్తి, లక్ష్మీ ఫిలిమ్ కంబైన్స్:**
రాణీగారు మారాణిగారు,
పువ్వులాగా నవ్వుకోవే-నవ్వులాగా వుండిపోవే
**ఈతరం మనిషి(1976)చక్రవర్తి,పల్లవి ఆర్ట్ పిక్చర్స్:**
ఎంత షోగున్నావే కిలాడి గుంట,
ఇచ్చేశా నా హృదయం తీసుకో ఎదలోపల పదిలంగా దాచుకో
**ఉత్తమురాలు(1974).ఎ.వి.రాఘవులు, యస్.వి.యస్.ఆర్.పిక్చర్స్:**
కోనసీమ కొబ్బరి తోటల్లో వానాకాలం మబ్బుల నీడల్లో
**ఉపాయంలో అపాయం(1967)కె.వి.మహాదేవన్, విజయవర్ధనా మూవీస్:**
పదారు గడిచి పదేడులోకి,
ప్రతిపాప పుట్టేదే-ప్రతి పాపకు
**ఉమ్మడి మొగుడు(1987) చక్రవర్తి, రాఘవేంద్ర మూవీ క్రియేషన్స్:**
రాక రాక వచ్చింది తొలకరి చినుకు,
పైడిబొమ్మ ఇల్లాలికి పచ్చ గాజులు,
రాముడంటి మంచివాణ్ణి
**ఎంకి-నాయుడుబావ(1978)**
**కె.వి.మహదేవన్, వెంకటేష్ ఎంటర్ప్రైజెస్:**
ఎంకంట ఎవరంట ఎరగనోళ్ళు,
కళ్ళూ కాళ్ళూ లేనిదాన్ని బాబులు అంటే గవ్వైన యివ్వరే,
బ్రహ్మచారి ముదిరినా బెండకాయ ముదిరినా
**ఎదురీత(1963)కె.వి.మహాదేవన్,ఎం.ఏ.వి.పిక్చర్స్:**
ఒకేమాట ఒకేమాట అడగనా చెలీ,
ధనంలోనె జగం ఉన్నది నిజం,
ఈవేళ మనం వ్రాసుకొన్న ప్రేమపత్రము
**ఎదురులేని మనిషి(1975)**
**కె.వి.మహదేవన్,సల్లవి ఆర్ట్ పిక్చర్స్:**
కసిగావుంది కసికసిగావుంది కలవక కలవక కలిసినందుకు,
హే కృష్ణాముకుందా మురారీ..కాస్త కళ్ళు మూసుకోవయ్య,
ఎంతవాడి వెంతవాడి వయ్యావురో బంగారు,
అబ్బా దెబ్బ తగిలిందా.. ఆ నొప్పిగావుందా?,
కంగారు ఒకటే కంగారూ కళ్ళు కలిస్తే కంగారు,
ఉందా కలేజా ఉంటే లేజా
**ఎర్రగులాబీలు(1979)**
**ఇళయరాజా,కె.యస్.ఆర్.క్రియేషన్స్:**
ఈ ఎర్రగులాబీ విరిసినది తొలిసారి
**ఎవడబ్బ సొమ్ము(1980)**
**జె.వి.రాఘవులు,సురేంద్ర ఆర్ట్ పిక్చర్స్:**
అమ్మను చూచాను- ఈ జన్మకు





**ఏడడుగుల బంధం(1985)**
**శంకర్, గణేష్,లక్ష్మీప్రసన్న పిక్చర్స్:**
ఎందుకు ఎందుకు ఎందుకు,
మావయ్యో మావా,
ముందెళ్లేదానా నీ యెనకాలే రానా
**ఒక చల్లని రాత్రి(1980)**
**కె.వి.మహదేవన&,వెంకటలక్ష్మీ ప్రొడక్షన్స్:**
అమ్మమ్మో ఈనాడు శనివారం-ఆ ఏడుకొండల,
అది ఒక చల్లని రాత్రి,
అది ఒక చల్లని రాత్రి,
దు:ఖమంతే ఏమిటని దేవుణ్ణి అడిగాను
**ఒక తల్లి పిల్లలు(1953)**
**యస్.యమ్.సుబ్బయ్యనాయుడు,పక్షిరాజా స్టూడియోస్:**
సెప్పురా సిన్నాడ సెప్పురా,
దేశంపోయే తీరులో,
చిట్టితల్లి రావే చెపుతా,
అమ్మా మా మాసలు వినవమ్మా,
చిన్నెల వన్నెల చిన్నారిని,
కావలెనోయీ కమ్మని కలగా జీవితం,
ఆటలూ పాటలూ ఎందుకు,
లేదమ్మా కలిమిలో జీవితం,
అగజానన పద్మార్కం గజానన,
భామనే సత్యభామనే,
మహిమ తెలియతరమా!
**ఒక దీపం వెలిగింది(1975)**
**యస్.రాజేశ్వరరావు,శివప్రసాద్ మూవీస్:**
చెప్పలేనిది చెప్తుతున్నా నువ్వొప్పుకున్నా
**కంచుకోట(1967)పి.వి.రాజు,విశ్వశాంతి పిక్చర్స్:**
లేదులేదని ఎందుకు నీలో ఉన్నది దాస్తావు
**కథనాయకుని కథ(1975)**
**కె.వి.మహదేవన్,తారకరామా పిక్చర్స్:**
దేవుడు లోకంలో కొందరు దేవుళ్ళను సృష్టించాడు,
శ్రీమతిగారూ! ఆగండీ! మీ శ్రీవారెవరో సెలవివ్వండీ!
**కన్నతల్లి(1953)పెండ్యాల,ప్రకాష్ ప్రొడక్షన్స్:**
చూచావా చూచావా! చివరికి
**కన్నతల్లి(1972)కె.వి.మహదేవన్,భానూ మూవీస్:**
తీయతీయని నవ్వే నువ్వు,
కాలం మారుతుంది చేసిన గాయాలు మాన్పుతుంది,
నిన్నరాత్రి నిన్ను చూస్తి కల్లోన పిల్లా,
వచ్చిందమ్మా దోరదోర వయసు,
అబ్బో! ఎంత మొనగాడివనుకున్నా!,
నువ్వు కావాలి నీ నవ్వుకావాలి
**కన్నెమనసు(1966)కె.వి.మహదేవన్,బాబూమూవీస్:**
ఈ ఉదయం నా హృదయం,
ఓ...హృదయం లేని ప్రియురాలా
**కలిసిన మనసులు(1968)మాస్టర్ వేణు,కౌముదీ ఫిలిమ్స్:**
అమ్మవంటిది అంత మంచిది
**కల్యాణ మండపం(1971)ఆదినారాయణరావు,మధూ మూవీస్:**
ముగిసె రెండు గుండెల గాథ
**కలియుగ రాముడు(1981)కె.వి.మహదేవన్,తిరుపతి ప్రొడక్షన్స్:**
డియర్ డియర్ డిల్లాయిలే
**కక్ష(1980)చక్రవర్తి,సురేష్ ప్రొడక్షన్స్:**
ఐసలకిడి ఘుంతలకడి,





కందిరీగతో చెప్పానురా,

నా మనసు పిచ్చిముండ,

బుగ్గమీద ముద్దు పెట్టనా

**కృష్ణపరమాత్మ(1986)**

**జె.వి.రాఘవులు, పంచవటి చిత్రాలయ:**

ఉన్నా ఉన్నా కాచుకున్నా ఎన్నో ఎన్నో,

కథ ముగిసింది వ్యధ తీరింది

**కానిస్టేబుల్ కూతురు(1963)గోవర్ధన్,చిత్రకళావారి:**

పూవు వలె విరబూయవలె,

పుడితేనూ పురుసుడుగా పుటకే కోరద్దు,

కళ్ళల్లో నీరెందుకు కలకాలం

**కిరాతకుడు(1986)ఇళయరాజా,లక్ష్మీ ఫిలిమ్స్ డివిజన్**

నీ మూగ వీణయి మ్రోగేనా

**కీలుబొమ్మలు(1965)కోదండపాణి,హైద్రాబాద్ మూవీస్:**

పిల్లనగ్రోవిగ మారితిరా

**కుక్కకాటుకు చెప్పుదెబ్బ(1979)**

**యం.యస్.విశ్వనాథన్, గోపీకృష్ణా ఇంటర్నేషనల్:**

కన్నువంటిది ఆడదీ కన్నీరామెకు తప్పనిదీ

**కెప్టెన్ నాగార్జున(1986)చక్రవర్తి,జగపతి ఆర్ట్ పిక్చర్స్:**

ఒకటి ఇంకొకటి అటొకటి,

నువ్వు నేనూ ఎవరంట-ఎన్నో జన్మలు,

మనసు పడితే ప్రేమపుడుతుంది,

ఈ మూడు లోకాలు ఈ మూగదేశుళ్ళు,

ఏది అందం ఏది బంధం

**కే.డి.నంబర్-1(1978)**

**కె.వి.మమదేవన్,దేవి ఫిలిం ప్రొడక్షన్స్:**

యస్! నేనే నెంబర్ వన్

**కొంటె కాపురం(1985)చక్రవర్తి,పి.వి.యస్.ఫిలిమ్స్:**

తేతే...నిదురకు కాదిది వేళా

**కొడుకు కోడలు(1972)కె.వి.మహదేవన్,పద్మశ్రీ పిక్చర్స్:**

గొప్పోళ్ళ చిన్నది-గువ్వల్లే వున్నది,

నా కంటే చిన్నోడు నా తమ్ముడున్నాడు,

చేయీ చేయీ తగిలించి హాయి హాయిగా ఉంది,

నువ్వూ నేనూ ఏకమైనామూ,

నెలకు ఆశలు చూపిందెవరో,

ఇదేనన్న మాట ఇది అదేనన్న మాట,

నీకేం తెలుపూ నిమ్మకాయ పులుసు,

ఆహాహా...ఆహాహా..

**కొత్త జీవితాలు(1981)ఇళయరాజా,రవీంద్ర ఫిలిమ్స్:**

మనసే వెళ్ళెను-మమతే మరచి

**కోకిలమ్మ(1983)**

**యమ్.యస్.విశ్వనాథ్,లక్ష్మీజ్యోతి ఫిలిమ్స్:**

కొమ్మమీద కోకిలమ్మ కుహూ అన్నది,

పల్లవించనా నా గొంతులో పల్లవి,

ఎవ్వరో పాడారు భూపాల రాగం...,

పోనీ పోతేపోనీ మనసు మారిపోనీ,

చలి చలి సంధ్యారాగం

**కోడెనాగు(1974)పెండ్యాల,రాజేంద్రప్రసాద్ కంబైన్స్:**

నాగుపాము పగ పన్నెండేళ్ళు

నాలో కలిసిపో...నా ఎదలో నిలిచిపో,

కథవిందువా... నా కథవిందువా

**కోరికలే గుర్రాలైతే(1979)**

**సత్యం,శ్రీలలితా ఎంటర్ప్రైజెస్:**

కోరికలే గుర్రాలైతే ఊహలకే రెక్కలు వస్తే





**గాంధీనగర్ రెండోవీధి(1988)జి.ఆనంద్, సుశీల ఆర్ట్స్:**
కలకానిది నిజమైనది
**గాజు బొమ్మలు(1983)రమేష్‌నాయుడు,నటనాలయా కంబైన్స్:**
బొమ్మలోయ్ బొమ్మలు,
ప్రతి జీవుడు-ఒక సూర్యుడు
**గాజుల కిష్టయ్య(1975)**
**కె.వి.మమదేవన్,నరేంద్ర ఇంటర్‌నేషనల్ వారి:**
గాజులోయ్..గాజులూ వేసుకో ఈ గాజులు చూసుకో,
నవ్వులు రువ్వే పువ్వమ్మా-నీ నవ్వులు నాకు ఇవ్వమ్మా,
ఇన్నిరోజులింత సొగసు ఏడ దాచుకున్నావు,
రారయ్యా పోయినవాళ్ళు ఎవరయ్యా ఉండేవాళ్ళు,
వద్దు వద్దురా ఈ పాపం మాత్రం చెయ్యొద్దురా,
రేపు వస్తానన్నావు ఈ మాపు ఎక్కడుంటావు
**గాలిపటాలు(1974)టి.చలపతిరావు, అనీల్ ఆర్ట్స్:**
మాను మరల చిగురిస్తుంది చేను మళ్ళీ మొలకేస్తుంది
**గుడిగంటలు(1964)ఘంటసాల,రాజ్యలక్ష్మి ప్రొడక్షన్స్:**
ఎవరికి వారౌ స్వార్థంలో
**గుణమంతుడు(1975)**
**కె.వి.మహదేవన్,శ్రీఉమా ప్రొడక్షన్స్:**
సీతమ్మ నడిచింది రాముని వెంట రాముడు ఉన్నాడు,
నేనుగాక యింకెవరూ నిను కౌగిలిలో పొదిగేది,
కలుసుకున్న తొలిరోజింకా కన్నులలోనే ఉన్నదిరా
**గుప్పెడుమనసు(1979)**
**యం.యస్.విశ్వనాథన్,కళాకేంద్ర మూవీస్:**
నేనా...పాడనా పాట మీరా అన్నది,
నువ్వేనా సంపంగ పువ్వున నువ్వేనా!,
మౌనమె నీ భాష ఓ మూగమనసా,
కన్నెవలపు సన్న పిలుపు
**గుమాస్తా(1953) నాగయ్య,రామనాథం, సి.యస్.పాండురంగం-అరుణఫిలిమ్స్:**
శంకరి జగదీశ్వరి,
అయ్యగారి పెళ్ళానికి,
ఆశలే అడియాసలై,
షోకులాడి అల్లునికి,
కూలేన? ధూళిగా మారెనా?,
శోకాల లోకాల,
ఓయీ, పరుగెక్కడికోయీ,
డాన్స్‌బేబీ డాన్స్
**గురు(1980) ఇళయరాజా,శివశక్తి ఫిలిమ్స్:**
నా వందనము, సరసుల, రసికుల,
పేరు చెప్పనా-నీ రూపుచెప్పనా
**గురుశిష్యులు(1981)**
**కె.వి.మహదేవన్,వైజయంతి మూవీస్:**
తగ్గు తగ్గు-తల తిక్క ఒగ్గు,
చుట్టేసుకోవాలి చుక్కల్లు పొడవాలి,
చెయ్యిపడ్డది చెంపపైన,
అపురూప రూపసి నీవు
**గృహలక్ష్మి(1984) సత్యం, శ్రీ బి.ఆర్.మూవీస్:**
నా స్నేహం నా మోహం,
మేలుకోరా తెలవారెను కృష్ణయ్య,
తల్లీ...యుగయుగాలుగా మీ సహనం
**గోరింటాకు(1979) కె.వి.మహదేవన్, యువచిత్ర:**
ఏటంతవు ఏటంతవూ ఇంతకంటె,
చెప్పనా సిగ్గువిడిచి చెప్పరానివి,





*పాడితే శిలలైన కరగాలి*

**గౌరి(1975) సత్యం,శ్రీవాణి కంబైన్స్:**

*ఈదితే గోదారి ఈదాలి ఏలితే గౌరినే ఏలాలి,*

*ఛీఛీ ఛీఛీ నవ్వు చిన్నారి పొన్నారి నవ్వు,*

*ఎవ్వరికిచ్చేది ముద్దెవ్వరికిచ్చేది*

**ఘటన(1990) మనోజ్, సరస్వతీ ఫిలిమ్ డివిజన్:**

*విధి చేతిలో బొమ్మలు,*

*ప్రియతమా...తొలకరి వలపులోన*

**ఘనవిజయం(1990) రాజ్-కోటి,రోహిణి ఆర్ట్స్:**

*అనగనగా ఒక యిల్లు-దానికి*

**చక్రధారి(1976) జి.కె.వెంకటేష్,లక్ష్మి ఫిలిమ్స్:**

*కనుగొంటినీ హరినీ కనుగొంటినీ దేవాది దేవుని,*

*విఠలా! విఠలా! నువ్వెవరయ్యా నేనెవరయ్యా,*

*పరమహంసను కాను పండితుడను కానూ,*

*పోరా పోకిరి పిలగాడా పొడ్డుటినుంచి ఒకటే పోరు పోరా*

**చక్రవాకం(1974) కె.వి.మహదేవన్,సురేష్ ప్రొడక్షన్స్:**

*వీణలోనా తీగలోనా ఎక్కడున్నది నాదము,*

*ఈ నదిలా నా హృదయం పరుగులు తీస్తూంది,*

*వెళ్లిపో వెళ్లిపో వెళ్ళాలంటే వెళ్ళిపో,*

*కొత్తగా పెళ్ళయిన కుర్రవాడికి పట్టపగలె తొందర,*

*ప్రియతమా-నా ప్రియతమా ఎక్కడున్నా ఎలాగున్నా,*

*వీణలేని తీగను-నీవులేని బ్రతుకును*

**ఛాలెంజ్ రాముడు(1980) చక్రవర్తి,అనిల్ ప్రొడక్షన్స్:**

*ఆ ఎక్కడో ఎప్పుడో చూశాను నిన్ను,*

*చల్లగా లేస్తోంది మెల్లగా రమ్మంది*

**చిట్టిచెల్లెలు(1970)ఎస్.రాజేశ్వరరావు,మురుగన్ బ్రదర్స్:**

*ఓ...పట్టాలి అరక దున్నాలి*

**చిలకమ్మ చెప్పింది(1977)యం.యస్.విశ్వనాథన్, గోపీకృష్ణా ఇంటర్నేషనల్:**

*చిట్టి చిట్టి చేపల్లారా సెలయేటి పాపల్లారా*

*ఎందుకు నీకీ దాపరికము*

**చిల్లర దేవుళ్ళు(1975)**

**కె.వి.మహదేవన్,శ్రీకాకతీయ పిక్చర్స్:**

*పాడాలనే వున్నది*

*కలువకు చంద్రుడు యెంతో దూరం*

**చిలిపి కృష్ణుడు(1978)**

**కె.వి.మహదేవన్, సురేష్ ప్రొడక్షన్స్:**

*గోవిందా...గోవిందా జారిందా... జారిందా...,*

*చీరలెత్తుకెళ్ళాడా చిన్నికృష్ణుడూ చిత్రమే దోచాడీ,*

*ఇందుకేనా ఇది ముందుగ నీకూ తెలిసేనా...,*

*ఎళ్ళొస్తానోయ్ మావ మళ్ళొస్తానోయ్,*

*నేర్చుకో...నేర్పుతానూ నేర్చుకో*

**చిలిపి దంపతులు(1988)**

**శివాజీరాజా,హరితచిత్రా మూవీస్:**

*కొమ్మల్లో కోయిలమ్మ*

**చీకటి వెలుగులు(1975)చక్రవర్తి,రంజిత్ మూవీస్:**

*ఊరుపేరు లేనివాణ్ణి ప్రేమించానమ్మా,*

*మీటి చూడు నీ హృదయాన్ని పటుకుతుంది ఒక రాగం*

**జడ్జిగారి కోడలు(1977)**

**కె.వి.మహదేవన్,శ్రీ సూర్యశ్రీపిక్చర్స్:**

*తల్లీ తండ్రీ దైవం అంటారూ ఈ ముగ్గురు,*

*ఓయమ్మా ఇదెక్కడి మొగుడమ్మా,*

*ఈ చిక్కు నెలా విడదీసేది,*

*అనురాగబంధం అపురూపబంధం,*

*రాతిరి రాతిరి వస్తానన్నావూ,*





ఈ గీతలలో ఏ రాతలున్నవో

**జయం మనదే(1986)**

**చక్రవర్తి,పి.వి.యస్.ఫిలిమ్స్:**

రాణివాసానా ఓ రామ చిలుకా

**జానకిరాముడు(1988) కె.వి.మహదేవన్,యువచిత్ర:**

నా గొంతు శ్రుతిలోన,

రాలుగాయి పిలదానికి రవ్వలాంటి,

అదిరింది మావా అదిరిందిరో

**జీవన తరంగాలు(1973)**

**జె.వి.రాఘవులు,సురేష్ మూవీస్:**

తెంచెయ్...ఆగు... అది పవిత్రమైన మంగళసూత్రం,

ఈ అందానికి బంధం వేశానొకనాడు,

ఈ జీవన తరంగాలలో ఆ దేవుని చదరంగంలో

**జూదగాడు(1979) చక్రవర్తి,సమతా మూవీస్:**

మల్లెలవేళా అల్లరివేళా మదిలో మన్మథలీలా

**జేబుదొంగ(1975) చక్రవర్తి,సమతా ఆర్ట్స్:**

నీలాల నింగిలో మేఘాల తేరులో,

బాబూ దోబూచులా నాతో దొంగాటలా,

రేగాడు రేగాడు కుర్రాడు,

గోవింఅ గోవిందా గుట్టుకాస్తా గోవిందా

**జ్యోతి(1976) చక్రవర్తి,అన్నపూర్ణ సినీ ఎంటర్‌ప్రైజస్:**

ఏడుకొండలపైన ఏల వెలిశావా,

సిరిమల్లె పూవల్లె నవ్వు చిన్నారి పాపల్లె నవ్వు,

నీకూ నాకూ పెళ్లంట నింగికి నేలకు కుళ్లంట,

ఫస్ట్ టైమ్ ఇది ఫస్ట్ టైమ్

**డబ్బెవరికి చేదు(1987)**

**వాసూరావు, తారకనామా మూవీస్:**

డబ్బెవరికి చేదు

**డాక్టర్ ఆనంద్(1966)**

**కె.వి.మహదేవన్,రవీంద్ర ఆర్ట్ పిక్చర్స్:**

చక్కని చల్లని ఇల్లు,

పెరుగుతున్నది హృదయము,

ముసుగు తియ్యవోయి

**డాక్టర్ చక్రవర్తి(1964)**

**ఎస్.రాజేశ్వరరావు,అన్నపూర్ణా పిక్చర్స్:**

పాడమని నన్నడగవలెనా,

పాడమని నన్నడుగతగునా,

నీవులేక వీణ పలకలేనన్నది,

ఎవరో జ్వాలను రగిలించారు

**డ్రైవర్ రాముడు(1979)**

**చక్రవర్తి,తారకరామా ఫిల్మ్ యూనిట్:**

గుగుగుగు గుడిసుంది మ మ మ మ మంచముంది,

ఏమని వర్ణించను నీ కంటి వెలుగును

**తల్లిదండ్రులు(1970)ఘంటసాల,రామవిజేత ఫిలిమ్స్:**

మనిషిని చూశాను

**తల్లీ కొడుకులు(1973)**

**జి.కె.వెంకటేష్,గౌరీశంకర్ ప్రొడక్షన్స్:**

నిన్ను మెచ్చాను నీలో నిజాన్ని మెచ్చాను

**తాతయ్య కంకణం(1986)**

**కె.వి.మహాదేవన్,శ్రీ ప్రభా ఆర్ట్స్:**

శృంగారమంతా...రంగరించి యిస్తా,

గుడిని మింగు వాడొక్కడు,

గానము...గాంధర్వము

**తాయారమ్మా-బంగారయ్య(1979)**

**చక్రవర్తి, పూర్ణోదయ ఆర్ట్ క్రియేషన్స్:**

ఆనాడు ఈనాడు ఏనాడూ ఆడదాన్నీ





**తాళిబొట్టు(1970)**
**కె.వి.మహదేవన్, జయలక్ష్మీ ఆర్ట్స్:**
నిన్నరాత్రి నేను కనుమూయగనే,
చెంపకు చారెడు కళ్ళున్నాయి,
నా కన్నెతనంలో మత్తంతా,
ఎవరన్నారు నీవు మగవాడవని,
చిట్టీ చిట్టీ చేతుల్లో ఏముందో చెప్పుకోండి,
పాడమంటే పాడుతాను

**తాసిల్దారుగారిఅమ్మాయి(1971)**
**కె.వి.మహదేవన్,సత్యచిత్ర ఫిలిమ్స్:**
కనబడని చెయ్యేదో నడుపుతుంది,
పాడమన్నావు,
అల్లరి చేసే వయసుండాలి,
జాజిరి జాజిరి జాజిరి బావ,
చకచకలాడే నడుము చూడు,
నీకున్నది నేనని నాకున్నది నీవనీ

**తిరుగులేని మనిషి(1981)**
**కె.వి.మహాదేవన్,దేవి ఫిలిమ్ ప్రొడక్షన్స్:**
సారిగపా సారిగపా,
నిన్ను పుట్టించినోడు బ్రహ్మదేవుడు,
మధురం-మధురం,
యవ్వనం ఒక నందనం

**త్రిశూలం(1982)కె.వి.మహదేవన్,యువచిత్ర:**
తంతననం...తంతననం...పన్నెండేళ్ళకు పుష్కరాలు,
వెలుగుకు ఉదయం,
అనుకోలేదమ్మా ఇలా వుంటుందని,
సుప్రభాతం సుప్రభాతం,
పెళ్ళంటే...?పెళ్ళంటే పందిళ్ళు సందళ్ళు,
రాయిని ఆడది చేసిన రాముడివా

**తులసి(1974) ఘంటసాల,రామవిజేత ఫిలిమ్స్:**
ఈ రాళ్ళకు నోళ్ళుంటే ఈ కన్నీళ్ళకు కసివుంటే

**తులాభారం(1974) సత్యం,శ్రీరమణ చిత్ర:**
ఈ ఊరే నా యిల్లు ఊరంతా నా వాళ్లు

**తేనెమనసులు(1962)కె.వి.మహదేవన్,బాబూ మూవీస్:**
చందమామ అందాల మామ,
ఏమమ్మా నిన్నేనమ్మా,
వన్ టూ త్రీ ఫోర్,
అనాదిగా జరుగుతున్న అన్యాయం ఇదిలే,
ఏం? ఎందుకని?,
పురుషుడు నేనై పుట్టాలి

**తొలికోడి కూసింది(1981)**
**యమ్.యస్.విశ్వనాథన్, రంజిత్‌మూవీస్:**
అందమైన లోకమని రంగు రంగులుంటాయని,
పోలీసెంకటసామి నీకు

**తోటరాముడు(1974) సత్యం,శ్రీరమణ చిత్ర:**
నేస్తం చూడర ఈ కుళ్ళు లోకము చూస్తే కోరవు ఈ నరజన్మ

**తోడికోడళ్లు(1957)మస్టార్ వేణు, అన్నపూర్ణ పిక్చర్స్:**
కారులో షికారుకెళ్లే,
ఎంతెంత దూరం కోసెడు దూరం

**తోడు-నీడ(1982) చక్రవర్తి,మహేశ్వరీ మూవీస్:**
నా తోడువై, నా నీడవై నా లాలన,
పూజలెన్ని చేసాను నీ పూజకోసం

**తోడూ నీడ(1965)**
**కె.వి.మహదేవన్,విజయ్‌భట్ మూవీస్:**
వలపులోని చిలిపితనం యిదిలే,





ఎన్నోరాత్రులు వస్తాయి,

మళ్ళున్నా మాన్యాలున్నా,

అత్త ఒడి పువ్వువలె

**దసరాబుల్లోడు(1971) కె.వి.మహాదేవన్,జగపతి పిక్చర్స్:**

ఓ మల్లయ్యగారి ఎల్లయ్యగారి,

నల్లవాడే అమ్మొమ్మో,

అరెరెరెరె..ఎట్టాగో వున్నాది ఓలమ్మి,

పచ్చగడ్డి కోసేటి పడుచుపిల్లో,

చేతిలో చెయ్యేసి చెప్పుబావ,

వెళ్ళిపోతున్నావా అమ్మా

**ధర్మపోరాటం(1983)సత్యం,శ్రీలక్ష్మీప్రసన్న పిక్చర్స్:**

లాలలల లలలల...మోహనరాగం పొంగెను,

ఓ దైవమా...ఇదే ధర్మమా?

**దాగుడుమూతలు(1964)కె.వి.మహదేవన్,డి.బి.యన్.వారి:**

అడగక ఇచ్చిన మనసే ముద్దు,

అందలం ఎక్కాడమ్మా,

మెల్లమెల్లమెల్లగా అణువణువు,

దేవుడనేవాడున్నాడా అని మనిషికి కలిగెను

**దాగుడుమూతలు(కొత్తది)1986**

**జె.వి.రాఘవులు,గౌతమ్ చిత్ర:**

ఓ పిచ్చి దేవుడా-మనసిచ్చి చూడరా,

కడలేని కడలి వున్నది-అటు తుదిలేని

**దాసి(1952)**

**సుబ్బరామన్-దక్షిణామూర్తి,రాజ్యం ప్రొడక్షన్స్:**

మారాజుల చాకిరి చేసి,

జోర్సె ఛలో,

కలకలలాడే పండుగ నేడు,

చిట్టి తల్లి నవ్వవే,

ఏడువకమ్మా ఏడువకు,

తీరిపోయింది కన్నపిల్లలకు,

సల్లంగ సుక్కాని తిప్పురా అయిలెసా,

కొత్తకాపురం నేడు నా మొగుడు,

సున్న సున్న కూడుకున్న,

వయసు సొగసు యువరాణి,

నా చిన్నారి బావ

**దీర్ఘసుమంగళి(1974)సత్యం,గోపాలకృష్ణా పిక్చర్స్:**

దీర్ఘసుమంగళిగా దీవించండి దేవతలారా

**దీక్ష(1951)పెండ్యాల,ప్రకాష్ ప్రొడక్షన్స్:**

పోరాబాబు పో..పోయి చూడు ఈ లోకం పోకడ,

తీయని కథ ఇటే తీరెనా,

ఏమౌతుందో ఇంకేమౌతుందో,

మనుషులంటే వీళ్ళేనా

**ధ్రువనక్షత్రం(1988)చక్రవర్తి,శ్రీఉషా ఆర్ట్స్ ప్రొడక్షన్స్:**

ఈ అర్ధరాతిరిలోన పాపా,

కసిగా ఓ కూగిలి యిస్తా కాదనకయ్యా

**దేవత(1982)చక్రవర్తి,సురేష్ ప్రొడక్షన్స్:**

హాయ్-చీర కట్టింది సింగారం,

చల్లగాలి చెప్పేది ఏమని

**దేవుని రూపాలు(1982)సత్యం,భానోదయా ఫిలిమ్స్:**

నల్లని కన్నయ్య పిల్లన గ్రోవి

**దేశోద్ధారకులు(1973)**

**కె.వి.మహదేవన్,దీప్తి ఇంటర్‌నేషనల్ వారి:**

కోరుకున్న దొరగారూ కొంగుపట్టుకున్నారు,

మబ్బులు రెండు బేటీ అయితే మెరుపే,

ఈ వీణకు శ్రుతిలేదు ఎందరికో హృదయం లేదు





**దొంగలున్నారు జాగ్రత్త!(1958)**
**కె.వి.మహాదేవన్,ప్రతిభా పిక్చర్స్:**
అయ్యోయ్ ఓరయ్యోయ్,
కల్లకాదు కలాకాదు,
వినరా నాన్నా,
హాసమా పరిహాసమా,
ఏమనెనోయి ఆమనిరేయి,
తెలుసుకోండి ఈ నిజం
**దొరబాబు(1974)జె.వి.రాఘవులు,ఫణిమాధవీ కంబైన్స్:**
చంద్రగిరి చంద్రమ్మా సందేళకొస్తానమ్మా,
వద్దు వద్దు వద్దు ముద్దు యివ్వొద్దు
**ద్రోహి(1970) రాఘవులు,సురేష్ ప్రొడక్షన్స్:**
ఉన్నాడు దేవుడు
**నాకూ పెళ్ళాం కావాలి(1987)**
**వాసూరావు,శ్రీనాథ్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్:**
పుత్తడిబొమ్మా మా అక్క,
ఎవ్వడో అతడెవ్వరో ఒకడొస్తాడు
**నాటకాలరాయుడు(1969)**
**జి.కె.వెంకటేష్,హరిహర పిక్చర్స్:**
రాయుడా నారాయుడా నాటకాల రాయుడా,
ఇది జీవితమురా ఇదే దాని కతరా,
నలభైకి డెబ్భైకి తేడా ఎంతా,
ఇదేనా నేనెదురు చూచిన ప్రజాస్వామ్యం,
వేళచూడ వెన్నెలాయె లోన చూడ వెచ్చనాయె,
చిన్నవాడ వన్నెకాడ అన్నెము పున్నెము,
ఓ...నిరుపేద కనుఉలు నెమరేసే
**నాతమ్ముడు(1971)పెండ్యాల,యస్.బి.ఆర్.పిక్చర్స్:**
అక్కడకాదు యిక్కడ అసలు సవాలే,
చిన్నారి పాపలా పొన్నారి తోటలో,
దండాలు దండాలండి గురువుగారూ మీకు,
అలవాటు లేదని మడిగట్టుకోకు అందాన్ని కాదని
**నా పేరే భగవాన్(1976)**
**చక్రవర్తి,శ్రీలక్ష్మినారాయణ ఎంటర్ప్రైజస్:**
నిన్న నీవు నీవు కావు చీకటిలో పూచిన వెలుగు
**నారీ నారీ నడుమ మురారి(1990)**
**కె.వి.మహాదేవన్,యువచిత్ర:**
ద్వాపరమంతా సవతుల సంత
**నాలాగేఎందరో(1978)**
**యం.యస్.విశ్వనాథన్,ఆర్.కె.ఆర్.ప్రొడక్షన్స్:**
కళ్యాణిని...కళ్యాణిని..,
అనుభవాలకు ఆదికావ్యం ఆడదాని జీవితం
**నిండు కుటుంబం(1973)**
**యస్.రాజేశ్వరరావు, సీతారామాంజనేయ మూవీస్:**
తళ తళ తళ తళ మెరుపే పెరిసింది,
ఎవరు కారణము ఈ లోకమిలా అల్లకల్లోలమగుటకు
**నిరీక్షణ(1986) ఇళయరాజా,లక్ష్మీ ఫిలిమ్స్ డివిజన్:**
ఆకాశం ఏ నాటిదో అనురాగం ఆ నాటిది,
చుక్కల్లే తోచావే వెన్నెల్లె కాచావే,
హూయ్‌రే వీరే హూయ్యారి హూయ్,
తియ్యని దానిమ్మ కొమ్మల్లోనంట
**నిలువుదోపిడి(1968) కె.వి.మహదేవన్,మంజులా వారి:**
అయ్యింది అయ్యింది అనుకున్నది
**నీరాజనం(1989) ఓ.పి.నయ్యర్, లలితశ్రీ కంబైన్స్:**
మనసొక మధుకలశం,
నేనే సాక్ష్యం...ఈ ప్రేమ యాత్రకేది అంతమూ





**పంచాయతీ(1977)కె.వి.మహదేవన్,ఆదుర్తి ఆర్ట్స్:**

ఈ నేలకు తెలుసు నీటికి తెలుసు చేలకు తెలుసు

**పందండి ముందుకు(1962)కోదండపాణి,జాగృతి చిత్ర:**

మనసు మంచిది వయసు చెడ్డది

**పండంటి కాపురానికి 12 సూత్రాలు(1986)**

**సత్యం,అనంతలక్ష్మీ ఇంటర్నేషనల్:**

వెన్నెల్లో ఈ నీలాకాశం

**పండంటి సంసారం(1975)పుహళేంది, నందినీ ఫిలిమ్స్:**

శ్రీరామచంద్రా లాలీ శ్రీ సుగుణసాంద్రా లాలీ,

చావే ఎరుగని ఇంటినుంచి ఆవాలు

**పదహారేళ్ళ అమ్మాయి(1986)**

**శివాజీరాజా,శ్రీశైలజా ఫిలిమ్స్:**

నా ప్రేమ పండింది నీ పెదవిలో

**పద్మవ్యూహం(1986) సత్యం, శ్రీలక్ష్మీప్రసన్న పిక్చర్స్:**

ఎవరు నీవారెవరు నెరవారు,

దిగు దిగు దిగు నాగా,

భుజంమీద చెయ్యి-నడుంమీద చెయ్యి,

చీరైనా కట్టనీయరూ, రైకైనా తొడగనీయరూ,

ఎక్కడ వున్నావు-ఏమైపోయావూ

**పల్లెటూరి బావ(1973)**

**టి.చలపతిరావు,ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్:**

ఒసె వయ్యారి రంగీ-వగలమారి బుంగీ ఊగిందే

**పల్లెటూరి మొనగాడు(1982)**

**చక్రవర్తి,రాజ్యలక్ష్మీ ఆర్ట్స్ పిక్చర్స్:**

అక్కుం అక్కుం అక్కుం అక్కుం,

ఎవరోయ్ నెద్దోళ్ళు యెవరోయ్ ఉన్నోళ్ళు,

పలుకే బంగారమా ఓ గున్నమామిడి,

జడలోని బంతిపువ్వు కడగంటి

**పాడి పంటలు(1976)**

**కె.వి.మహదేవన్,విజయకృష్ణా మూవీస్:**

అట్లతద్దోయ్ ఆరట్లోయ్ ముద్దపప్పోయ్ మూడట్లోయ్,

ఇరుసేలేని బండి ఈశ్వరుని బండి

**పాపకోసం(1968)జె.వి.రాఘవులు,విజయా-సురేష్:**

రాముడెందుకు పుట్టాడు-మంచి కోసం రహీమెందుకు,

బాబూ! మనిషి మనిషికీ తేడా వుంది,

కొండలపైన కోనలలోన,

ఉల్లిపూలా పడవా గట్టి మావా,

కొండలపైన కోనలలోన గోగులు పూచె

**పాపం పసివాడు(1972) సత్యం, శ్రీలక్ష్మీ ప్రొడక్షన్స్:**

అయ్యో పసివాడా పాపం పసివాడా,

అమ్మా చూడాలి నిన్నూ నాన్నను చూడాలి

**పారిజాతం(1980)కె.వి.మహాదేవన్,బి.వి.ఆర్.ప్రొడక్షన్స్:**

నిన్నొక చిన్నది నాతో అన్నది,

నీకోసం కల్లుముంత తెచ్చానురో,

పూచిన ప్రతి పారిజాతము,

పూచిన ప్రతి పారిజాతమా

**పాలమనసులు(1965) సత్యం,గౌరీ ప్రొడక్షన్స్:**

బుడిబుడి నడకల బుజ్జాయి

**పిచ్చిపంతులు(1983)చక్రవర్తి,జయభేరి ఆర్ట్ ప్రొడక్షన్స్:**

మారాము చేయకుండా గారాలు,

దోచే దొంగలా మేసే కంచెలారా,

ఓ హెూహెూహెూయ్..

**పిచ్చిమారాజు(1975)**

**కె.వి.మహదేవన్,జగపతి ఆర్ట్ ఎంటర్‌ప్రైజస్:**

సింగినాదం జీలకర్రరోచ

ఓ కుర్రవాడా వెర్రివాడా ఎందుకిలా నువ్వెందుకిలా,





ఎలుకతోక తెచ్చి ఏడాది ఉతికినా అయ్యో,
కొత్త పిచ్చోడూ పొద్దెరగడు కొంగులాగే లొంగదీసి
**పుట్టింటి గౌరవం(1975)సత్యం,శ్రీవాణి ఆర్ట్స్:**
అన్నయ్య నను కన్నయ్యా,
తాగు మనసైతే మధువు తాగు వీల్లేకుంటే విషం తాగు
**పుణ్యంకొద్దీ పురుషుడు(1984)సత్యం,రవిచిత్ర ఫిలిమ్స్:**
టిమ్ టామ్ టిమ్మని వాయించరా,
దానిమ్మ పండా చామంతి చెండా,
హేయ్...నువ్వంటే నాకుప్రేమంటా...
**పున్నమి చంద్రుడు(1987)చక్రవర్తి,రాశీ మూవీస్:**
గోదారి వెన్నెల పొంగింది,
బావా రోజూ కమ్మని కలలు,
టి ఒకటే మధురమైనది మరువరానిది టీటీటీ,
ఉత్తుత్తిపండు ఉత్రాని పండు
**పులిబిడ్డ(1981)చక్రవర్తి,హేరంబ చిత్ర మందిర్:**
కాశీ విశ్వనాథా...! తండ్రీ విశ్వనాథా..!
**పెళ్ళికానుక(1960)ఎ.ఎం.రాజా, వీనస్ పిక్చర్స్:**
ఆడేపాడే పసివాడా-అమ్మలేని నిను చూడా,
మగనాలి వదనాన మాంగల్య కళలీను,
వాడుక మరచెదవేల-నను వేడుకచేసెదవేల,
పులకించని మది పులకించు వినిపించని కథ వినిపించు
**పెళ్ళిచూపులు(1983)**
**కె.వి.మహాదేవన్, సారథీ స్టూడియోస్:**
దాసోహం దాసోహం దాసోహం,
ఉంగా ఉంగని ఉగ్గే తాగవే,
నువ్వు నేను సగం సగం,
నిన్నే నిన్నే తలచుకొని

**పెళ్ళీడు పిల్లలు(1982)**
**యం.యస్.విశ్వనాథన్, అన్నపూర్ణ పిక్చర్స్:**
హరీహెహా ఓ...హ...ననన...నననన పదహారు ప్రాయం,
ఉండి ఉండి గుండెవచ్చి
**పొటేలు పున్నమ్మ(1978)కె.వి.మహదేవన్,దేవర్ ఫిలిమ్స్:**
గలగల జలజల జలజల గలగల,
ఈ దాహం తీరిందే పున్నమ్మా
**పోరాటం(1983)చక్రవర్తి,యస్.ఆర్.ఫిలిమ్స్:**
ఇది ఆది మానవుని ఆరాటం,
ఏ దేవుళ్ళు శాసించినారో,
ఏ దేవుళ్ళు శాసించినారో
**ప్రజానాయకుడు(1972),కె.వి.మహదేవన్,శశి థియోటర్స్:**
.ఏరువాకమ్మా మాకెదురు రావమ్మా,
ఓ దొరా! లే దొరా! రాదొరా!,
ఏమిటలా వున్నావు,
ఎందుకు రమ్మన్నావు ఏం పొందాలి అనుకున్నావు,
ఓలమ్మీ అమ్మీ, అమ్మీ అమ్మీ పండగొచ్చింది
**ప్రతిజ్ఞ(1982) సత్యం,శ్రీలక్ష్మీప్రసన్న పిక్చర్స్:**
దేవుడివా నువ్ గారడివా,
వెన్ను ముదిరివున్నాది వయసు-ఆహ
**ప్రాణమిత్రులు(1967) కె.వి.మహదేవన్,పద్మశ్రీ పిక్చర్స్:**
తెల్లవారెను కోడి కూసెను,
వయసు పెరిగినా మనిషి ఎదిగినా మనసు,
తలుపు తలుపు తలుపు తెరూ,
మనసూ మమతా మనిషికి యిచ్చి





**ప్రియ(1981)చక్రవర్తి,ప్రభుచిత్ర:**

అనురాగం పొంగింది-నవరాగం సాగింది,

నా హృదయమా-నాహృదయ ఉదయరాగమా,

నా హృదయమా-నాహృదయ ఉదయరాగమా

**ప్రేమ(1988)ఇళయరాజా,రాజరాజేశ్వరీ ఫిలిమ్స్:**

మౌనంగానే గుండె దడదడ,

ఈనాడే ఏదో అయ్యింది,

ఎక్కడ ఎక్కడ పోతావురా,

వాద్యాన్ని వాయించాలంటే,

ఇవ్వు ఇవ్వు ఒక్క ముద్దు,

ప్రియతమా నా హృదయమా,

ఒంటరివాడిని నేను

**ప్రేమకానుక(1981)చక్రవర్తి, అన్నపూర్ణా స్టూడియోస్:**

ఈ కొండ కోనల్లో నీరెండ ఛాయల్లో,

మనసు ముడి పెదవుల తడి,

చెమ్మా చెక్కా సక్కనోడు,

ఓ నవమదనా రారా -నా ప్రియవదనా రారా,

జంతర్ మంతర్ ఆటలాడాలి

**ప్రేమతరంగాలు(1980)చక్రవర్తి,ప్రభుచిత్ర:**

నవ్వేందుకే ఈ జీవితం,

మనసు ఒక మందారం చెలిమి తన మకరందం,

నా హృదయం తెల్లకాగితం అది ఏనాడో నీకు అంకితం,

నా హృదయమా! హృదయ ఉదయ రాగమా!

**ప్రేమనగర్(1971)కె.వి.మహదేవన్,సురేష్ మూవీస్:**

నేను పుట్టాను లోకం మెచ్చింది నేను ఏడ్చాను,

ఉంటే యీ వూళ్ళో వుండు పోతే మీ దేశం పోరా,

లేలేలే నా రాజా లేలే నా రాజా,

ఎవరో రావాలి నీ హృదయం కదిలించాలి,

కడవెత్తుకొచ్చింది కన్నెపిల్ల,

తేట తేట తెలుగులా తెల్లవారి వెలుగులా,

మనసు గతియింతే మనిషి బ్రతుకింతే,

ఎవరికోసం ఈ ప్రేమమందిరం,

కలవని దీనుల పాలిట

**ప్రేమయుద్ధం(1990)హంసలేఖ,అనుపమ ఆర్ట్స్:**

ఈమువ్వల గానం మన ప్రేమకు ప్రాణం

**ప్రేమలు, పెళ్ళిళ్ళు(1974)యం.యస్.విశ్వనాథన్, అనంతలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్:**

మనసులేని దేవుడు మనిషికెందుకో మనసిచ్చాడు,

ఎవరు నీవు నీ రూపమేది

**ప్రేమించి చూడు(1965)మాస్టర్ వేణు,పద్మశ్రీ పిక్చర్స్:**

అది ఒక యిదిలే అతనికె తగులే,

ప్రేమించి చూడుపిల్లా పెళ్ళాడుదాము

**ప్రైవేటు మాష్టారు(1967)**

**కె.వి.మహదేవన్,డి.బి.ఎన్.ఫిలిమ్స్:**

మనసుంటే చాలదులే మనిషికి ఆశలు తీరాలంటే,

మల్లెపూల మంచం ఉంది మనసుంది,

చిరుచిరు జల్లుల చినుకుల్లారా,

అద్దంలో...అద్దంలో కనిపించేది ఎవరికి

**బంగారు కలలు(1974)**

**యస్.రాజేశ్వరరావు,అన్నపూర్ణా పిక్చర్స్:**

మంచితనానికి తావేలేదు మనిషిగ మసలే వీలులేదు

**బంగారు కాపురం(1982)**

**జె.వి.రాఘవులు,కుమారరాజా పిక్చర్స్:**

మేలుకో...మనసు మేలుకోవాలి





**బంగారు చెల్లెలు(1979)**

**కె.వి.మహదేవన్,విజయలక్ష్మీ ఆర్ట్ పిక్చర్స్:**

విరిసిన సిరిమల్లీ పెరిగే జాబిల్లి,

పసుపు కుంకుమ తెస్తాడు,

అన్నయ్య హృదయం దేవాలయం

**బంగారు తల్లి(1971)**

**యస్.రాజేశ్వరరావు, బాబు పిక్చర్స్:**

వెళ్ళిపోతారా వెళ్ళిపోతారా ఇల్లువాకిలి అన్నీవిడిచి,

బంగరుతల్లి పండిందోయ్ పంటల పండుగ

**బంగారు బాబు(1973)**

**కె.వి.మహదేవన్,జగపతి ఆర్ట్‌పిక్చర్స్:**

గౌరమ్మ తల్లీ గౌరమ్మ తల్లీ కోరిన కోర్కెలు,

తగిలిందయ్యో తగిలింది పైరగాలి,

చెంగావి రంగుచీర కట్టుకున్న చిన్నది,

శ్రీరామచంద్రా నారాయణా,

ఏమనుకున్నావు నన్నేమనుకున్నావు,

ఏడడుగుల సంబంధం ఏనాడో వేసిన బంధం,

కన్నయ్యలాంటి అన్నయ్యలేని కన్నులెందుకూ

**బంగారు భూమి(1982)**

**జె.వి.రాఘవులు,మహేశ్వరీ మూవీస్:**

ఆరిపేయ్ ఆరిపెయ్ చలిమంట,

చిటపట చిటపట చిటపట చినుకే,

పొంగింది పొంగింది బంగారు భూమి

**బంగారు బొమ్మలు(1977)**

**కె.వి.మహదేవన్, జగపతి ఆర్ట్‌పిక్చర్స్:**

అయ్యయ్యో...బంగారు బాబూ,

హే... హే... హే... హే.. సుబ్బయ్య...సూరయ్య,

అరెరరే రరెరే ఇది పొగరబోతు పోట్లగిత్తరోయ్,

నేనీదరినీ నువ్వా దరినీ,

నేను నేనుగా నీవు నీవుగా,

అమ్మా...తీరిపోయిందా..తీయని బంధం

**బంగారు సంకెళ్ళు(1968)**

**యం.పూర్ణచంద్రరావు,బాలా ప్రొడక్షన్స్:**

అందం పురికింది వయసుతో పందెం వేసింది

**బందరాముడు(1959)**

**ఎస్.దక్షిణామూర్తి-ప్రసాదరావు, సాహిణీ ఆర్ట్ ప్రొడక్షన్స్:**

సాగిపోయే ఓ చందమామా...ఆగుమా..ఒకసారి

**బడిపంతులు(1972)కె.వి.మహదేవన్,త్రివేణి ప్రొడక్షన్స్:**

భారతమాతకు జేజేలు,

పిల్లలము బడి పిల్లలము,

నిన్నమొన్న రేకు విప్పిన లేతమొగ్గా,

మీ నగుమోమూ నా కనులారా,

ఓరోరి పిల్లాగాడా వగలమారి పిల్లాగాడా,

బూచాడమ్మా బూచాడు బుల్లిపెట్టెలో వున్నాడు

**బలిదానం(1982)చక్రవర్తి,సంతోష్ ఆర్ట్ మూవీస్:**

నా మునివేళ్ళకు -నా కొనగోళ్ళకు

**బ్రతుకే ఒక పండుగ(1975)**

**కె.వి.మమదేవన్,కిరణ్ ప్రొడక్షన్స్:**

గోపాలా...గానలోలా గొంతు గుండెకు దగ్గరున్నది,

పడ్డావటే పిల్లా పడ్డావటే పడక పడక ప్రేమలో పడ్డావటే,

ఎన్ని ఎన్ని ఎన్ని ఎన్ని ముద్దులున్నవి,

నీ కళ్ళకు మనసుంది ఆ మనసుకు చూపుంది

**బ్రహ్మచారి(1967)టి.చలపతిరావు,ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్:**

ఏ తోటలో విరబూచెనో ఈ పువ్వు





**బాబు(1975) చక్రవర్తి,మారుతీ ప్రొడక్షన్స్:**
*అయ్యబాబోయ్ అదిరిపోయింది ఆడపిల్లతో,*
*ఏయ్ బాబూ నిన్నే బాగుందా?,*
*ఒక జంట కలసిన తరుణాన జే గంట మ్రోగెను...*
*నా స్నేహం పండి ప్రేమై నిండిన,*
*ఓయమ్మ ఎంతలేసి సిగ్గొచ్చింది*

**బొబ్బిలి సింహం(1990)**
**రాజ్-కోటి,శ్రీభాగ్యలక్ష్మి ఆర్ట్స్ ప్రొడక్షన్స్:**
*ముద్దముద్దకు ఆం ముద్దకు*

**బొమ్మల పెళ్ళి(1958)**
**కె.వి.మహదేవన్-పుహళేంది,అరుణాఫిలిమ్స్:**
*రారమ్మ! రారమ్మ! బొమ్మల పెళ్ళి నేడమ్మా,*
*చిక్కావే చినదానా! చిక్కావే నెరజాణా,*
*చిట్టిబావా! చిట్టిబావా! చేసుకుంటావా?,*
*కళ్యాణమే చెలివైభోగమే కన్నుల పండుగ,*
*హాయిగా తీయగా అనురాగం పండగా,*
*నిన్నే నిన్నే మేఘమా! నిమిషంసేపు,*
*ఔనా! ఇది తుదియౌనా ఎడబాటే,*
*వసంత మింతేనా ఈ...వసంతమింతేనా*

**భలే అల్లుడు(1977)జె.వి.రాఘవులు,ప్రపూర్ణ మూవీస్:**
*ప్రేమిస్తే ఏమవుతుంది? ఊ పెళ్లవుతుంది,*
*ఓ...బెల్లంకొట్టిన రాయి నీకూ ఏళ్లొచ్చాయి*

**భలేకృష్ణుడు(1980)చక్రవర్తి,విజయ క్రియేషన్స్:**
*బృందావనమొక ఆలయము,*
*పొన్నచెట్టు నీడలోకన్నయ్య పాడితే,*
*ఎవరు నువ్వు?...ఎవరు నువ్వు?*

**భక్త తుకారం(1973)**
**ఆదినారాయణరావు,అంజలీ పిక్చర్స్:**
*కలియుగం! కలియుగం! కలుషాలకు ఇది నిలయం!*
*ఉన్నావా! అసలున్నావా ఉంటే కళ్ళు మూసుకున్నావా!*

**భలేమొగుడు(1989) సత్యం,మహేశ్వరీ మూవీస్:**
*ఆలుమగల దాంపత్యం*

**భలే రాముడు(1985)**
**శంకర్-గణేష్,శ్రీలక్ష్మీప్రసన్న పిక్చర్స్:**
*నా కౌగిలి దూకే పులి,*
*గడ్డివాము సాటుల్లో - గెడసెరుకు తోటల్లో*

**భామాకలాపం(1988)**
**వాసూరావు,రాగహేమజా ఫిలిమ్స్:**
*అయ్యయ్యో పిచ్చెక్కింది*

**భార్య(1968) మాష్టార్ వేణు, కౌముదీ ఫిలిమ్స్:**
*వయసంటే ఏమనుకొన్నావూ*

**భార్యాభర్తల బంధం(1985)**
**చక్రవర్తి,జగపతి ఆర్ట్ పిక్చర్స్:**
*కోకంతా తడిసింది బాలచంద్రా,*
*మనసు మనసు కలసినవేళ లగ్నంగా,*
*గజిబిజి మనసు గడబిడి వయసు,*
*ఓలమ్మి ఓలమ్మి ఒంటరి తుంటరి పడుచు పిల్లవే,*
*నా తండ్రి రామయ్య రాజ్యాన్ని ఏలావయ్యా*

**భార్యాబిడ్డలు(1971)**
**కె.వి.మహదేవన్,ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్:**
*చల్ మోహన రంగా ఓ చల్ చల్ మోహనరంగా,*
*అందమైన తీగకు పందిరుంటే చాలును,*
*ఆకులు పోకలు యివ్వద్దు నా నోరు ఎర్రగ,*





చక్కనయ్య చందమామా ఎక్కడున్నావూ,

లేనిబాట వెతుకుతున్న పేదవానికి,

బలే బలే వచ్చారు అబ్బాయిగారు,

వలచీనానమ్మా-వలచీనానమ్మా

**భువనేశ్వరి(1979) సత్యం, జయ ఆర్ట్స్:**

అన్నీవున్నా ఏమీలేని అదృష్టవంతుణ్ణి

**భోగి మంటలు(1981) రమేష్‌నాయుడు,రోహిణీ ఆర్ట్స్:**

భోగుల్లో భోగుల్లో భోగభాగ్యాలా భోగుల్లో

**మంచిని పెంచాలి(1980) ఎం.ఎం.రాజా,జగజ్జననీ ప్రొడక్షన్స్:**

కావాలి...ఒకటి కావాలి

**మంచి మనుషులు(1974)**

**కె.వి.మహదేవన్,జగపతి ఆర్ట్ పిక్చర్స్:**

పడకు పడకు వెంట పడకు పడుచు పిల్లకు ఆశపడకు,

శ్రీమద్రమారమణ...హరిలె రంగహరి..,

నీవులేని నేను లేను నేను లేక నీవు లేవు,

నిన్నుమరచి పోవాలని అన్ని విడిచి వెళ్ళాలని,

పెళ్ళయ్యింది ప్రేమమిందుకు వేళయ్యింది

**మంచి మనసులు(1962)**

**కె.వి.మహదేవన్,బాబూ మూవీస్:**

ఓ హెూ ఓ హెూ పావురమా వయ్యారి పావురమా,

అహెూ! ఆంధ్రభోజా! శ్రీకృష్ణదేవరాయా!

**మంచి మనసులు(1986)**

**ఇళయరాజా,శ్రీనివాసాచిత్ర:**

జాబిల్లి కోసం ఆకాశమల్లే వేచాను నీ రాకకై

**మంచిమనిషి(1983)చక్రవర్తి,అభినయ మూవీస్:**

ఏది ధర్మమో ఏదధర్మమో..ఏది సత్యమో,

తకధిమి తకధిమి పుత్తడి బొమ్మ

**మంచివాడు(1973) కె.వి.మహదేవన్,వీనస్ కంబైన్స్:**

ఆకలుండదు దాహముండదు నిన్ను చూస్తుంటె,

చిట్టిపాపలు కథలు వింటూ,

అమ్మాయే పుడుతుంది అచ్చం అమ్మలాగే వుంటుంది,

చూస్తా బాగా చూస్తా చేయిచూస్తా చూసి చెబుతా,

పెట్టి పుట్టినదానవమ్మా నువ్వు

**మంచీ-చెడూ(1963)**

**విశ్వనాథన్-రామమూర్తి,ఆర్.ఆర్.పిక్చర్స్:**

పుడమి పుట్టెను నాకోసం పూలు పూసెను,

తోడు నీడ ఎవరూ లేని ఒంటరి వాడు,

దోరదోర వయసిచ్చాడు దోచుకోను,

ఘల్ ఘల్ ఘల్లని మోగాలీ,

రేపంటి రూపం కంటీ పూవంటి తూపుల వంటీ,

తేరేల గుడిఏల తిరుణాళేలా,

పూచిన పువ్వే వాడినది

**మండే గుండెలు(1979)**

**కె.వి.మహదేవన్,సురేష్ మూవీస్:**

బంగారానికి సింగారానికి కుదిరింది బేరం,

స్నానాల గదిలో సంగీతమొస్తుంది

**మట్టిలో మాణిక్యం(1971) సత్యం,శ్రీరమణ చిత్ర:**

నా మాటే నీ మాటై చదవాలి నేనంటే

**మదన గోపాలుడు(1987)**

**శివాజీ రాజా, శ్రీశైలజా కంబైన్స్:**

మదన గోపాలుడు మదన గోపాలుడు,

కొండవాగై కోడెనాగై కుర్రవయసు గంగవెర్రులెత్తి,

ప్రమదల ఆశల ప్రమిదల,



